# కమాల్ పాషా జీవితము

దేశోద్ధారక గ్రంథమాల

ప్రచురణము 3



వెల ఆరు అణాలు





ఖండవల్లి బాలేందుశేఖరముగారు, బి.ఏ. (ఆనర్సు.)

# ప్రజాభిప్రాయములు

## హైందవధర్మపోలిలు

(గ్రం. స. ప్రతాపరెడ్డిగారు. బి. ఏ., బి. ఎల్.)

"సులభశైలిలో తేటతెలుగున వ్రాయబడినది. అంతా నుసిబారని కణకణ లాడు నిప్పుకణమే. అభివర్ణితములైనవన్నియు రక్తమునుడికెత్తించు వీర కథానకములు. హిందూదేశమునందలి వివిధప్రాంతముల చరిత్రలనుండి రసగుళికలనేరి శ్రీ ప్రతాపరెడ్డిగారు నూతనముగా ఒక చక్కని సారస్వత భూషణమును సమర్పించినారు"

—మల్లంపల్లి సోమశేఖర శర్మగారు

" వీరగాథలు మేనులు పులకరించునట్లు వచనములలో వర్ణించబడియున్నవి. జనులలో ప్రచారమందుటకు ఎంతయుతగియున్నది"

—గోలకొండపత్రిక

"పెద్దలకూ, పిల్లలకూ కూడ సుబోధకంగా ఉండే ఒక సారస్వతభూషణం. ఇతిహాస ప్రసిద్ధమైన 'ధర్మపోలి' సమరము నాటి మహాయోధుల సాహసము, ధైర్య [illegible] వీరగాథలనుచక్కగా అభివర్ణించారు

—ప్రజామిత్ర

[illegible] పల్నాటివీరులకథలు, మేవాడ్ పతనము, [illegible] మున్నగు గ్రంథము లున్నప్పటికిని [illegible]. కాని శ్రీ రెడ్డిగారు రచించిన ధర్మపోలీల [illegible]హావనలోకన మొనర్చి, జాతిమత వివక్షత [illegible]నకందిచ్చినారు."

—ఆంధ్రవాణి

[illegible] ప్రాచీనవైభవము, మన పతనమును కన్ను [illegible]మానదు."

—ఆంధ్ర వారపత్రిక

[illegible] రక్తము నుడుకెత్తి, వడలుపులకరింప [illegible]ములయందలి చరిత్రలనుండి సంగ్ర [illegible]కూడ నర్థమానట్లు తేటతెలుగున

—గృహలక్ష్మి

[illegible]స్తకము చిన్నదేకాని, అంతానుసి [illegible]ములైనవన్ని రక్తము నుడుకెత్తించు [illegible]ట్టివి కాలయవనిక మడతలలో ఎన్న [illegible]శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి

—భారతి

[illegible]లు సులభమగునట్టియు, సుద్రేక [illegible] వర్ణింపబడినవి. ఈ గ్రంథము తప్పక

—దివ్యవాణి

[illegible]స్నాము.)

—ప్రకాశకుడు

# విషయసూచిక

“ దేశభాషలందు తెలుగు లెస్స ”

# దేశోద్ధారక గ్రంథమాల.

---

ఈ గ్రంథమాల కీర్తిశేషులైన విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ కాశీనాధుని నాగేశ్వరరావుగారి స్మారక చిహ్నముగ స్థాపితమైనది.

ఆంధ్రముతప్ప వేరుభాష లెరుగని ఆంధ్రసోదరులలో ప్రపంచ జ్ఞానము కలిగించుటకును—పరభాషావ్యామోహమువలనగాని, విధిలేకగాని, మాతృభాషాభిమానములేని ఆంధ్రసోదరులకు మాతృభాషలో చదువగ్రంథములను అందుబాటులోనుంచి—మాతృభాషాభిమానము కలిగించుటకును,—సర్వవిధముల, శక్తివంచనలేకుండ సేవచేయుటయే ఈగ్రంథమాల ముఖ్యఆశయము. ఈగ్రంథమాలద్వారా ప్రాచీన, ఆధునిక, వాఙ్మయ, రాజకీయ, వైజ్ఞానిక సాంఘిక విషయములకు సంబంధించిన గ్రంథములు సంవత్సరమునకు నాలుగు (మొత్తముపై 800 ల పుటలకు తక్కువకాకుండ) ప్రచురింపబడుచుండును.

అనుబంధ ప్రచురణములుగా హైద్రాబాదు రాజ్యాంగమునకు సంబంధించిన చట్టములు, నియమావళులు, గష్తీలును, తదితరములును ముఖ్యమైనవి—రైతు, వర్తకసోదరులకు సంబంధించినవి—ఆంధ్రీకరించి ప్రచురింపబడును.

ఈగ్రంథమాలద్వారా ప్రచురింపబడు గ్రంథములను కొనుటకు లిఖితపూర్వకముగా నొప్పుకొనువారు గ్రంథమాల సభ్యులుగా ఎంచబడుదురు. అట్టిసభ్యులు ప్రథమమున నాలుగు అణాలు ప్రవేశరుసుముక్రిందను, (తపాలావ్యయముతోసహా) రూపాయి ఎనిమిదణాలు వార్షికమూల్యముక్రిందను ప్రథమముననే చెల్లించవలసియుండును. సంవత్సర మధ్యకాలములో ఎప్పుడు సభ్యులుగా చేరినను వారు సంవత్సరారంభమునుండి సభ్యులుగా నున్నటులే ఎంచబడుదురు. తిరిగి సంవత్సరారంభమున మొదటి ప్రచురణము వార్షికమూల్యముతో వి. పి. చేయబడును. అట్టి వి. పి. తిరుగగొట్టబడినచో వారి సభ్యత్వము వి. పి. వ్యయముక్రింద చెల్లుబెట్టుకొనబడును. గాన వారు సభ్యత్వమును కోలుపోయినవారగుదురు. తిరిగి సభ్యత్వమును గోరినయెడల లోగా అయిన తపాలా

వ్యయము చెల్లించవలసియుండును. అనుబంధ ప్రచురణములు సభ్యులు కొనవలయుననను నిర్బంధము లేదు. ఎల్లరకు ఒకేధరకు విక్రయింపబడును.

వట్టికోట ఆళ్వారుస్వామి
ప్రకాశకుడు

దేశోద్ధారక గ్రంథమాల,
ఇమాంబావివీధి, సికిందాబాదు.

---

# దేశోద్ధారక గ్రంథమాల

## సభ్యుల ప్రవేశ పత్రము.

ప్రకాశకులు గారికి,

నేను మీ గ్రంథమాల నియమములను, ఆశయములను తెలిసికొని నాను. నేను సభ్యునిగా చేరుటకు అంగీకరించుచు ప్రవేశరుసుము క్రింద నాలుగు అణాలు, వార్షిక మూల్యముక్రింద రూపాయ ఎనిమిదిణాలు-* తపాలాద్వారా పంపించుచున్నాను. వి. పి. ద్వారా రాబట్టుకొనుటకు కోరుచున్నాను.

సంతకము

పేరు
నివాసగ్రామము.
తపాలాకార్యాలయము.
తాలూకా.
జిల్లా.
రశీదు సంఖ్య. తేది.

---

* తా మేవిధాన మవలంబించెదరో దానినిమాత్రముంచి రెండవది కొట్టివేయవలెను.

# పరిచయ వాక్యములు.



ముస్తఫా కమాలుపాషా ఆధునిక నియంతలలో ముఖ్యస్థానము వహించినట్టివారు. మహాపురుషుల జీవితములు జనులకు ఆదర్శప్రాయములు. ఆంధ్రవాఙ్మయములో మహాపురుషుల జీవితములింకను చాలతక్కువ. ఎంతవరకు ప్రపంచ మహాపురుషుల జీవితములన్నియు ఆంధ్రమందు వ్రాయబడవో అంతవరకది ఆంధ్రసాహిత్యమునకు గొప్పలోపముగానే యుండును.

శ్రీయుత ఖండవల్లి బాలేందుశేఖరముగారు ఉత్సాహయుక్తులైన యువకులు. వారి యీ కమాల్ పాషాజీవిత చరిత్రము మంచిశైలిలో వ్రాయబడినది. తాము వ్రాయు విషయమున ప్రీతి, శ్రద్ధలు కలిగియున్నందుననే వారు మంచి ఆవేశముతో గ్రంథమును నడిపించినారు. ఇంగ్లీషులో కమాలుపాషానుగురించిన చరిత్రలు బహుళముగా నున్నవి. అన్నిటిలో ముఖ్యమైనది "గ్రేవుల్ఫ" "Grey Wolf" అను గ్రంథము. ఆగ్రంథకర్తయగు ఎచ్. సి. ఆరంస్ట్రాంగ్ అనువారికి జీవితచరిత్రలు వ్రాయుటలో అసమానప్రజ్ఞకలదు. ఇంచుమించు అదే ధోరణిలో మనశ్రీబాలేందుశేఖరముగారును వ్రాసియున్నారు. నిర్దుష్టమైన రచన, భావోద్రేకముతోకూడిన యంశములు, పాఠకులను రంజింపగలనేర్పు, ఈగ్రంథమందలి ప్రతిభాగమందున వ్యక్తమగుచున్నవి.

కమాలుపాషా చరిత్రను చదివినవారికి అందు ముఖ్యముగా హిందువులకు-కొన్ని విచిత్రవిషయములు స్ఫురింపకమానవు. అతడు వ్యభిచారి, తెగత్రాగువాడు, ముక్కోపి, ఇంచుమించు మతవైముఖ్యముకలవాడు. ఇట్టి లోపముకలవాడు ఒక సామాన్యస్థితినుండి సర్వతుర్కిదేశ నియంతృత్వపదవి కెట్లువచ్చెనోయని తర్కించుకొనకమానరు. మహాపురుషులయందు లోపములుండును. అందుచేతనే మన పెద్దలిట్లన్నారు.

"యాన్యస్మాకం సుచరితాని
తానిసేవితాని-నో ఇతరాణి"

ముస్తఫా అదృష్టవంతుడు. (Man of destiny.) కొంతవరకు నెపోలియను చక్రవర్తిని పోలినట్టివాడు. ఎన్నియో మారులు యుద్ధభూమిలో తనప్రక్కనివారు గుండ్లదెబ్బచే చనిపోయిరి. కొన్నిమారులు తనకే దెబ్బలు తగిలెను. కాని ఎన్నడును ప్రమాదస్థితి సంభవించినదికాదు. తురుష్క దేశము పూర్వమెంత ఉచ్ఛస్థితిలోనుండెనో కమాలు కాలమునాటికి అంత దుర్బలస్థితికివచ్చెను. ౧౯౧౪ నాటి యూరపు యుద్ధానంతరము తుర్కిపూర్తిగా నాశనము కావలసినదై యుండెను. అట్టిస్థితిలో దాని స్వాతంత్ర్యమును కాపాడి, దుర్బలుడైనరాజును పారదోలి, దేశస్వరూపమును తీవ్రముగా మార్చివేసినట్టిధీరుడు కమాలు. పర్దాలలో క్రుంగిపోవుచుండిన స్త్రీలకు స్వాతంత్ర్యమిచ్చెను. మనహిందూస్థానములో యీ విషయమై తగవులు కల్పించుకొనుచున్నారు. ముస్తఫా ఒకవేదెబ్బతో తుర్కిలిపిని తుడిచివేసి రోమనులిపిని

ప్రచారములోనికి తెచ్చెను. దుస్తులను గురించి, వేషమును గురించి మనభారతదేశములో హిందూ ముసల్మానులు దినదినమును భిన్నమగుచున్నారు. కమాలుపాషా తనదేశ మంతటను యూరోపియా వేషమును స్థాపించెను.

అతనికి ముల్లాలనిన, మతోన్మాదులనిన గిట్టనేగిట్టదు. అట్టి నియంత మనభారతదేశమునకు దొరకియుండిన హిందు-ముసల్మాను కలహములు ఒకగంటలో శాశ్వతముగా మాయమైపోయియుండునేమో! ఒకతడవ కమాలుపాషా గారిట్లు సెలవిచ్చినారు:-

"Could a nation, be considered civilised that allowed itself to be kept in leading strings by a lot of Sheikhs, Chelebis, Babis, and Emirs, and entrusted its life and destiny to wizards, occultists, Cheiromancers, Sorcerers, diviners, and amulet sellers?"

"ఏదేశములోనిజనులు పూజారులకు, షేకులకు, ముల్లాలకు వశవర్తులైయుందురో, ఏదేశములోని జనుల జీవితములు తాంత్రికులయొక్కయు, జ్యోతిష్యులయొక్కయు, మాంత్రికులయొక్కయు, సాముద్రికులయొక్కయు, అధీనములోనుండునో అట్టిజనులు నాగరికులని చెప్పుటకు అర్హులా?"

ఇండియాలో మనమీనాడు అట్టివారిచేతులలోనే,—అనగా పూజారులు, ముల్లాలు, సిద్ధాంతులు, ఖాజీలు, సన్యాసులు, ఫకీరులు,—మున్నగువారిచేతులలో నిరుకుకొని యున్నాము.

కమాలుపాషా జీవితములో మనము నేర్చుకొనవలసిన గుణపాఠములు రెండు–అవి దేశభక్తి, సంస్కారప్రియత్వము. ఈ రెంటివలననే ఆయనకు ప్రపంచమందు మాన్యత లభించినది. అతనిలో ఇతర లోపములెన్నియున్నను అతడు తుర్కిని ఉచ్చస్థితికి తెచ్చుటకై కావించిన ప్రశంసనీయమైన సంస్కారములకై అతనిని ప్రపంచ మెల్లప్పటికిని గౌరవించుచుండును. మతోన్మాదములో మునిగిపోయినట్టి భారతీయులు కమాలుచరిత్రను చదివి తమ మౌఢ్యమును వదలుకొందురుగాక! సంస్కారవిముఖులైన పూర్వాచార ప్రియులును, తమ అనర్థదాయకమగుపట్టును వదలుకొందురుగాక!

ఈయుద్గ్రంథమును వ్రాసియిచ్చిన శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరముగారు అభినందనీయులు. వీరిట్టి ఉత్తమ చరిత్రలను వ్రాసి ఆంధ్రులకుపకారమొనరింతురుగాక! దేశోద్ధారక గ్రంథమాలవారు ఇట్టి గ్రంథములను ప్రచురించి భాషాసేవను చేసినందులకు ప్రశంసాపాత్రులైయున్నారు.

హైదరాబాదు–దక్కన్.
ప్రమాది–చైత్ర శు॥ ౭ } సురవరము ప్రతాపరెడ్డి.

# ఉపక్రమణిక.



కరుణా సముద్రుడగు నాపరమేశ్వరుని యనంత విలాసము లెంతటి వారికిని తెలియ నశక్యము. నేడు ప్రపంచము నందలి యన్నిజాతులకును తలమానికమై సర్వతో ముఖాభివృద్ధిచెందియున్న జాతి కొలదికాలములోనే యధోగతి పాలుగావచ్చును. అట్లే ప్రపంచమందంతటను హీనముగ చూడబడుచు నేడో రేపో రూపు మాసిపోవునేమోయని యనిపించు వేరొకజాతి పరమేశ్వరానుగ్రహముచే నత్యల్పకాలములో శద్భుతముగ మార్పునెంది, నవనాగరక జాతులలో లెక్కింప నర్హము కావచ్చును. లేకున్న "యూరోపుఖండ రోగిలయని ఇతర జాతులచే నికృష్టముగ పరిగణింపబడుచుండెడి తురుష్కము పదిసంవత్సరములలో తన తొల్లింటి మాంద్యమును స్పృహను తరిమివైచి నూత్న తేజోవిలాసములతో వెలుగొందు చుండుట కెట్టి కారణముల నొసంగుటకు వీలగును? ప్రపంచ మహా సంగ్రామములో జర్మనీ పక్షమును వహించి తురుష్కదేశము సంపూర్ణముగ నోడింపబడెను. ఒకవంక గ్రీకులు, వేరొకవంక ఇటలీవారు ఇంకొకదిక్కు ఆంగ్లేయులు, ఫ్రెంచివారు, మొదలగు వారందరును తురుష్కములో నెవరికబ్బినంత భాగమును వారు కబళింపవలెనని సంసిద్ధులై యుండిరి. తురుష్కమును అమెరికా సంయుక్త రాష్ట్రములవారి సంరక్షణములో నుంచవలయునని కొందరు తురుష్క ప్రజలే యాలోచింపసాగిరి. దేశమందంతటను నైరాశ్యము ప్రబలియుండెను. అట్టి నైరాశ్య గాఢాంధకారము

నందాశాజ్యోతి వెలిగించి, ప్రజలయందు స్వాతంత్ర్య కాం
క్షను కలుగజేసి, దేశ శత్రువులగు గ్రీకుల ఘోరాహవరంగ
ములలో తురుష్కులచే గెల్పించి, తురుష్క స్వాతంత్ర్య
ధ్వజమును స్థాపించిన ముస్తఫాకమాల్ పాషావంటి మహా
నాయకుల యవతరణము "యదా యదాహి ధర్మస్యగ్లా నిర్భ
వతి భారత॥ అభ్యుత్థాన మధర్మస్యతదాత్మానం సృజామ్యహం"
అను గీతా వాక్యమునకు తార్కాణముగాక మరేమనవచ్చును.
ఒకానొక కాలమున మహోన్నతదశ ననుభవించిన
తురుష్కము నేడు నామరూపములు లేక నశింపరాదని
భగవదిచ్ఛ కాబోలు!

తురుష్కజాతీయౌన్నత్యము పదునాల్గవ శతాబ్దా
రంభమున మొదలిడినదని చెప్పవచ్చును. ఈ సామ్రాజ్యము
క్రిమక్రిమముగ విజృంభించి తన జననస్థానమగు నాశియా
ఖండమందలి ఆసటోలియా నేకాక యూరోపు నందలి త్రేసు,
బల్గేరియా, మ్యాసిడోనియా, సర్బియా, గ్రీసు మొదలగు
రాష్ట్రముల ననేకములను పదునాల్గవ శతాబ్ది యందాక్రి
మించెను. ౧౪౫౩ వ సంవత్సరము తురుష్కసామ్రాజ్య
చరిత్రయందు సువర్ణాక్షరములతో లిఖింపదగినది. ఈ సంవత్స
రమున దిగంత విఖ్యాతమైన రోమక మహాసామ్రాజ్యరాజ
ధానియగు కాన్స్టాంటినోపులు నగరమును (కుస్తుంతునియా
ను) తురుష్క సుల్తానగు రెండవ మహమ్మదు ఆక్రమించెను.
ఈ మహా నగరమును జయించుటవలన తురుష్క సామ్రాజ్య
మున కఖండమగు కీర్తిలభించెను. పదునారవ శతాబ్దా రంభ

మున తురుష్క సుల్తానులు ఈ జిప్టు దేశమును జయించి, అప్పటివరకును ఈ జిప్టు సుల్తానులచే వహింపబడిన ఖలీఫా బిరుదమును గైకొనిరి. ఖలీఫా యనగా సమస్త మహమ్మదీయ ప్రపంచమునకును గురువు. ప్రజా సామాన్యము మతావేశ పూరితమైయున్న ఆ దినములలో మహమ్మదీయ మతమునకు గురుపీఠము నధిష్ఠించియున్న తురుష్క సుల్తానుల కీర్తి ప్రాబల్యములెంత యధికమయ్యెనో మనము సులభముగ నూహింపవచ్చును.

కారణములేక కార్యములేదు. అత్యంత ప్రతిభావంతులగు సుల్తాను లనేకులు సింహాసనాసీనులై రాజ్యతంత్రమును నడుపుట వలననే, తురుష్క సామ్రాజ్యమంతటి మహోన్నతదశ నందగల్గెను. వారి న్యాయైకబుద్ధి, స్వార్థరాహిత్యమునుగూర్చి తురుష్కమునందనేక గాథలు ప్రబలియున్నవి. ఒక తురుష్క సుల్తానొక గ్రీకు శిల్పిపై గోపించి యాతని చేయి తెగ గొట్టించెను. ఆ శిల్పి న్యాయాధికారి కడకేగి సుల్తాను తనకు గావించిన మహోపకారమునుగూర్చి మొరపెట్టుకొనెను. న్యాయాధికారి సుల్తానును రావించి అభియోగమును విచారించి సుల్తానునందే తప్పుండుటవలన నాతడు గ్రీకుశిల్పికే బదివేలు బంగారు నాణెములు నష్టపరిహారముగ నొసంగవలసినదని తీర్పుచెప్పెను. విచారణ ముగిసిన వెనుక న్యాయాధిపతి తన పీఠమునుండి దిగివచ్చి సుల్తాను నెదుట మోకరించి యాతని వసనాంచలమును ముద్దిడుకొనెను. అట్లు చేయుటలో నాతని యంగీనుండి యొక్క

బాకుజారి పడెను. బాకును నీకడనేల యుంచుకొంటివని సుల్తానడుగగా "ప్రభువరేణ్యులు నాతీర్పు నంగీకరింపక ప్రతి ఘటించినచో నీయాయుధము నుపయోగింపవలెనని తెచ్చి తిని" అని న్యాయాధిపతి ప్రత్యుత్తర మొసంగెను. నిందితుడు చక్రవర్తియైనందున జంకి న్యాయాన్యాయ విచక్షణ సక్ర మముగ కావింపని పక్షమున న్యాయాధికారిని శిక్షించుటకై సుల్తానుకూడ తనకడ నొక బాకునుంచుకొనెను.

ఆతడు రెండవ మహమ్మదు సుల్తాను. రోమక సామ్రా జ్యమునకు ముఖ్య పట్టణమగు కాన్‌స్టాంటి నోపులు నగరము జయింపబడినది. తురుష్క దేశము విజయోత్సాహముతో నిండియున్నది. మత గురువులచే పరివేష్టితుడై సుల్తాను కూర్చుండియున్నాడు. అందరును నిశ్శబ్దముగానుండిరి. "ఆ యవనసుందరి త్రిలోక మోహినియేయగుగాక! ఆమె సౌంద ర్యము శరత్కాల చంద్రికవలె విశ్వసమ్మోహనమే యగు గాక! అయిన నేమి? సత్యమతస్థులగు మహమ్మదీయుల పాలించు చక్రవర్తి, కాన్‌స్టాంటి నోపులు నగరమును జయించి రోమక సామ్రాజ్యమును నిర్మూలనము గావించిన వీరాగ్రే సరుడు, ఒక సుందరీమణి వగలగుజిక్కి పోవుటయా? ఆమె సత్యమతమునవలంబించుటకు నిరాకరించినను ఆమెయందే బద్ధ స్నేహుడగుటయా? ఇంతకంటె యవమానకరమగు విష యము వేరొండు కలుగబోదు" అని ప్రధాన మతగురువు తీవ్రముగ నుపన్యసించుచు, సుల్తాను ప్రవర్తనను నిరసించు చుండెను. సుల్తాను నిశ్శబ్దముగ నాపల్కులవిని యంతఃపుర

మునుండి యవన సుందరినిగొని రానాజ్ఞాపించెను. ఆయువతి తనకడకువచ్చిన తర్వాత సుల్తానామెను తనవితీరగాంచి, "ఓలోకైక సుందరీ! నీకటాక్ష వీక్షణములచే నీచక్రవర్తిని నీదాసుని గావించుకొంటివి. ప్రపంచమందందరికంటెను తుదకు నాకంటెను నిన్నుమిన్నగ ప్రేమించుచున్నాను. నామత క్షేమము నాసౌఖ్యముకన్న మిన్నమైనది" అని పల్కుచు నాగ్రీకు తరుణుని తన నిశితకరవాలముతో ఖండించి వైచెను. ఆమె దేహము సుల్తాను రాణులకు చూపబడు గౌరవముతో సమాధికావింపబడెను.

మొగలు చక్రవర్తులలో నెల్ల శ్రేష్టుడగు అక్బరు సార్వభౌమునకు సమకాలీనుడగు సులేమానుసుల్తాను తురుష్క దేశ చరిత్రియందు మిక్కిలి విఖ్యాతి చెందినవాడు. అతడు ప్రజోపయోగకరములగు ననేక శాసనముల గావించెను. ఇంగ్లాడు దేశీయులు సులేమాను చక్రవర్తి కావించిన నూతన శాసనముల సంగ్రహించి తమ దేశమునందు వానిని ప్రవేశపెట్ట దలచిరని తెలియుచున్నప్పు డక్కాలమున తురుష్కమెంత యౌన్నత్యమును వహించి యుండెనో మనము గ్రహింపనగును.

హంగేరీ దేశమునందలి జాగేడ్ పట్టణమును జయింపవలెనని సులేమానుసుల్తాను అనేక ప్రయత్నములు కావించెను ఆపట్టణమును జయించి దీరెదనని సుల్తాను ప్రతినకావించి యున్నాడు. కోట గోడలనుండి బాణములును, శిలలును, నిరంతరము వర్షించుచుండెను. సర్వేశ్వరుడైన యల్లాను

స్మరించి మరియొక పర్యాయము ప్రయత్నింప వలయును" అని సుల్తా నాజ్ఞాపించెను. తురుష్క సైన్యముల విజృంభణ కోలాహలము మిన్నుముట్టెను. ఎట్టకేలకు జాగేడ్ పట్టణము తురుష్కుల వశమయ్యెను. కాని యుద్ధకాలములోనే సుల్తాను మరణించెను. సుల్తానుని మరణవార్త యెవ్వరికిని తెలుపబడలేదు. ఏమియును జరుగనట్లే సుల్తాను గుడారమునందు విందులమర్చబడుచుండెను. దినదినమును సుల్తాను కడనుండి సైన్యమున కాజ్ఞ లొసగబడుచుండెను. యుద్ధానంతరం, సుల్తాను శరీరం తేరిపారజూచు కన్నులతో, రంగుపూసిన చెక్కిళ్ళతో, కాన్‌స్టాంటినోపులు నగరమునకు బయనమయ్యెను. త్రోవపొడుగునను ప్రజలు విజయలక్ష్మిని చేబట్టి యేతెంచుచున్న సుల్తానునకు మహా కోలాహలముతో స్వాగతమొసంగిరి. కాని తాము కావించిన యద్భుత సన్మానము నాతడుచూచియు సంతసింపలేదని వారికేమి తెలియును? రాజధానిచేరిన తరువాత సుల్తాను శరీరము రాజోచితముగ సమాధికావింపబడిన పిమ్మటనే ప్రజల కందరకును నావిచార వార్త తెలిసెను.

ఆకాలమునందు తురుష్కము యూరోపుఖండమునందు ప్రబల రాష్ట్రముగ నుండెను. అక్కారణమున నిగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ, మొదలగు దేశములన్నియు తురుష్క సుల్తానుల కడకు రాయబారులనంపి వారి స్నేహమును సంపాదించుటకై ప్రాకులాడుచుండెడివారు.

సులేమాను సుల్తాను ననంతరము తురుష్క సామ్రాజ్యము క్షీణింప జొచ్చెను. నిరంకుశ ప్రభుత్వములన్నియు

పాలకుని ప్రతిభావిశేషముపై నాధారపడి యుండుననుట సువిదితము. సులేమాను చక్రవర్తి తరువాత సుల్తానులందరును భోగలంపటులును, మద్యపానాసక్తులునై యుండిరి. రాజు బలహీనుడైనందున ప్రభుత్వమంతఃపురస్త్రీల యిష్టానిష్టములపై నడువజొచ్చెను. మంత్రులు స్వామిద్రోహులై ప్రవర్తింపజొచ్చిరి. ఒక రాష్ట్రము వెనుక వేరొక రాష్ట్రము తురుష్క సామ్రాజ్యమునుండి విడివడి పోయెను. తురుష్క సామ్రాజ్య పతనమునకు స్పెయిను, ఫ్రాన్సు, ఇంగ్లాండు మొదలగు నితర ఐరోపా జాతుల యభివృద్ధి కొంతవరకు కారణమని చెప్పవచ్చును. పదునేడవ శతాబ్దాంతమున తురుష్కము హంగేరీ దేశమును పోగొట్టుకొనెను. పదునెనిమిదవ శతాబ్దిలో రష్యాతో యుద్ధముకావించి మరి కొన్నిరాష్ట్రములను తురుష్క దేశము పోనాడు కొనెను. పందొమ్మిదవ శతాబ్ది యారంభమున నీజిప్టు దేశము స్వాతంత్ర్యమును ప్రకటించుకొనెను. కాలక్రమమున తురుష్కసామ్రాజ్యమందలి క్రైస్తవ జాతులలో స్వాతంత్ర్య కాంక్ష పెరుగ జొచ్చెను. ఈ యుద్యమము నడచివేయుటకు తురుష్కప్రభుత్వము కావించిన ప్రయత్నములా స్వాతంత్ర్యకాంక్ష నినుమడింప జేసెను. తుదకు ౧౮౨౯ వ సంవత్సరములో గ్రీకుదేశము తురుష్కమునుండి విడివడి స్వాతంత్ర్యమును ప్రకటించెను. తురుష్క సామ్రాజ్యమీ విధముగ పతనము నొందెను.

ఏ మహాపురుషుని జీవితము స్వదేశోద్ధరణమునకై యాతడు కావించిన త్యాగసాహసములను ముందు వర్ణింపబడనున్నవో అముస్తఫాకమాల్ పాషానాయకత్వమునందలి

విశిష్ట లక్షణములగూర్చి యొకటి రెండు విషయముల నిచ్చోట తెలుపదలచి యున్నారము. కమాలు తురుష్కమునకు స్వాతంత్ర్యమును సంపాదించిన మహానాయకుడు. తురుష్క ప్రజాక్షేమమునే కైకలక్ష్యముగ నిడికొని యీమహానీయుడు కౌమాశానస్థయందున్న తురుష్క ప్రజాస్వామికమును నిరంకుశముగ శాసించుచున్నాడు. కమాలు నాయకత్వము నిరంకుశ నాయకత్వము నాయకులు రెండువిధములుగ నుందురు. మొదటి తరగతివారు ప్రజాభిప్రాయమునకను గుణ్యముగ వర్తించుచు దేశాభివృద్ధికై పాటుపడుదురు. రెండవ తరగతివారు ప్రజాభిప్రాయ మనుకూలమైనను, ప్రతికూలమైనను సరకుగొనక, దేశక్షేమమున కెయ్యది యత్యావశ్యకమని తోచునో అట్టి కార్యక్రమమును నిర్ధారణచేసికొని ప్రజలచే దాని ననుష్ఠింప జేయుదురు. అట్టి నాయకులను నియంతలని నేటి కాలమున వ్యవహరించుచున్నాము. కమాల్ పాషా అట్టినియంత. ఇటలీదేశమునందు నిరంకుశముగ పాలించుచున్న మసోలినీయును, జర్మను నాయకుడగు హిట్లరును, ఈ తరగతికి చెందినవారే. నిరంకుశతత్వమను పదమును వినినతోడనే ప్రజాస్వామ్య సిద్ధాంతములు ప్రబలియున్న యీదినములలో మనకించుక వైముఖ్యత తోపవచ్చును. ఈసందర్భమున నిట్టినియంతలు ప్రపంచమందలి చాల దేశములలో కానవచ్చుటకు గలకారణముల గూర్చియు, వీరి యావశ్యకతానావశ్యకతలగూర్చియు నించుక ప్రసంగించుట యప్రస్తుతము కానేరదు.

అనేక దేశములలో ప్రస్తుతమీనియంతలే సర్వాధి

కారులై రాజ్యాంగముల నడపుచుండుటకు పెక్కు కారణములు గలవు. ప్రపంచ మహాసంగ్రామమునకు ఫలితముగ యూరోపు ఖండమునందలి జాతులన్నియు నపారమగు నష్టములకు లోనయ్యెను. ఇట్టి దుస్థితికిలోనైన, వోటమిచెందిన జాతులేకాదు. జయముకాంచిన జాతులుకూడ పైచూపులకు విజయోత్సాహమును కనపరచుచున్నను లోలోపల ఈమహాప్రళయముపలనిదుష్ఫలితములచే గుందుచునేయుండెను. ప్రతిదేశమునందును యువకులనేకులు మరణించిరి. ప్రజలను దారిద్ర్యదేవత యాశ్రయించి పీడింపజొచ్చెను. పరిశ్రమలు నశించెను. దేశమునందుత్సాహము మాయమై నైరాశ్యము ప్రబలెను. ఇట్టి క్లిష్టపరిస్థితులలో నియంతలనబరగు మహానాయకు లాయాదేశములలో స్వదేశమును సంరక్షింప బద్ధకంకణులై నిల్చిరి. వీరు జాతీయజీవితమందు లుప్తమైనఆత్మవిశ్వాసములు, ఉత్సాహమును, అభివృద్ధిని, పునఃప్రతిష్టించిరి. ఈ పైవాక్యములకు కమాలుపాషా, ముస్సోలినీ, హిట్లరు మున్నగు ప్రబలుల చరిత్రములే తార్కాణములు. సర్వనాశనముచే నెదుర్కొనబడియున్న తమ్ము రక్షించుటయేగాక దేశమునందు సర్వతోముఖాభివృద్ధి కల్గించిన యీ ఉత్తమవ్యక్తులయెడ నాయాదేశములు భక్తి గౌరవములు చూపుట యం దసహజమేమికలదు. నియంతలు ప్రబలుట కిదియొక కారణము.

పందొమ్మిదవ శతాబ్దియందు ప్రజాస్వామిక సిద్ధాంతములకు చాల గౌరవముండెను. ప్రజాస్వామికమును మించిన రాజ్యాంగ వ్యవస్థ వేరొకటియుండబోదని యక్కాలమున

తలంపబడుచుండెను. ఇంగ్లాండు దేశమీ సిద్ధాంతముల నా చరణయందిడి మిక్కిలి యుచ్ఛదశయందుండెను.

గడచిన శతాబ్దియందీ రాజ్యాంగ వ్యవస్థనే పలువురను కరించిరి. కాని కాలముగడచినకొలదియు వస్తువుల విలువ మారజొచ్చెను. పందొమ్మిదవ శతాబ్ది యారంభమున నింగ్లాండు పారిశ్రామికాభివృద్ధియందితర ఐరోపాజాతుల కంటె ముందంజవేసియుండెను. కాలక్రమమున వెనుకబడి యున్న జాతులన్నియు నభివృద్ధిచెంది తాముకూడ పారిశ్రామికముగ నిగ్లాండుతో తులతూగ నారంభించెను. ఇప్పుడు వివిధజాతులకును పోటీలును, వైషమ్యములును హెచ్చెను. పరిష్కరింపవలసిన జాతీయ సమస్యలు జటిలముకాజొచ్చెను. వీనిని సర్వజనానుకూలముగ పరిష్కరించుటకు పార్లమెంటరీ నాయకులు సమర్థులైరి. ప్రతిరాష్ట్రమునందును స్వల్ప సంఖ్యాక సమస్యతలయెత్తెను. పార్లమెంటరీ ప్రభుత్వము (అధిక సంఖ్యాకుల ప్రభుత్వము) నెడ అవిశ్వాసము ప్రబలెను. ఈవిధముగ ప్రజాస్వామిక సిద్ధాంతములు తొంటి ప్రాబల్యమును గోల్పోవుటయు, అందులకు ఫలితముగ ననేక దేశములలో సర్వస్వతంత్రులగు నీనియంతలు ప్రబలుటయు దటస్థించెను.

సిద్ధాంతములకొంతకాలము మరచి ఆచరణనుగూర్చి యాలోచించిన యెడల అన్ని దేశములందును, అన్ని కాలములందును నిరంకుశత్వమే బ్రిబలియుండునని మనకు దోచుచున్నది. ఉదాహరణమున కింగ్లాండు దేశమును గైకొనవచ్చును. ప్రజాస్వామిక సిద్ధాంతములకును, పార్లమెంటరీ

ప్రభుత్వమునకును ఇంగ్లాండు పుట్టినిల్లు. అట్టి దేశములో కూడ రాజ్యపరిపాలన యాచరణయం దెట్లున్నది? ప్రతిభావంతు లును, జనానుకూలురునగు కొందరు నాయకులు మంత్రులుగ నుందురు. వారు పార్లమెంటునందు తీర్మానముల ప్రవేశ పెట్టెదరు. చర్చలు జరగును. ఈ చర్చలను శ్రద్ధగావిని అందలి పూర్వాపరసందర్భముల చక్కగ నాలోచించి వోటు చేయువారు అరుదు. ఒకవంక పార్లమెంటు భవనములో నతి ముఖ్యములగు చర్చలు జరుగుచుండ, నాటలాడువారు కొంద రును, ధూమపానము చేయువారు కొందరును, వార్తాపత్రికల జదువువారు కొందరునై, సభ్యులచ్చటచ్చట తిరుగుచుందురు. వోటింగుసమయమున కక్షినాయకుడు (Whip) వచ్చి వీరి నందరిని పిలిచికొనిపోయి తనపక్షమున వోటుచేయించును. మంత్రివర్గమునకు దేశములో పలుకుబడి యున్నంతకాలము వారికే జయముకల్గును. అనగా పార్లమెంటుపేర మంత్రివర్గమే పాలనచేయునన్నమాట. ఇదిమాత్రము నిరంకుశత్వము కాదా? ఈ నిరంకుశత్వమును సాగించునది ఒక్కడుకాదు, కొందరు వ్యక్తులు. కాని ఈ నిరంకుశత్వము శాశ్వతముగ నుండజాలదు. దేశము, కొంతకాలమైన తర్వాత ఒకమంత్రి వర్గమును తొలగించి వారిస్థానే మరియొక నిరంకుశమంత్రి వర్గమును నియమించును. మరల నెప్పటియాటయే. అనగా నీ నిరంకుశత్వమునందలి వ్యక్తులు మారుచుందురు కాని నిరంకుశత్వము శాశ్వతముగ నుండును.

మానవులందరును స్వతంత్రముగ నాలోచింపజాలరు. లోకము గతానుగతికము. ఒకరేపనిచేసిన వేరొక రది

యనాలోచితముగ గావింతురు. ఈ కావింపబడుచున్న కార్యమువలన నష్టమూ, లాభమూ, ఉపకారమూ, అపకారమూ, మంచియూ, చెడ్డయూ, ఏది సంభవించునని తీవ్రముగ విమర్శించువారు దుర్లభము. స్వతంత్రమగు నాలోచనాశక్తి యందరకునుండదు. అట్టిశక్తి యేకొలఁదిమందికో యుండును. మేధాశక్తియు, పాండిత్యమును, సదసద్వివేచనాపటిమయు కల్గినవారిలోకూడ పలువురు మేకదాటుగ నౌకరి ననుసరింతురే గాని స్వతంత్రపథమును ద్రొక్కరు. భగవద్దత్తములగు శక్తుల చక్కఁగ నుపయోగించి, స్వతంత్రాలోచనకలిగి, తమ యభిప్రాయముల నాచరణయందు దిడజాలినంత వ్యక్తిత్వమును, ధైర్యసాహసములును, కలిగి, సామాన్య మానవులచే తమ యున్నత సిద్ధాంతముల ననుష్ఠింప జేయువారు నాయకులు. గాంధీమహాత్ముఁడు, రాజారామమోహనరాయులు, ఈశ్వరచంద్రవిద్యాసాగరుడు, కందుకూరి వీరేశలింగంపంతులు ఇట్టివారిని నాయకులని చెప్పనగును. ఇట్టివారే సంఘచక్రమును నడుపుచుందురు. జనసామాన్యము వీరియడుగుజాడలయందు నడచుచుండును. రాజకీయాధికార మొసంగబడినయెడల వీరుకూడ నియంత లనబడుదురు. సర్వకాలములయందును, సర్వదేశములయందును నిరంకుశత్వమే ప్రబలియుండుననుటయందలి యభిప్రాయ మియ్యదియే.

నిరంకుశత్వ మను పదమునకు ముఖ్యముగ పాశ్చాత్యదేశములందును, పాశ్చాత్యుల ననుకరించు ప్రాగ్దేశీయులయందునుకూడ చాల దుష్కీర్తిగలదు. అందులకు కారణము లేక పోలేదు. పూర్వకాలమున నిరంకుశత్వమునకును,

దుష్పరిపాలమునకును, అవినాభావసంబంధముండెడిది. ఆకాల మున రాజులు నిరంకుశముగ పాలించి, ప్రజలను బాధల పెట్టుచు, అపరరావణులవలె ప్రవర్తించెడివారు. నిరంకుశు లుగనుండియు జనరంజకముగ పాలనచేసిన రాజన్యులు లేక పోలేదు. కాని అట్టివారు కొలదిమందిమాత్రమే. అక్కారణ మున నిరంకుశత్వమే చెడ్డదను నభిప్రాయము జనసామాన్యము నందు ప్రబలుట విరుద్ధముకాదు. కావింపబడుచున్న నిరంకుశ ప్రభుత్వము ఒకవ్యక్తి స్వోపయోగముకొరకై చేయు చున్నాడా లేక ప్రజోపయోగముకొరకై చేయుచున్నాడా యనువిషయము లెస్సగ చింతింపనగును. వ్యక్తులు స్వార్థము కొరకై నిరంకుశత్వము నెరపుచున్నచో నది గర్హ్యము. కాని ప్రజోపయోగముకొరకై నిరంకుశత్వము నుపయో గించుచో నది ప్రశంసార్హము. ఈసూత్రమునుబట్టి నేటి కాలపు నియంతల విమర్శించిన యెడల వారి నిరంకుశత్వము సామాన్యముగ నూహింపబడు నిరంకుశత్వమునుగాదు, నియం తలు నిరంకుశులునుగారు, వారు దేశసేవకులు. అట్టివానిలో ముస్తఫా కెమాలుపాషా యొకడు.



# మొదటి ప్రకరణము.



## తరుణదేశాభిమాని కమాల్.

ఆవేషధారణము పాశ్చాత్యనాగరకతాచిహ్నము. ఆ హృదయమకలంకదేశభక్తిప్రపూర్ణము. ఆదేహము సౌకుమార్యసౌందర్య సమన్వితము. ఆకృత్యము లనన్యసామాన్య కార్య మహిమాన్వితములు. ఆవిశాలసమున్నత ఫాలభాగము గభీరచింతారేఖాంకితము. ఆసువిశాలపరిస్ఫుట నేత్రద్వయము మానవాకర్షక తేజోవిరాజితము. ఆదీర్ఘసమున్నత నాసిక దృఢత్వసూచకము. ఆఓష్ఠద్వయము లలితము, ఆచంచలకార్య దీక్షోద్యోతకము. ఆతడు కమాలుపాషా.

ముస్తఫాకమాలుపాషా క్రీ. శ. ౧౮౮౦ వ సంవత్సరమున సలోనికాపట్టణమున జనించెను. అతనితండ్రి అలీరజాబే యను రుమేలీతురుష్కుడు. అలీరజాబే ధనికుడుకాడు. ఆయన తురుష్కప్రభుత్వమువారి సుంకపుశాఖలో నొకచిన్న యుద్యోగిగ పనిచేయుచు కాలము గడుపుచుండెను. తోడి వారందరును న్యాయముగనో, అన్యాయముగనో ధనార్జనము సేయుచుండ అలీరజాబే మాత్రము చాలకాలము గడచినను, తొంటిబీదరికమునే యనుభవింపజొచ్చెను. సేవకావృత్తిలో ధనసంపాదనమున కవకాశమెంతమాత్రమును లేదని యాతడు గ్రహించెను. సేవకావృత్తికి గత్యంతరము వ్యాపారము. ఆకాలములో పాశ్చాత్యదేశములనుండి యనేకులువచ్చి కలప వ్యాపారముచేసి ధనికులగుచుండిరి. అదృష్టముపై భారము

నైచి అలీరజాబే తన యుద్యోగమునువిడిచిపెట్టి కలపవ్యాపారము మొదలిడెను. దైవానుకూల్యతవలన నీవ్యాపారమునం దాయనకు క్రమక్రమముగ లాభమురాజొచ్చెను. కాని తానొకటిదలచిన దైవమొకటి తలచును. వ్యాపారమభివృద్ధి చెందబోవు నీసమయమున అలీరజాబే మరణించెను. మరణించునప్పటి కాతడించుకయు ధనమును కూడబెట్టి యుండనందున, ఆతనిభార్య జుబేదా తన యిరువురుబిడ్డలతో నొక సమీపబంధువుకడకేగి నివసింపజొచ్చెను.

తండ్రిమరణమునకు పూర్వము కమాలు కొంతవరకు విద్యాభ్యాసము కావించియుండెను. కమాలును మహమ్మదీయమతగురువును కావింపవలెనని యాతనితల్లి మొదటినుండియు సంకల్పించియుండెను. విచిత్రము. మహమ్మదీయమత గురువు కావలసిన యాతడిప్పుడు ఖిలాఫతును రద్దుచేసి తురుష్కప్రభుత్వమును మతాధికారమునుండి పూర్తిగ విడుదలచేసియున్నాడు. తల్లికోరికపై కమాలు ప్రథమమున మసీదులోని పాఠశాలకు పంపబడెను. కొలదికాలముగడచిన తరువాత కమాలుతండ్రి యీవిద్యనుమాన్పించి, నూతనముగ స్థాపింపబడి పాశ్చాత్యవిద్యావిధానము ప్రకారము నడుపబడుచున్న వేరొక పాఠశాలకు తన తనయుని పంపజొచ్చెను. తండ్రిమరణానంతరము కమాలు నూతనబంధుగృహమున నెట్టి విద్యాభ్యాసమును కావించినట్లు కాన్పింపదు. ఎక్కువకాల మాతడు పొలములందును, వ్యవసాయమందును గడప జొచ్చెను. కారణాంతరమువలన నాతడు సలోనికాకు తిరిగి వచ్చి యచ్చట నొక పాఠశాలలో ప్రవేశించెను.

చిన్నతనమునుండియు కమాలు తనతోడి బాలకులపై నాయకత్వమువహించి వారిచే విపక్షులనోడింపజేయుచుండెడి వాడు. ముందుముందు శత్రువులగు గ్రీకులను ఘోర రణ రంగములజయించి తురుష్కమునుండి తరిమివేయుట కియ్యవి ప్రథమప్రయత్నములు కాబోలు. ఒక యసామాన్యకారణ మువలన నీపాఠశాలనుండి కమాలు వెడలిపోవలసిన వా డయ్యెను. సహాధ్యాయియైన వేరొక బాలకునితో పోరాడి నందులకుగాను ఉపాధ్యాయుడొకడు కమాలును కఠినముగ శిక్షించెను. కమాలు చాల అభిమానముగలవాడు. అది యునుగాక ఆవిషయములో తనయందణుమాత్రమును తప్పు లేదని కమాలు దృఢముగనమ్మియుండెను. ఆకారణమున నాత డాపాఠశాలలో చదువుమానుకొనెను. ఉపకారవేత నమునందుచున్న సైనికోద్యోగితో కమాలుకు పరిచయ ముండెను. ఆతనికీయువకునిపై అభిమానముమెండు. అందు వలన నాయుద్యోగి ప్రయత్నముచేసి సలోనికా యందు జరుపబడెడి యొకసైనికోద్యోగ పరీక్షయందు కమాలును చేర్పించెను. కమాలీ పరీక్షయందు త్తీర్ణుడగుట తోడనే ఆతని సైనికజీవితము ప్రారంభమయ్యెను. ఈసైనిక విద్యాలయము నందు కమాలు విశేష సామర్థ్యమును చూపినందున నాత డనతికాలములోనే కాన్ స్టాంటినోపులునందలి సైనికశిక్ష ణాసంఘ సర్వకళాశాలకు పంపబడెను. ఈసమయముననే కమాలుతల్లి ధనవంతుడగు నొక పెద్దమనుష్యుని వివాహ మాడినందున నాతని కాన్ స్టాంటినోపులు ప్రయాణమింకను సులభమయ్యెను.

తురుష్కపరిభుత్వము మిక్కిలి దుర్భరముగ నున్నదనియు, అప్పటి సుల్తానగు అబ్దుల్ హమీదు నిరంకుశముగ పాలించుచు, దేశాభివృద్ధికై యించుకయు ప్రయత్నము సేయకుండుటయేగాక, అందులకై ప్రయత్నించుచున్న దేశాభిమానులను కఠినశిక్షల పాలొనరించుచుండెననియు కమాలువినుచుండెను. భావికాలమున తానొక మహానాయకుడై దేశమునందు దుష్పరిపాలన నంతమొందింపగలనని యాతనికి గట్టినమ్మకముండెను. అందులకు తగిన జ్ఞానసంపాదనమునకై కమాలు నిరంతరమును కృషిసల్పుచుండెడివాడు. సహాధ్యాయు లాటపాటలయందును, యువతీప్రణయసంపాదనమునందును కాలముపుచ్చుచుండ నీయువకవృద్ధుడు గ్రంథపఠనమునందు రాత్రిందివములు గడపుచుండెడివాడు. దేశచరిత్ర లాతని యభిమానగ్రంథములు. ఫ్రెంచివిప్లవచరిత్రయందాతని కెక్కువప్రీతియున్నట్లు తెలియవచ్చుచున్నది. ఫరాసు విప్లవకారులు తమ దేశమును నిరంకుశత్వము బారినుండి తప్పించి అచ్చట స్వాతంత్ర్యజ్యోతిని వెలిగించినట్లే తానుకూడ తురుష్కమునందు కావింపవలయునని కమాలువిశ్లేషించుచుండెడివాడు.

ఆకాలమునందు తురుష్కమున నిరంకుశపాలనమును తొలగించి ప్రజాస్వామిక ప్రభుత్వమును స్థాపించు నుద్దేశ్యముతో ననేకసంఘము లేర్పడెను. ఈసంఘములనుగూర్చి ముందు ప్రకరణమున విశదముగ తెలుపబడును. విద్యార్థులలో స్వాతంత్ర్యాభిప్రాయములు సులభముగా నాటుకొనుటకుగదా! కమాలు విద్యాభ్యాసము కావించుచున్న కళా

శాలయందు సైతం మిత్రభావములుగల యువకులు పలువు రుండిరి. వీరందరు నొకసంఘముగ నేర్పడి దేశవిమోచనము కొరకై రహస్యాలోచనలు సల్పుచుండెడివారు. ఈ సంఘ సభ్యులు తమయాశయములను విశదీకరించుచు, కొన్ని రాజ కీయకరపత్రముల ప్రకటించుచుండెడివారు. కమాలీ సంఘము నందు సభ్యుడుగనుండెనని వేరుగ తెలుప నవసరములేదు. విద్యార్థులు తమసంఘస్థాపనను, అందలి చర్చలను ఎంత రహస్యముగనుంచినను, సుల్తానుగూఢచారులకీ విషయ మెట్లో తెలిసిపోయెను. అనేకపర్యాయము లీరహస్యసంఘ ముపై పోలీసులు దాడిసల్పిరి. సభ్యులలో ననేకులు పట్టు వడుటయు, వారు కావించుచున్న ప్రచారము ప్రభుత్వమున కెరుకపడుటయు తటస్థించెను. కాని అదృష్టవశమున కమాలును, అతనితోపాటు మరికొందరు సంఘసభ్యులును పోలీసుల చేతిలోపడకుండ తప్పించుకొనిరి. సైనికశిక్షణము పూర్తియయ్యెను. కమాలును "కెప్టెన్" బిరుదముతో ప్రభుత్వము తమసైన్యమునందు జేర్చుకొనెను. కొలదిదినము లలో నాతడు కళాశాలవిడచిపెట్టెను. ఈ సందర్భమున నొక నాటిరాత్రి కమాలును, మిత్రులును రహస్యాలోచనా నిమగ్నులై, ప్రమత్తులైయుండ పోలీసులామందిరమును ముట్ట డించిరి. ఈ యువక దేశాభిమానులను, వార్తావాతలను తమ వశము కావించుకొని ఖైదీలుగా గొనిపోయిరి.

ఈవిధముగ జీవితారంభముననే కమాలు ప్రభుత్వ మునకు శత్రుకోటిలో నొకడుగ పరిగణింపబడెను. అట్టి యువకులు బంధింపబడిన యెడల నస్వాతంత్ర దేశములలో

ఉరిశిక్షయో, యావజ్జీవకారాగార నివాసశిక్షయో, వారికి తప్పక విధింపబడెడిది. కాని తురుష్కములో నట్లు జరుగ లేదు. కమాలును, అతని మిత్రులును రాజప్రాసాదమునకు సమీపముననున్న యొక కొట్టులో నిర్బంధింపబడిరి. కొన్ని దినములుగడచిన వెనుక నీ యువకనిందితుల నెట్లుశిక్షింప వలయునని సుల్తానాలోచింప సాగెను. ఈవిషయమునుగూర్చి మంత్రులలో తీవ్రములగు నభిప్రాయభేదము లుద్భవించెను. రాజద్రోహులును, దేశద్రోహులునగు నీయువకులను కఠిన ముగ శిక్షించి ముందెవ్వరును వీరిమార్గము నవలంబింపకుండు నట్లు సేయవలెనని యొకమంత్రి అభిప్రాయపడెను. అతనికి ప్రతిపక్షీయగు వేరొకమంత్రి ఈయువకులు పడుచుదనపు దుడుకుతనమువలన వ్రాసినవ్రాతలను రాజద్రోహప్రచార ముగ పరిగణించుట కాఠిన్యమనియు, వారిని స్వల్పమగు శిక్షతోవిడిచిపుచ్చుట న్యాయమనియు రాజునకు సలహా నిచ్చెను. పలుకుబడి కలిగిన యిరువురు మంత్రులు తమలో తాము కలహించుట రాజునకుకూడ ననిష్టముకాదు. చాల కాలము వాదప్రతివాదముల జరుగనిచ్చి, తుదకు ఇరువురు మంత్రులను సమాధానపరచు నుద్దేశ్యముతో సుల్తాను, కమాలును క్షమించి సైనికోద్యోగముపై డెమాస్కస్ పట్టణమునకు పంపునట్లాజ్ఞాపించెను. డెమాస్కస్ కాన్స్టాంటి నోపులుకు చాలదూరముననున్నది. అచ్చటి యుద్యోగము వాంఛనీయమైనదికాదు. నిందితుడగు కమాలుకు దేశాంతర ప్రవాసశిక్షగ నీయుద్యోగ మీయబడెనని యూహింపనగును.

డెమాస్కస్ చాలపురాతనమును, సుప్రసిద్ధమునగు

పట్టణము. కాని యాకాలమునాటికయ్యది మిక్కిలి హీనస్థితి యందుండెను. అచ్చటి ప్రజలు నిరుపేదలు. ప్రభుత్వమునకు వాని కష్టనిష్ఠురముల విచారించి తగు సదుపాయముల కావించుటయందు వ్యగ్రతలేదు. ఈ ప్రదేశమునకు ప్రవాసిగ పంపబడుట కమాలుకు లాభకారియేయయ్యెను. స్థానిక పరిస్థితుల చక్కగ గ్రహించి, అచ్చటి ప్రజలతో స్నేహముకావించుకొని వారికడ తనప్రచారమును కావించుట కాతని కవకాశము లభించెను. అతడు సహజముగ నిరాడంబరజీవి. వేషభాషాదులయందు పాశ్చాత్యుల ననుకరించును. అయినను ఎంతమాత్రము నేవగించుకొనక, తన నూతన పరిసరముయందలి కృషీవలులతోడను, వర్తకులతోడను, సామాన్యజనులతోడను, అరమరికలేకుండ కలసిమెలసి తిరుగుచు, కమాలు, వారి జీవితములను చక్కగ నర్థముచేసికొనెను. వారికష్టముల యెడ సానుభూతిచూపెను. ఈకాలముననే అతడు "వతక" అను రహస్యసంఘమును స్థాపించెను. ఆకాలమునాటి తురుష్కప్రభుత్వము నెడ ప్రజలకు అసహ్యత కలిగించుటయే ఈసంఘోద్దేశ్యము. ఇట్టిసంఘము స్థాపింపబడుట ప్రభుత్వమునకు తెలియవచ్చినందున వారు కమాలును జాఫాకు పోవ నాజ్ఞాపించిరి. ఇది యాతనికి ద్వితీయప్రవాసము.

జాఫాయందు యూదులు విశేషముగ నివసించుచుండిరి. అచ్చటి కేసుటకు కమాలు కెంతమాత్రము నిష్టము లేనందున ఎట్లైన తప్పించుకొనుటకై యాతడు ప్రయత్నముల సలుపసాగెను. మ్యాసిడోనియాయం దాదినములలో స్వాతంత్ర్యభావపూరితులగు యువక సైనికోద్యోగులు పలువు

రుండిరి. ఆకారణమున నచ్చటికి పోవలయునని కమాలు నిశ్చయించుకొని, తన్నాపరిదేశమునకు మార్చవలసినదని సలోనికాయందున్న మిత్రుడగు నొక ఉన్నత సైనికాధికారికి వ్రాసెను. ఈయధికారి కమాలునెడ మిక్కిలి యనుగ్రహము కలవాడగుటచే అనుకూలమగు ప్రత్యుత్తరమునే యొసంగెను. కాని ఇదమిత్థమని నిశ్చయముగ నేదియు తెలుపలేదు. ఇదే యదనని తలంచి కమాలు డెమాస్కస్ పట్టణమునువీడి ఇంగ్లీషుయాత్రికునిమారువేషముతో సలోనికాకు బయలుదేరి తన మిత్రుడగు సైనికాధికారికడకు పోయెను. ఈ యుద్యోగి కమాలురాక కాశ్చర్య సంభ్రమములనంది, ఉత్తరువులేకుండ తన యుద్యోగస్థానమునువదలి వచ్చినందుల కాతనిని మంద లించి, తక్షణమే మరల డెమాస్కస్ నకు పోవలసినదనియు, లేకున్నచో ప్రభుత్వమువారిచే బంధింపబడి యవమానము నకు పాల్పడవలసివచ్చుననియు బోధించెను. కమాలెట్టి నిర్ణయమును గావించుకొనకయే సలోనికాయందు కొన్ని వారములపాటు ప్రచ్ఛన్నముగ నివసించెను. ఇంతలో కమాలు డెమాస్కస్ పట్టణమును వీడిపారిపోయినట్లును, రహస్యముగ సలోనికాయందు నివసించుచున్నట్లును ప్రభుత్వ మునకు దెలియవచ్చెను. ఆతని నిర్బంధించుటకై యుత్తరువు లొసంగబడెను. ఈవిషయమును మిత్రులవలన నెరింగి కమాలు మరెచ్చటికైన వెడలిపోవలయునని నిశ్చయించు కొనెను.

అదృష్టవశమున నసందర్భమున నెజ్జ సముద్రము నందలి 'అకాబాను' గూర్చి బ్రిటీషువారికిని, తురుష్కము

నకును యుద్ధము జరుగుచుండెను. మిత్రులసలహా ప్రకారము కమాలచ్చటికిపోయి సైన్యములోజేరి బ్రిటీషువారితో యుద్ధము సేయ నారంభించెను. సలోనికాయందలి కమాలు మిత్రులాతడు డెమాస్కస్ పట్టణమునుండి వెడలిపోవుట నిజమేయైనను, అందాతని కెట్టి దురభిప్రాయమును లేదనియు, ఆతడకాబాయందు రాజసేవా నిమగ్నుడై యున్నాడనియు పై యుద్యోగులకు దెలియజేసిరి. ఈవిషయమై మరల విచారణ జరగెను. తా నకాబాయందుండి తనధర్మమును నిర్వర్తించుచున్నానని కమాలు, ప్రభుత్వమునకు దెలియ జేసెను. ఈవిధముగ నాతడే చిక్కునుండి తప్పించుకొనెను.

౧౯౧౦ వ సంవత్సరమున కమాలు తనకోరిక ప్రకారము మ్యాసిడోనియాకు పంపబడెను. సుల్తానుఅబ్దుల్ హమీదు పదభ్రష్టుడైన యనంతరము దేశమునం దంతఃకలహములు పెరిగెను. ఈసందర్భములలో కమాలు చాలాపోరాటములలో పాల్గొనవలసివచ్చెను. ౧౯౧౦ వ సంవత్సరమున నాతడు ఫ్రాన్సుదేశమున కేగి పరాసువారి సైనికశిక్షణమును చక్కగ గమనించెను. ఆధునిక పద్ధతులపై శిక్షణపొందిన గొప్ప సైన్యమునుగాంచుట కతని కదియే మొదటిపర్యాయము. ఫ్రెంచి సైన్యముతో పోల్చిచూచిన యెడల తురుష్క సైన్య మెంత వెనుకపడియున్నదో తెలిసికొనినప్పుడా దేశభక్తుని మనమెంతయో విచారాక్రాంతమయ్యెను. తురుష్క సైనికుల నితర పాశ్చాత్యదేశ సైనికులంతవారిని జేయుటకు కృతనిశ్చ యుడై యాతడు స్వదేశమునకు మరలివచ్చెను. వారమున కొకపర్యాయము తనతోటి యుద్యోగులనందరను సమా

వేశముకావించి సైన్యశిక్షణము మొదలగు విషయములగూర్చి కమాలు చర్చించుచుండెడివాడు. ప్రభుత్వమునకు కమాలనిన నెప్పుడును సవతితల్లి ప్రేమయే. అందువలన కమాలు కావించెడి సమావేశములలో చర్చించెడి విషయములు రాజకీయములతో సంబంధించియున్నవనియు, అతడు సైన్యమును ప్రభుత్వముపై తిరుగుబాటు గావించుటకై పురికొల్పుచున్నాడనియు నేరారోపణముకావించి ఉద్యోగమునుండి తొలగించిరి. ఇయ్యది ౧౯౧౧వ సంవత్సరమున జరగెను. కాని ఈ యవమానమును కమాలు చాలకాల మనుభవింపలేదు. మరల నాతనికి "మేజరు" పదవి నొసంగుచు ప్రభుత్వమాతనిని ట్రిపోపాలీకి పంపివైచెను. ౧౯౧౨వ సంవత్సరమున మాంటినీగ్రో, సర్బియా, బల్గేరియా, గ్రీసులకును, తురుష్కమునకును సంభవించిన యుద్ధమునందు కమాలు పాల్గొనెను. ౧౯౧౪వ సంవత్సరమున ప్రపంచమహాసంగ్రామమారంభమయ్యెను. ప్రపంచయుద్ధముతో కమాలుజీవితమునందొక నూతనఘట్టము ప్రారంభమగుచున్నది. ఏయద్భుత నాటకమున కాతడు సూత్రధారుడై తురుష్కప్రజాస్వామికమును స్థాపించి, దిగంతవిశాలకీర్తిని సంపాదించెనో ఆమహా నాటకమునకిప్పుడు నాంది మొదలగుచున్నది.



# రెండవ ప్రకరణము.



## తురుష్క సామ్రాజ్యపతనము-జాతీయోద్యమ ప్రారంభము.

---

పునాది లేకుండ గృహనిర్మాణము లేదు. అట్లే స్వాతంత్ర్య సంపాదనమను గృహనిర్మాణమునకు సైతము పునాదియుండ వలెను. ముస్తఫాకమాలుపాషా నేడు తురుష్కమునందు స్థాపించిన సంపూర్ణ స్వాతంత్ర్యమునకు ప్రథమ ప్రయత్న ములు అనేకులు—దేశాభిమానులచే కావింపబడెను. ఒక కాలమున దుర్నిరీక్ష్యప్రతాపముతో వెలింగిన తురుష్క సామ్రాజ్యము కాలక్రమమున తేజోవిహీనమయ్యెను. నిరం కుశప్రభుత్వములన్నియు తమ నాశనమునకు తామేకారణ మగును. నిరంకుశప్రభుత్వములం దసామాన్య శేముషీ దురంధరుడగు నొకవ్యక్తి రాజ్యసూత్రములను తనచేతియందిడి కొని పరిపాలము కావించును. ఆ వ్యక్తి జీవితకాలమునందు ప్రభుత్వము జయప్రదముగ జరుగును. కాని ఆ యసాధారణ వ్యక్తి యస్తమించినంతనే తత్తుల్యుడగు పాలకుడు రాజ్యభార మును వహించినయెడల నంతయు లెస్సయేకాని సాధారణ ముగ ప్రపంచమునందట్లు జరగదు. పండితునకు మూర్ఖుడును, వీరునకు భీరుడును, రాజనీతికుశలునకు కేవల భోగలంపటు డును పుత్రులై జనించుట లోకరీతి. సమర్థులగు తురుష్క సుల్తానులలో సులేమాను చక్రవర్తి తుదివాడు. అతని తరువాత తురుష్కసింహాసనము నధిష్ఠించిన సుల్తానులెల్లరును,

విషయాసక్తులును, అసమర్థులు నైనందున, తురుష్క సామ్రాజ్యము క్రమక్రమముగ క్షీణింపజొచ్చెను.

ఆధునిక యుగమునకు వేగుజుక్కయని పాశ్చాత్యులచే వాకొనబడుచున్న మానసికవికాసోద్యమము (Movement of Renaissance) వలన అంతవరకును వెనుకబడి యున్న, ఇంగ్లాండు, ఫ్రాన్సు, స్పైను హాలెండు మున్నగు జాతులు ముందునకు రాజొచ్చెను. క్రమక్రమముగా వారు తమరాజ్యములను పెంపొందించిరి. ఇతర పాశ్చాత్యజాతుల ప్రాబల్యమే తురుష్క సామ్రాజ్యక్షీణతకు ప్రారంభమని చెప్పవచ్చును. పదునేడవశతాబ్ది ప్రారంభమున తురుష్కము హంగేరీని, ౧౭౭౪ వ సంవత్సరమున రష్యావారిచే నోడింపబడి క్రిమియాజార్జియా ప్రాంతములను పోగొట్టుకొనెను. ౧౯ వ శతాబ్ది ప్రారంభమునుండి ఈజిప్టురాజునకును, తురుష్క సుల్తానునకును యుద్ధములు ప్రారంభమై తుదకు ౧౮౪౧ సంవత్సమున ఈజిప్టు స్వాతంత్ర్యమును ప్రకటించెను. తురుష్క సుల్తానునకు ఈజిప్టురాజు నామమాత్రమునకు లోబడియుండజొచ్చెను. ఈవిధముగ బలహీనమయ్యు తురుష్క మితరపాశ్చాత్యదేశీయులచే నాక్రమింపబడకపోవుట కొక బలవత్తరకారణముకలదు. ఇంగ్లాండు, ఫ్రాన్సు, జర్మనీ, రష్యాదేశములు నాల్గును, ఎవరికివారు తురుష్కములో చాల భాగము నాక్రమింపవలయునని ఆలోచనలుసల్పుచు, తంత్రములపన్నుచుండిరి. కాని తురుష్కము సంపూర్ణముగ జయింపబడినచో, అట్లు జయముగాంచినదేశము ప్రబలమగును. అట్లగుట మిగిలినవారికి సరిపడదు. తురుష్కమును

తమలోతాము పంచుకొను పద్ధతినిగూర్చి యీనాల్గుదేశ ములవారికిని అంగీకారమగు సంధికుదురలేదు. "ఈపాశ్చాత్య జాతులలో నోర్వలేమి, స్పర్ధలు, పోటీలు లేకపోయినచో చిరకాలముక్రిందటనే తురుష్కసామ్రాజ్యము తేలికగ వీరిలో నెవరివలననో మ్రింగబడియుండెడిది." (తురుష్క ప్రజాస్వామికము) పాశ్చాత్యజాతుల ప్రాబల్యమునకుతోడు తురుష్కమునందలి క్రైస్తవజాతుల తిరుగుబాటులుకూడ తురుష్కసామ్రాజ్యక్షీణతకు కారణమయ్యెను. గ్రీసుదేశము తురుష్కసామ్రాజ్యాంతర్గతమై చిరకాలముండెను. కాని ౧౯వ శతాబ్దియందు గ్రీకులలో స్వాతంత్ర్యభావములు ప్రబలి విమతస్థులగు తురుష్కుల యధికారమునుండి విడివడవలయు నను తీవ్రమగు నాకాంక్షయుద్భవించెను. ఈస్వాతంత్ర్యోద్య మమును, యూరోపుఖండమునందలి యితర క్రైస్తవజాతుల వారును, అందు ముఖ్యముగ రష్యాచక్రవర్తియగు జారును ప్రోత్సహింపజొచ్చిరి. చాలకాలమువరకు తురుష్కసుల్తానులీ స్వాతంత్ర్య ప్రయత్నముల నతిక్రూరమగు పద్ధతులతో నణచి వైవ ప్రయత్నించిరి. స్వాతంత్ర్యవహ్నికి నిర్బంధవిధానమే ఆహుతి తురుష్క. సుల్తానుల క్రూరనిర్బంధవిధానముచే నశించుటకు మారుగ గ్రీకుల స్వాతంత్ర్యకాంక్ష నానాటికి బల పడజొచ్చెను. తుదకు ౧౮౨౯వ సంవత్సరమున గ్రీకులకు ఇంగ్లాండు, ఫ్రాన్సు, రష్యాప్రభుత్వములు తోడ్పడి తురుష్కము నోడించెను. ఇంతటితో గ్రీసుదేశము స్వాతంత్ర్యమును సంపాదించి తురుష్కమునుండి విడివడెను.

క్రమక్రమముగ సామ్రాజ్యము క్షీణించుచున్నను,

తురుష్క సుల్తానులుమాత్రము నిజస్థితిని కనుగొనిరి. వారి దృష్టి తొల్లింటి తమ వైభవముపైననేనిల్చి యుండెడిది. ఒకానొక కాలమున తురుష్క సుల్తానులపేరు వినినంతనే యూరోపు ఖండమంతయు గడగడలాడిన విషయమును మాత్రమూహించుకొని వారలుప్పొంగుచుండెడివారు. తొల్లింటివలెనే తమ వైభవముకొఱకును, ఆడంబరముకొఱకును ధనమును విచ్చలవిడిగ వ్యయముచేయజొచ్చిరి. ఇట్లుచేయుటవలన తురుష్క ప్రభుత్వము నానాటికిని ఋణగ్రస్తముకాజొచ్చెను. ఋణప్రదాతలగు విదేశీయులు, వర్తకహక్కులు, న్యాయవిచారణా స్వాతంత్ర్యములు, ప్రత్యేకమగు ఆర్థికహక్కులు, గనులుత్రవ్వుకొనుట, రైల్లువేయుట మొదలగు ధనసంపాదనా సౌకర్యములు అపారముగ సంపాదించిరి. ఈవిధముగ తురుష్కమండలి యార్థికజీవితమంతయు విదేశీయుల హస్తగతమయ్యెను. ధనోత్పాదనముకావించి లాభములు ఋణప్రదాతలు కొనిపోవుచుండ తురుష్కప్రభుత్వమువారు అప్పుచేసి పప్పుకూడ తినజొచ్చిరి. కాలక్రమమున ఋణములు మితిమీరిపోయెను. తురుష్కప్రభుత్వమునకు ఋణముల దీర్చుటమాట యటుండ వానిపై వడ్డీనికూడ నొసంగజాలని పేదరికమేర్పడెను. ఈఅప్పులను తీర్చుటకై ఇగ్లాండు, ఫ్రాన్సు, హోలెండు, ఇటలీ, జర్మనీ, ఆస్ట్రియాప్రభుత్వముల ప్రతినిధులు ౧౮౮౧ వ సంవత్సరమున నొకసంఘముగా నేర్పడిరి. ఈ సంఘమునకు అట్టోమాను ఋణసంఘమనిపేరు. తురుష్కప్రభుత్వమువారికిగల ఆదాయములో చాలభాగము వీరికి తాకట్టుపెట్టబడెను. ఇట్లు తాకట్టుపెట్టబడిన ఆదాయమువలన

తురుష్క సుల్తానులు కావించిన అప్పులుతీరవలెను. ఈసంఘము వారి యనుమతి లేనిది తురుష్కప్రభుత్వమువారు నూతనమగు పన్నులను విధింపరాదు. ఉన్నపన్నులను తగ్గింపరాదు. ఈ విధముగ తురుష్క సుల్తాను పేరునకు మాత్రము సింహాసనాసీనుడై, నిజమునకీ ఋణసంఘమువారికి లోబడియుండెనని చెప్పవచ్చును. ఈయదను కనిపెట్టి పాశ్చాత్య దేశీయులెల్లరును తమదేశపువస్తువులతో తురుష్కమును నింపివేయసాగిరి. తురుష్కమునందు పరిశ్రమలు నశించెను. బీదతనము హెచ్చెను. వ్యవసాయమే తురుష్కులకు శరణ్యమయ్యెను. ఈస్టిండియాకంపెనీవారిపాలనము సంపూర్ణముగ స్థాపింపబడిన తరువాత భారతదేశమునందెట్టి దారిద్ర్యమును' ఆర్థిక దాస్యమును ఏర్పడెనో, అట్టిపరిస్థితులే తురుష్కమునందు ప్రతిఫలించెను. తురుష్కసామ్రాజ్యపతనమున కియ్యదికూడ నొకబలవత్తర కారణమని చెప్పవచ్చును.

సర్వవిధముల తురుష్క మధోగతిపాలగుచుండ చూచిసహింపజాలక విద్యావంతులును, దేశాభిమానులునగు కొందరు తురుష్కులు రాజ్యాంగవ్యవస్థను చక్కబరచి, దేశమును తొల్లింటియున్నస్థితికి గొనిరావలయునని ప్రయత్నములు చేయసాగిరి. పందొమ్మిదవశతాబ్ది మధ్యభాగమునందిట్టియున్నతాదర్శములుగల సంఘమొకటి తురుష్కమునందు స్థాపితమయ్యెను. ఈసంఘము యావనతురుష్కసంఘ (Young Turks) మనుపేర ప్రసిద్ధిగాంచెను. తురుష్కమునందు సుల్తాను ప్రభుత్వమువలన నానాటికి బీదతన మధికమగుటయు, విదేశీయులచే ననేకయుద్ధముల యందవలీలగ

నోడింపబడుటయుగాంచి ఈదేశాభిమానులు సుల్తానును నామమాత్రావశిష్టునిగ గావించి ప్రజాస్వామిక సిద్ధాంతములపై ప్రభుత్వమును స్థాపింప నిశ్చయించుకొనిరి. సామ్రాజ్యాంతర్గతమగు బాల్కనురాష్ట్రమందలి క్రైస్తవప్రజలకు పరిపాలనమునందును, రాజకీయోద్యోగములందును ప్రాతినిధ్యమొసంగి సంతృప్తిపరచి వీరు సామ్రాజ్యమును గాపాడదలచిరి. కాని తురుష్క సుల్తాను వీరిప్రయత్నములకు విముఖత్వము చూపసాగెను. యౌవనతురుష్కపక్షము వారిచే ప్రకటింపబడుచున్న పత్రికలనన్నిటిని అతడాపించెను. సమర్థులగు నాయకులకు ప్రభుత్వోద్యోగముల యాసజూపి, వీరిలో నంతమందిని తనపక్షమునకు ద్రిప్పికొనెను. అట్లులొంగని వారిని దేశభ్రష్టులగావించెను. దేశమునుండి తరిమివేయబడిన తురుష్క నాయకులు, ఇంగ్లాండు, ఫ్రాన్సు మొదలగు విదేశములకేగి యచట నివసించుచు, పత్రికలస్థాపించి ప్రచారము సేయుచు, దేశమోక్షణమునకై యత్నములు సలుపసాగిరి.

క్రమక్రమముగా నీపక్షము బలపడజొచ్చెను. తుట్టతుదకు ౧౮౦౮ వ సంవత్సరమున యౌవనతురుష్కులు దేశమునందు తిరుగుబాటుకావించి అప్పటిసుల్తానగు అబ్దుల్ అజీజును సింహాసనమునుండి తొలగించిరి. బాధ్యతాయుత పరిపాలనము నెలకొల్పి, మంత్రులసలహా ననుసరించి రాజ్యపాలనము సేయుటకై యంగీకరించినందున అబ్దుల్ హమీదు అనునాతనిని వీరు సింహాసనాసీనునిగావించిరి. నిజమున కబ్దుల్ హమీదు సుల్తానునకు బాధ్యతాయుత పరిపాలనమన్న నెంతమాత్ర

మును ఇష్టములేదు. అయినను కాలముతప్పి వచ్చినందున నాతడందులకియ్యకొని, మిద్ధతుపాషా యను యావనతురుష్క నాయకుని తనప్రధానమంత్రిగ నియమించుకొని కొంత కాలమువరకు రాజ్యముచేసెను. కాని బలవంతముపై తా నంగీకరించిన బాధ్యతాయుత పరిపాలనము నెట్లు తారుమారు సేయవలయునా యని యాలోచించుచు, రహస్యముగ కుట్రలుపన్నుచు నేయుండెను. అనతికాలములోనే తగినంత బలముకూర్చుకొని, సుల్తాను అబ్దుల్ హమీదు మిద్ధతుపాషాను ప్రధానమంత్రిత్వమునుండి తొలగించెను. ప్రజాప్రతినిధి సభ లను విచ్ఛిన్నముగావించెను. తన ప్రభుత్వమునకు విరుద్ధ ముగనున్న పత్రికలనన్నిటిని ఆపించివైచెను. ప్రజానాయకుల ననేకుల చెరసాలలందు నిర్బంధించెను. అనేకులు కారా గారములందే మరణించిరి. కాని స్వాతంత్ర్యోద్యమముల నణచివేయుటయందు మహావీరుడగు నీసుల్తాను రష్యాదేశపు రాజుతో ౧౮౭౭ వ సంవత్సరమున యుద్ధముకావించి పూర్తిగ నవమానింపబడెను. ఈ విజయమును పురస్కరించు కొని రష్యాదేశపురాజు తురుష్క సామ్రాజ్యమును సంపూర్ణ ముగ కబళింపవలసినదే కాని ఇంగ్లాండు, జర్మనీ దేశములవారు స్వార్థముకొరకై ఈ రెండుదేశముల నడుమ జొరబడి తురుష్క మునకు కొంచెమనుకూలమగు సంధిని రష్యారాజుచేనొప్పిం చిరి.

ఈ అబ్దుల్ హమీదుసుల్తాను స్వాతంత్ర్యోద్యమ నాయకులనందరను దేశద్రోహులుగ పరిగణించి నిర్బంధిం చుటయేగాక, ఉత్సాహపూరితులును, దేశాభిమానులునగు

స్త్రీపురుషులందరను అనుమానించి తమదృష్టియందుంచుకొనవలయునని పోలీసుశాఖవారి నాజ్ఞాపించెను. ఇంతేకాదు, దేశమునందెట్టి నూత్నభావములుత్పన్నములగుచున్నవో, ఎట్టిప్రచారములు జరుగుచున్నవో కనిపెట్టి తనకు తెలియజేయుచుండుటకై ఈసుల్తానొక గూఢచారవర్గమును నియమించెను. ఈగుప్తశాఖవారు దేశమంతటను వ్యాపించి తమ దుష్టధర్మములను మహాదీక్షతో నిర్వర్తింపసాగిరి. వీరు వాయువువలె సర్వాంతర్యాములై ప్రజలదైనందినక వ్యాపారములయందలి స్వల్పవిషయముల కూడ రహస్యముగ పరికింపజొచ్చిరి. చారవర్గమువారి యీ పైశాచిక కార్యదీక్షవలన దేశమందెల్లెడలను అశాంతిప్రబలి, ప్రజలందరును దద్దరిల్లిపోయిరి. తనపాలనము దేశమునందశాంతికల్గించుచున్నదని యెరింగి, తనపదవిని బలపరచుకొనుటకై ఈసుల్తానొక నూతనోద్యమమును బయలుదేరదీసెను. ఖలీఫా మహమ్మదీయ ప్రపంచమునకంతకును గురువు. ఈపదవివలన తనకుగల గౌరవమును పురస్కరించుకొని, మహమ్మదీయులందరనేకీభవింపజేసి, తాను వారికి నాయకుడుగ నుండవలెనని యీ సుల్తానూహాకావించెను. అందులకై అబ్దుల్ హమీదు, మహమ్మదీయులే దేశమందున్నను తాను వారిని సంరక్షించెదననియు, వారందరును స్నేహభావముతో ప్రవర్తించుచు, తన్ను తమమిత్రునిగ పరిగణింపవలయునని ప్రచారముకావింపసాగెను. ఈవిధముగ మహమ్మదీయులందరి గౌరవమునకును పాత్రుడయి తనపదవిని బలపరచుకొననగునని యీసుల్తానుని యాశయము. తనకు మహమ్మదీయప్రపంచముయొక్క

సానుభూతియు, గౌరవమును లభించినయెడల తురుష్క ప్రజలొక్కరు ప్రతికూలురుగనున్నను తనపదవికి భంగము లేదని యాతడెత్తువేసెను. ఇందులకు ఫలితమే 'Pan Islamism' (పాన్ ఇస్లామిజం) అను ఉద్యమము. యీ యుద్యమమునకు ప్రపంచపరిస్థితులనుకూలముగ నున్నందున అబ్దుల్ హమీదు సుల్తాను యత్నములు ఫలవంతములై యాతనికి మహమ్మదీయ ప్రపంచము నఖండమగు గౌరవమును, పలుకుబడియు లభించెను. సుల్తానుపక్షము బలపడుటవలన స్వాతంత్ర్యవాదుల కష్టము లినుమడించెను. తాను నిరంకుశ ప్రభువునని చాటుటకై యీసుల్తాను ఖైరుద్దీన్ అను ట్యూనిస్ దేశీయుని ప్రధానమంత్రిగ నియమించుకొనెను. ఇట్లు కావించుటవలన ఇంతవరకును సుల్తానున కనుకూలురగు వారుకూడ యాతనికి విపక్షులుకాసాగిరి.

అబ్దుల్ హమీదు సుల్తానెంతటి క్రూరనిర్బంధవిధానము నవలంబించినను స్వాతంత్ర్యోద్యమము మాత్రము క్షీణింప లేదు. బాహాటముగ నెట్టియుద్యమమును నిలుపజాలనందున దేశాభిమానులు రహస్యసంఘముల స్థాపింప మొదలిడిరి. అట్టివానిలో ఐక్యత అభివృద్ధిసంఘమొకటి (Union and Progress party) యీ సంఘము-సలోనికాపట్టణమున స్థాపింపబడెను. అందు ముస్తఫా కమాలుపాషా సభ్యుడుగ నుండెను. యీసంఘమువారు ౧౯౦౮ జూలై నెలయందు గొప్పతిరుగుబాటుచేసిరి. నిరంతరమున ప్రమత్తులైయుండెడి సుల్తానుగూఢచారవర్గ మొక్కపర్యాయ మశ్రద్ధకులోనైరి. తిరుగుబాటుదారులపక్షము బలవత్తరముగనున్నందున సుల్తాను

విధిలేక వారియిష్టానుసారము రాజ్యపరిపాలనము సేయుట కంగీకరించెను. కాని యిట్లెంతో కాలము గడువలేదు. తొమ్మిది నెలలలో మరల బలమును సమకూర్చుకొని సుల్తాను అబ్దుల్ హమీదు ప్రజా ప్రతినిధిప్రభుత్వమును తొలగించి నిరంకుశముగ పాలింపసమకట్టెను. కాని ఆప్రయత్నము కూడ సఫలముకాలేదు. స్వాతంత్ర్యవాదులతిశీఘ్రకాలములో మ్యాసిడోనియా నుండివచ్చిరి. సుల్తాను సహాయమునకై ఆనటోలియా నుండి రావలసిన సైన్యము సకాలమునకు రాలేదు. ప్రజాపక్షమువారు కాన్స్టాంటినోపులును ప్రవేశింపగా వారికిని, సుల్తాను సైన్యములకును యుద్ధము జరగెను. సుల్తా నోడిపోయి దేశమును వీడి పారిపోయెను. స్వాతంత్ర్యవాదులు అయిదవ మురాదును సుల్తానును గావించిరి.

ఈ సంవత్సరమునుండి అనగా ౧౯౦౮ నుండి— ౧౯౧౮ వరకును యావనతురుష్కకక్షివారే తురుష్కము నందధికారపదమునందుండిరి. ౧౮౭౬ వ సంవత్సరపు మిద్ధతుపాషా నాటి ప్రజాస్వామిక ప్రభుత్వము తిరుగస్థాపింపబడెను. కాని యీయావనతురుష్కకక్షివారు ప్రభుత్వమును జయప్రదముగ కావింపజాలరైరి. అబ్దుల్ హమీదుసుల్తాను పరిపాలనమున ప్రోత్సాహమొందిన పూర్వాచారపరాయణులకును, యావన తురుష్కులకును పోటీయేర్పడెను. కాని తుదకు యావనతురుష్కులే విజయమునందిరి. తొల్లింటి సుల్తానులు కావించిన ఋణములను తీర్చుటకై తురుష్కప్రభుత్వమువారి యాదాయములో చాలభాగము

అట్టోమాను ఋణసంఘమువారికి తాకట్టుపెట్టబడెనని యీ వరకే తెలుపబడినది. ఆర్థికస్వాతంత్ర్యము లేనందున యౌవనతురుష్కకక్షివారికి కాలుసేతులుకట్టివైచినట్లయ్యెను. వారు స్త్రీవిద్యను ప్రోత్సహింపదలచిరి. బాలబాలికలకు ప్రాథమిక విద్యను నిర్బంధము గావింపదలచిరి. యీ సంస్కరణము లన్నిటిని ఆచరణయందిడుటకై ధనమత్యంతావశ్యకము. కాని దేశమందలి యాదాయమంతయు విదేశీయులకు తాకట్టుపెట్టబడియుండ ప్రభుత్వమునకు ధనమెట్లు చేకూరును? విదేశీయుల ప్రతిఘటించి నిల్చు ధైర్యసాహసములు తురుష్క ప్రభుత్వమునకు లేకుండెను. కావున యౌవనతురుష్కుల సంస్కరణాభిలాష యుద్దేశమాత్రముతోడనే నశించెను. యీ యౌవనతురుష్కులు తురుష్కమునం దట్టోమాను ప్రభుత్వమును తిరుగస్థాపింపవలయుననియు, ప్రభుత్వమంతయు తురుష్కులచే నడుపబడవలయుననియు తీర్మానించు కొనిరి. తురుష్కేతరులును, మహమ్మదీయేతరులునగు ప్రజలకు స్వాతంత్ర్యమును, సమానహక్కుల నిచ్చుటయందు వీరెట్టి వ్యగ్రతయునుచూపలేదు. తురుష్కభాష రాజకీయభాష కావింపబడెను. అట్టోమాను పక్షమునకు విరుద్ధమగు ప్రచారమును వీరు కఠినముగ నణచివైచిరి. తురుష్కసామ్రాజ్య మందలి క్రైస్తవులకు రాజకీయోద్యోగములలో ప్రాతినిధ్యమొసంగబడలేదు. ఇట్లుపక్షపాతముగ పరిపాలనము కావించినందున యౌవనతురుష్కులకు జయము సిద్ధింప లేదు. తురుష్కసామ్రాజ్యమందలి క్రైస్తవు లితరదేశము లందలి స్వమతస్థుల సహాయముతో తురుష్కప్రభుత్వము

నోడించి స్వాతంత్ర్యమును సంపాదించుటకై ప్రయత్నము కావింపజొచ్చిరి. బాస్నియా హెర్జగోవినా రాష్ట్రములు ఆస్ట్రియాచే కలుపుకొనబడెను. బల్గేరియా వారు అట్లోమాను సామ్రాజ్యమునుండి విడివడిపోయిరి. ఇటలీవారు తురుష్క-సామ్రాజ్యాంతర్గతమైన ట్రిపోలీబెన్ ఘాజీ ప్రాంతములను జయించి బాల్కను రాష్ట్రములవారు మరిట్సానదికి పశ్చిమమునను్న ప్రదేశమంతయు నాక్రమించుకొనిరి. ౧౯౧౧-౧౨ నందలి బాల్కను యుద్ధములవలన తురుష్కము మరికొంత భూభాగమును గోల్పోయెను. తురుష్కమున కాఫ్రికాయందలి సామ్రాజ్యమంతయు నశించెను. యూరోపునందు కాన్‌స్టాంటినోపులు, ఏడ్రియానోపులు, తప్ప తక్కిన రాజ్యము నంతను గోల్పోయెను. మధ్య ఆశియాయందు, అర్మీనియా, కుర్దిస్థానము, సిరియా, మెసొపొటేమియా, అరేబియా మాత్రము తురుష్కమునకు దక్కెను.



# మూడవ ప్రకరణము.



## ప్రపంచసంగ్రామము.



ప్రపంచ మహాసంగ్రామమునందు తురుష్కము సైతము పాల్గొని జర్మనీపక్షము వహించెను. ఆనాటికే కమాలు సమర్థుడగు సేనానాయకుడని పేర్వడసియుండెను. కాని యాతడు నిరంతరము నప్పటి ప్రభుత్వమును, వారిరాజనీతిని ఖండించుచున్నందున యుద్ధరంగమునకు పోవుటకై ప్రప్రథమ మున నాతని కనుజ్ఞయొసంగబడలేదు. ఎట్లైనను తన్ను యుద్ధ భూమికి పంపవలయునని కమాలు పట్టుపట్టినందున తుట్టతుదకు ప్రభుత్వమువారంగీకరించిరి. కమాల్ పాషాను జర్మను సేనానాయకుడగు వాన్ సాండర్సు సేనానియధికారమునం దుంచి గల్లీపోలీకిపంపిరి. తురుష్కసైనికులు పాశ్చాత్య సిద్ధాంతముల ప్రకారము క్రమశిక్షనందినవారు కానందున వాన్ సాండర్సు వారితో శత్రువుల నెదిరింపజాలక, కమాల్ పాషాను పిల్చి, "వ్యర్థులగు నీతురుష్కసైనికులతో నేనేమియు చేయజాలను" అని చెప్పివైచెను. స్వజాతినిందను విని కమాలుపాషా ఆగ్రహోదగ్రుడయ్యెను. కాని కోప మునుదిగమ్రింగి, "ఈయుద్ధమునందు నాకు సర్వాధికారములు నిమ్ము. తురుష్కసైనికుల సహాయముతో నేనేమి చేయగలనో చూపెదను" అనెను. కమాలుపల్కులందెవ్వ రికిని నమ్మకము కలుగలేదు. కాని సాండర్సుసేనాని యాతనికి

సర్వాధికారములు నొసంగి, యాతనిని ౧౬౦౦౦౦ సైన్యము నకు నాయకునిగావించెను. తోటి యుద్యోగులకుకూడ కమాలు సామర్థ్యమునందు నమ్మకము లేకుండెను. యుద్ధము నందు కమాలు స్వయముగ పాల్గొని తనసైనికుల హెచ్చ రింప జొచ్చెను. రణరంగమున నాతడొక గుండుదెబ్బతగిలి పడిపోయెను. కమాలు మరణించెనని సైనికులందరును తలంచిరి. కాని అనతికాలములో నాతడులేచి నిలువబడెను. ఆతని జేబులోని గడియారము మాత్రము పగిలిపోయెను. ఈ విచిత్రము చూచుసరికి సైనికులందరు నాశ్చర్య నిమగ్నులైరి. తమనాయకునికి భగవత్సహాయము కలదని వారందరికిని నమ్మకము కల్గెను. దురదృష్టవంతుడగు వాని నాయకత్వ మును తురుష్కు లంగీకరింపరు. కాని భగవత్కటాక్షమునకు పాత్రుడగు వానితో గూడి ఎంతలేసి మహాత్కార్యములనైన యవలీలగ గావింపగలరు. మిత్రమండలివారు తురుష్కము నవలీలగ నోడింపవచ్చునని తలంచిరి. ఈవిషయమున వారికి కమాలుపాషా వలన నాశాభంగము సంభవించెను. తుదకు మిత్రమండలి సేనలు గెల్లీపోలీని వదలిపోయెను.

వాన్‌సాండర్సు సేనాని కమాలుపాషా సామర్థ్యమును మిక్కిలి కొనియాడి, అతనిని తన తరువాత డార్డనెల్సు సేనలకు నాయకునిగ నియమింపవలెనని సిఫారసు చేసెను. కాని తురుష్క ప్రభుత్వమునకు కమాలునెడ చాల యసంతుష్టి యుండినందున నాతనికి యుద్యోగము లభింపలేదు. మిత్రమండలివారు డార్డనెల్సు జలసంధిని వీడి పోయినతరువాత కమాలుపాషా కాన్‌స్టాంటినోపులు

నగరమునకు తిరిగివచ్చెను. ప్రజలందరును విజయలక్ష్మినిచేపట్టి యరుదెంచిన సేనానాయకునకు హృదయపూర్వకముగ స్వాగత మొసంగిరి. కాని ప్రభుత్వమువారు మాత్రము మౌనము వహించి యూరకుండిరి. తాను స్వయముగ యుద్ధమునందు శత్రువుల జయించినను తుదకు జర్మనీ పక్షమువా రోడిపోవుదురనియే కమాలు మొదటినుండియు తలంచి యుండెను. తన యభిప్రాయముల నాతడు నిర్భయముగ వెల్లడించు చున్నందున ప్రభుత్వమున కీతనిపై మరింత అనిష్టత కల్గెను. యుద్ధ మారంభము కాక పూర్వమే తురుష్కము జర్మనీ పక్షమును వహించుట యెంతయు నష్టదాయకమని యాతడు వాదించెను. కాని యాతని హితబోధన లెవ్వరును చెవినిడరైరి. తమ మిత్రులగు జర్మనులకు తప్పక విజయము చేకూరుననియు, సంగ్రామానంతరము తురుష్కమును తొల్లింటి మహోన్నత దశకు తేనగుననియు ఉవ్విళ్ళూరుచున్న తురుష్కప్రభుత్వమువారికి కమాలుపాషా హితవాక్యములు శల్యసారధ్యమువలె దోచెను. సర్వసేనానాయకునకు కమాలు కావించుచున్న ప్రచారమును గూర్చి తెలుపబడెను. ముస్తఫాకమాలును రాజధానియందుంచుటవలన చాల నష్టములు సంభవించునని తలంచి సర్వసేనాపతి యాతనిని కాకసస్‌కు పంపివైచెను. ఒక సంవత్సరమువరకు కమాలుపాషా యచ్చటనే యుండిపోయెను. ౧౯౧౭ వ సంవత్సరమున ఖలీఫాలకు రాజధాని యగు బాగ్దాదునగరము మిత్రమండలి వారిచే నాక్రమింపబడెను. బాగ్దాదునగరమును తిరుగ జయించుటకై

వాన్ ఫాల్కెన్ హేన్ అను జర్మను సేనాని నియోజితుడయ్యెను. ఈ సందర్భమున కమాలుపాషా కాకసస్ నుండి రావింపబడి, జర్మను సేనానితో కలిసి యుద్ధమును సాగింపవలసినదిగ యాజ్ఞాపింపబడెను. కాని ఫాల్కెన్ హేన్ సేనానికిని కమాలుపాషాకును సరిపడలేదు. ప్రప్రథమమున ముఖ్య విషయములలో నభిప్రాయ భేదములును, తుదకు బహిరంగముగ వాదోపవాదములును సంభవించెను. తమ కడనున్న తురుష్క సైన్యముతో బాగ్దాదుపట్టణమును తిరుగ జయించుట యసంభవమని కమాలభిప్రాయపడెను. ఇంతేకాక కమాలునకు ప్రభుత్వమువారి యుద్ధ శాఖా మంత్రులకును అనేక విషయములలో నభిప్రాయభేదము కలిగెను. ఇట్టి పరిస్థితులలో సేనా నాయకత్వమును వహించుట యసమంజసమని తలంచి, కమాలు తన పదవికి రాజీనామా యొసంగెను. ప్రభుత్వమువా రాతనికి కాకసస్ నందలి తొంటి యుద్యోగము నొసంగెదమని తెలియజేసిరి. కాని స్వాతంత్ర్యప్రియుడగు కమా లిందుల కంగీకరింపక అనారోగ్యము వలన నుద్యోగము విరమించుచుంటినని తెల్పి, తన పదవిని వదలుకొనెను. ౧౯౧౮ వ సంవత్సరమున జర్మనులు మిత్రమండలి వారితో తుదిపర్యాయము మహా ఘోరముగ పోరాడుటకై ప్రయత్నములు సల్పుచుండ, ముస్తఫాకమాలు జర్మనీకేగి కైజరు చక్రవర్తితోడను, జర్మను సర్వసేనాపతియగు వాన్ హిండన్ బర్గు తోడను యుద్ధమును గూర్చి ప్రసంగించెను. జర్మనుల యపారసేనాబలమును, వారికి జయమునందు గల ప్రబలవిశ్వాసమును గూడ కమాలుపాషాకు నమ్మకము కల్గింప

జాలవయ్యెను. జర్మనీనుండి తిరిగి వచ్చిన తరువాత కమాలు, తురుష్క సుల్తానును సందర్శించి, యుద్ధమునం దాతడు స్వయముగ నాయకత్వమును వహించి తురుష్క సైన్యముల కుత్సాహము కల్గింపవలెనని కోరెను. కాని సుల్తానిందుల కంగీకరింపడయ్యెను.

కమాలు చెప్పిన జ్యోస్యము నిజము కాసాగెను. జెరుసలేమ్ పట్టణమును బ్రిటీషువా రాక్రమించిరి. ముస్తఫాకమాలు సిరియా యందు సేనానాయకుడుగ నియమింపబడెను. అచ్చటి సేనలకు వాన్ సాండర్స్ అను జర్మను ఉద్యోగి సర్వసేనాపతి. ఆతడు మిక్కిలి సమర్థుడే. కాని,నానాటికిని ఆతని ప్రతాపము క్షీణింపజొచ్చెను. సైన్యములు పల్చబడెను. కాని సహాయసేన యెటనుండియు రాదయ్యెను. బ్రిటీషు సేనానియగు జనరల్ ఆలన్బీ విజృంభింపసాగెను. ౧౯౧౮ వ సంవత్సరమునందు కమాలు యుద్ధరంగమున కేగు సరికి, సేనలుచాల దైన్యము వహించియుండెను. అపజయమని యెరింగియు, ధైర్యము గోల్పోవక అసమర్థములగు నా సేనలతోడనే కమాలు యుద్ధమును సాగించెను. అత్యంత పరిశ్రాంతివలన నాతని యారోగ్యము చెడెను. తుదకు బ్రిటీషు సైన్యములు తురుష్కుల నోడించి పారద్రోలెను. సేనలతో వెనుకకు తగ్గుచువచ్చి, కమాలు, తుదకు మధ్యఆశియా యందలి కొండలలో దాగికొనవలసివచ్చెను. తురుష్క మింతటితో యుద్ధమునుచాలించి, అక్టోబరు ౩౦ వ తేదీ మిత్రమండలితో ముడ్రాసు తాత్కాలికసంధి కావించుకొనెను.

# నాల్గవ ప్రకరణము.



## ఇటాలో-గ్రీకు ఆక్రమణము-జాతీయోద్యమవి జృంభణము.

---

ముడ్రాసు తాత్కాలిక సంధివలన తురుష్క సామ్రాజ్య పతనము పూర్తియయ్యెను. ఈసంధివలన తురుష్కమున కిజిప్టు, మొరాకో, ట్యూనిస్, ట్రిపోలీ ప్రాంతములపైగల నామమాత్రావశిష్టమగు నధికారముకూడ తొలగింపబడెను. మధ్యఆశియాయందలి హెజాజి, మెసపొటేమియా, ట్రాన్సు జోర్డైను ప్రాంతములలో ఆంగ్లేయులు యుద్ధకాలములో తమకు సహాయముకావించిన కొందరు అరబ్బునాయకులను రాజులుగ గావించి వారిని తమ సంరక్షకత్వములోనికి జేర్చుకొనిరి. పాలస్తైన్ దేశముపై కూడ ఆంగ్లేయులు తమయధికారము స్థాపించుకొనిరి. సిరియా దేశము ఫ్రెంచివారి సంరక్షకత్వము లోనికి గైకొనబడెను. ఈవిధమున తురుష్కమునకు మధ్య ఆశియాయందుగల సామ్రాజ్యమెల్ల శత్రుహస్తగతమయ్యెను. తురుష్కమునందు నివసించుచున్న ఆర్మనియనులు, కుర్డులు మొదలగు తురుష్కేతరులను విడదీసి వారిని తమ యధికారములోనికి గొనిరావలయునని మిత్రమండలివారు ప్రయత్నములు కావింపజొచ్చిరి. తురుష్క రాజధానియగు కాన్‌స్టాంటినోపులును, ఏడ్రియానోపులును, పరిసర ప్రాంతములను లాగుకొని తురుష్కులను యూరోపుఖండము నుండి సంపూర్ణముగ తరిమివేయవలయునని మిత్రమండలి

వారు సంకల్పించిరి. ఇంతేకాదు తురుష్కమును సర్వవిధముల నిర్బంధించి యాజాతిని నామమాత్రావశిష్టముగ కావింప మిత్రమండలివారూహకావించిరి. యుద్ధము ముగియగనే తురుష్క సైన్యములన్నియు పంపివేయబడెను. దేశసంరక్షణమున కావశ్యకములగు స్వల్పసైన్యములమాత్రము పోలీసు అధికారముల నొసంగి తురుష్కమునందునిల్పిరి. తురుష్కనౌకా సైన్యమంతయు బ్రిటీషు వారి యధీనముకావింపబడెను. డార్డనల్స్, బాస్ఫరసు జలసంధులను, వానిలోనికి ప్రవేశము నొసంగు దుర్గములను, మిత్రమండలివారు స్వాధీనముకావించుకొనిరి. తమక్షేమమునకై యవసరమనితోచిన ప్రాంతముల నెల్ల యాక్రమించుటకై తమకధికారముకలదని మిత్రమండలివారు ప్రకటించిరి. తురుష్కమునందలి అన్ని రేవుపట్టణములును, అయోమార్గములును, తంత్రమార్గములును, మిత్రమండలి యుద్యోగుల స్వాధీనము కావింపబడెను. శత్రువులచే నిర్బంధింపబడిన తురుష్కసైనికులకు విడుదల కాలేదు. కాని తురుష్కులచే చెరపట్టబడిన మిత్రమండలివారి సైనికులు విడుదల కావింపబడిరి. విజయోన్మత్తులగు మిత్రమండలివారు విధింపనున్న శిక్షననుభవించుటకై తురుష్కము బోనులోని నేరస్థునివలె వేచియుండెను.

అనటోలియాయందలి ఏయొక్క జిల్లానుమాత్రము తురుష్కుల స్వాధీనముసందుంచి తక్కినభాగము లన్నిటిని మిత్రమండలివారు కబళించివైతురని ప్రపంచమంతయు తలంపజొచ్చెను. అయ్యది యకారణముగకాదు. ప్రపంచ యుద్ధము జరగుచున్నకాలములో ఇంగ్లాండు, ఫ్రాన్సు,

ఇటలీ, రష్యాలకు తురుష్కము నేవిధముగ పంచుకొనవలయునను విషయమునుగూర్చి నాల్గురహస్యపుటొడంబడికలు జరగెను. మొదటి రహ్యాపు టొడంబడిక ౧౮ వ మార్చి ౧౯౧౫ తేదీని ఇంగ్లాండు, ఫ్రాన్సు, రష్యాలనడుమ జరగెను. తురుష్కమునందలి విశేషభాగమును రాజధాని యగు కాన్ స్టాంటినోపులు నగరమును ఆంగ్లేయులు జారుచక్రవర్తికిప్పించునట్లును, (ఇందువలన చిరకాలమునుండి. తురుష్కమును కబళింపవలెనని యువ్విళ్లూరుచున్న రష్యాచక్రవర్తి మనోరథ మీడేరును.) అందులకు ప్రతిఫలముగ పర్షియాయందలి దక్షిణ మధ్యమభాగములను రష్యావారు బ్రిటీషువారి యధీనమునందుంచునట్లును, (చిరకాలమునుండి ఆంగ్లేయులకు రష్యావారియెడ నసూయయుండెను. ఏలనన పర్షియా హిందూదేశమునకు మిక్కిలి సమీపముననున్నది. రష్యావారి ప్రాబల్యము పర్షియాయందు నానాటికి హెచ్చుకాజొచ్చెను. తమ భారతీయ సామ్రాజ్యమునకు సమీపమున రష్యావారు బలపడుచుండుట ఇంగ్లీషువారికి కన్నెఱ్ఱగ నుండెను. హఠాత్తుగ నెన్నడైన భారతదేశముపై రష్యావారు దాడి వెడలెదరేమోయని ఇంగ్లీషువారి భయము. ఈ సంధివలన రష్యావారు పర్షియాదక్షిణ మధ్యమభాగముల నాంగ్లేయుల స్వాధీనముకావించి, తాము హిందూదేశమునకు చాలదూరముగ నున్నప్రాంతములలో మాత్రమే ప్రాబల్యత సంపాదించుట కంగీకరించిరి. ఇక నింగ్లీషువారు రష్యావారివలన తమ హిందూదేశ సామ్రాజ్యమున కెట్టి విపత్తునులేకుండ నిర్భయముగ నుండవచ్చును) నిశ్చయింప

బడెను. రెండవ యొడంబడిక ౨౬ వ ఏప్రెపెల్ ౧౯౧౫ వ తేదీని ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ ప్రభుత్వముల నడుమ లండను నగరమునందు జరగెను. ఈసంధిప్రకారము యిటలీ వారు యుద్ధమునందు మిత్రమండలిపక్షమును వహించిరి. యిందులకు ప్రతిఫలముగ తురుష్కములోని అడేలియా, లిబియా రాష్ట్రము యిటలీకి యుద్ధపర్యవసానమున నొసంగ బడవలెను. ౧౬ వ మే ౧౯౧౬ వ తేదీని ఫ్రాన్సు, యింగ్లాండు, రష్యాలనడుమ సైక్సుపికటు సంధి జరగెను. ఈ సంధిప్రకారము తురుష్కమునందలి చాలభాగము రష్యాకొసంగబడెను. ౧౭ వ ఏప్రెపెల్ ౧౯౧౭ వ తేదీని యింగ్లాండు, ఫ్రాన్సు, యిటలీలకు నడుమ జరిగిన సెంటుజీన్‌డిమారిన్ సంధివలన యిటలీవారు సైక్సుపికటు ఒడంబడిక నంగీకరించుటయు, లండను ఒడంబడిక ప్రకారము ఒసంగబడిన అడేలియా, లిబియారాష్ట్రములేకాక స్మర్నా యును, తురుష్కములోని పశ్చిమప్రాంతములును ఇటలీ కొసంగబడెను. కాని ఈసంధి రష్యాచక్రవర్తిచే నంగీకరింప బడలేదు. ఈకారణమువలన ఒడంబడికలు కావించుకొనిన దేశములవారి కభిప్రాయభేదములు, కలహములు సంభ వించుట ముందుముందు మనము గాంచగలము. యీరహస్య సంధుల ప్రకారము మిత్రమండలివారు తురుష్కమునంతను తమలోతాము పంచుకొనిరి. రహస్యముగ నిట్లు ఒడంబడికలు కావించుకొనియు బహిరంగముగ మిత్రమండలివారు నిషధ యోగ్యులవలె ప్రకటనలు కావించుచుండిరి. ఆనాటి రాజనీతి వేత్తలలో నగ్రగణ్యుడని పేరొందిన బ్రిటీషు ప్రధానమంత్రి

లాయడుజార్జి ౫ వ జనవరి ౧౯౧౮ వ తేదీని ఆంగ్ల పార్లమెంటులో ప్రసంగించుచు, తురుష్కుల రాజధానియగు కాన్‌స్టాంటినోపులు నగరమునుకాని, వారి మాతృభూమి యగు ఆనటోలియానుగాని, తురుష్కులు విశేషముగ కాపురము సేయుచున్న థ్రేసురాష్ట్రమునుగాని వారికడనుండి లాగికొనుటకు తాము యత్నించుటలేదని వక్కాణించెను. రాజనీతి కుశలుడనిన జంకుగొంకులులేక యబద్ధము పల్కు వాడనియర్థము కాబోలు.

తురుష్కము సంపూర్ణముగ నోడింప బడినదనియు, తురుష్కులు రెక్కలు తెగిన పక్షులవలె పడియున్నారనియు మిత్రమండలివారు నమ్మియుండిరి. వంట యింట జొచ్చిన కుందే లెందుబోగలదను సామెత ప్రకారము తురుష్క మెట్లును తమ చేతినుండి తప్పించుకొని పోజాలదను దృఢ విశ్వాసముతో మిత్రమండలివా రాదేశమును తమ తమ రహస్యపు టొడంబడికల ప్రకారము పంచుకొనక ముఖ్యము లని తోచిన యితర విషయముల నాలోచింపసాగిరి. సంధి సమావేశము ప్యారిసు నగరమునందు జరగెను. సంధి సమావేశమునందు పాల్గొన్నవారు పరస్పర భిన్న ప్రకృతులు గల్గియుండిరి. ఒక వంక సరములేని నాలుకలుగల ఐరోపారాజ్యాంగవేత్తలు, వేరొక వంక నల్లనివన్నియు నీళ్లును, తెల్లనివన్నియు పాలును అని నమ్మునట్టియు, ప్రపంచమునందు ధర్మమును అంతరాజతీయ సామరస్యమును నెలకొల్ప దలంచి మహోన్నతాదర్శములచే ప్రేరేపింప బడిన విల్సను మహాశయుడు (అమెరికా సంయుక్త

రాష్ట్రసభాపతి ) కూర్చుండిరి. కొంతకాలమువరకును విల్సను సభాపతికి మాయలయందు శకునిని చంపి పుట్టిన ఈ రాజ్యాంగవేత్తల పోకడలు తెలియలేదు. తన యాదర్శముల నాచరణయం దిడుటకు విల్సను మహాశయుడును, తమ దురాశల తృప్తినొందించుటకై ఐరోపారాజ్యాంగ నీతికుశలురును పెనగులాడిరి. తుదకు అమాయకుడగు విల్సను సభాపతి ఆశాభంగమును, అవమానమును పొంది స్వదేశమునకు మరలిపోయెను. శత్రువగు జర్మనీదేశమును సర్వనాశనము కావించుటకై పతకముల వేయుచు, మిత్రమండలివారు తురుష్క సమస్యను చాలకాలమువరకు పరిష్కరింప బూనరైరి.

ఇట్టి స్థితిలో ౨౯ వ ఏప్రెల్ ౧౯౧౯ తేదీని ఇటలీవారు తురుష్కముపై దండెత్తి అడేలియా రాష్ట్రము నాక్రమించుకొనిరి. ౧౯౧౫ వ సంవత్సరమున ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీలకు నడుమ జరగిన లండను ఒడంబడిక ప్రకారము యుద్ధానంతరము మిత్రమండలివా రిటలీకి అడేలియా, లిబియారాష్ట్రముల నొసంగవలెను. ఇదియును గాక ౧౯౧౭వ సంవత్సరమున ఇటలి, ఫ్రాన్సు, ఇంగ్లాండులకు నడుమ జరగిన సెంటుజీన్ డిమారిన్ ఒడంబడిక ననుసరించి ఇటలీవారికి స్మర్నా రాష్ట్రమును, తురుష్కమునందలి పశ్చిమ ప్రాంతములునుకూడ రావలయును. ఈ సంధికి రష్యాచక్రవర్తి యంగీకరింపలేదని సాకుపెట్టి స్మర్నారాష్ట్రమును ఇటలీవారి కిచ్చుటకు వీలులేదని ఆంగ్ల, ఫ్రెంచి, ప్రతినిధులు వాదింప జొచ్చిరి. రహస్యపు టొడంబడికలలో పాల్గొన్న రష్యాచక్రవర్తి

పదభ్రష్టుడయ్యెను. రష్యాయందు బోల్షివిక్కు ప్రభుత్వము స్థాపింపబడెను. వీరికి సామ్రాజ్య తత్వమునెడ బద్ధ విరోధము. అందుచే రహస్యపు టొడంబడికల ప్రకారము రష్యాకు చెందవలసిన రాష్ట్రములుకూడ మిత్రమండలియందలి ఇతర ప్రభుత్వములే పంచుకొనవచ్చును. ఈరహస్యపు టొడంబడికల వలన తురుష్కమునందలి చాల భాగమును ఇంగ్లాండు ఫ్రాన్సు దేశములవారు కబళించుచుండ, తామీ దోపిడిలో భాగస్వాములము కాజాలమేమోయని ఇటలీవారు భయపడ జొచ్చిరి. ఈ పరిస్థితులలో ఇంగ్లాండు ఫ్రాన్సుల యంగీకార మును పొందుట యసంభవమని తలంచి ఇటలీవారు తమ మిత్రులతో సంప్రతించకుండగనే తురుష్కముపైదాడి వెడలి అడేలియా రాష్ట్రము నాక్రమించుకొని స్మర్నానుకూడ మ్రింగవలెనని ప్రయత్నములు చేయసాగిరి. తామంగీకరించి నను, మానినను ఇటలీవారెట్లైన స్మర్నారాష్ట్రము నాక్రమించి తీరుదురని మిత్రమండలిలోని యితర రాష్ట్రముల ప్రతినిధులకు భయముతోచెను. ప్రథమమునుండియు గ్రీకులు స్మర్నాను తమ రాజ్యములో కలుపుకొనవలెనని జతనములు సల్పుచుండిరి. ఆనాటి గ్రీసుమంత్రి వెనిజిలాసు అను నాతడు తన వచోనైపుణివలనను, సామర్థ్యమువలనను ఆంగ్ల ప్రధానమంత్రియగు లాయడు జార్జికి చాల ప్రీతి పాత్రుడై యుండెను. ఈ గ్రీకుమంత్రి లాయడుజార్జివద్ద తనకుగల పలుకుబడిని వినియోగించి గ్రీకులు స్మర్నా నాక్రమించుటకై మిత్రమండలి యందలి ఇతర దేశములవారి యంగీకారమునుకూడ బడసి స్మర్నాపై దండయాత్ర

సాగించెను. యిందులకు ఫలితముగ స్మర్నాయును, తత్పరిసర ప్రాంతములును గ్రీకుల హస్తగతమయ్యెను. గ్రీకులు స్మర్నాను ఆక్రమించుటకై ఏదైన సాకు గావలయునుకదా! అందులకై స్మర్నాయందుగల క్రైస్తవులను, గ్రీకులను, తురుష్కులష్టకష్టములకు లోను గావించుచున్నారని ఆంగ్ల గ్రీకు మంత్రులు ప్రకటించిరి. ఈ ప్రకటనయం దెట్టి సత్యమును లేదని మిత్రమండలివారిచే నియమింపబడిన విచారణ సంఘమువారే ప్రకటించిరి. కాని యీ విచారణసంఘమువారి నివేదిక బహిరంగము కావింపబడలేదు. రాజనీతిజ్ఞుల ప్రియమగు సత్యము నెల్లప్పుడు నిట్లే గౌరవించుచుందురు.

గ్రీకులచే నాక్రమింపబడిన స్మర్నాయును, తత్పరిసరములును తురుష్కప్రజాబాహుళ్యము కలిగినవి. అందుచే వీనిని పాలించుటయందు విశేష నయసామర్థ్యముల గ్రీకులు చూపవలసియుండిరి. అందులకు విరుద్ధముగ గ్రీకులు విజితులగు తురుష్కులయెడ దౌర్జన్యమును మాత్రమునుచూపిరి. తురుష్కులు చాల క్రూరముగ హింసింపబడిరి. ఈ చర్యలవలన తురుష్కమున గ్రీకులయెడ నసహ్యత ప్రబలసాగెను. గ్రీకులకును, తురుష్కులకునుగల పరస్పర వైరమునకును, అసహ్యతకును ఒకచారిత్రిక కారణముకూడ కలదు. చాల కాలము గ్రీసుదేశము తురుష్క సామ్రాజ్యములో నొక భాగముగనుండిన విషయము పాఠకమహాశయులకు జ్ఞప్తి యందుండవచ్చును. ౧౯వ శతాబ్దియందు యింగ్లాండు మున్నగు దేశముల సహాయముతో గ్రీకులు స్వాతంత్ర్యమును సంపాదించిరి. గ్రీకులు తమ యధికారములోనున్న

కాలమున తురుష్కులు వారిని న్యూనత రపరచి అనేకవిధముల హింసించియుండిరి. పాతవైరములను మనసునందుంచుకొని యిప్పుడు గ్రీకులు తురుష్కములో పైశాచిక తాండవ మొనర్చిరి. ఒకానొక కాలమున తమ యధికారమందుండి యిప్పుడు తమతో శత్రుత్వము పాటించుచున్న గ్రీకుల క్రూరకృత్యములు, తురుష్కుల కత్యంత బాధనే గాక అవమానమునుకూడ గల్గించెను. మానవంతులగు తురుష్కులు తమ స్వాతంత్ర్యమును రక్షించుకొనుటకును, తమజాతికి గ్రీకులవలన సంభవించిన పరాభవమును వారిరక్త ప్రవాహములచే కడిగివేయుటకును కృతనిశ్చయులు కాసాగిరి. యుద్ధానంతరమున నిటలీవారును, గ్రీకులును తురుష్కము నాక్రమించినప్పటికాలపు పరిస్థితులను సుప్రసిద్ధ తురుష్క గ్రంథకర్త్రియగు మేడమ్‌హాలిడేఎడిబ్ యిట్లు వర్ణించెను:-

“మిత్రమండలివారి సైన్యములు తురుష్కమును ప్రవేశించిననాటనుండియు గ్రీకులు, అర్మీనియనుల యొక్క దౌర్జన్యము, పొగరుబోతుదనము హెచ్చిపోయెను. నిరపరాధులగు తురుష్క ప్రజలు బహిరంగముగ వీధులలో నవమానింపబడిరి. శత్రుసైనికులు తురుష్కస్త్రీలను కరచెడి వారనియు, తురుష్కుల చంటిబిడ్డలను వేయించి సాయంకాల భోజనమునకై యుపయోగించెడివారనియు ప్రవాదములు బయలుదేరెను. అనేకులు తురుష్కులు నామమాత్రాపరాధ ములపై నిర్బంధింపబడుచుండిరి. కొందరకు జుర్మానాలు విధింపబడుచుండెను. కొందరు మిత్రమండలి సైనికాధ్యక్షులచే కఠినముగ దండింపబడుచుండిరి. శాంతముగ నివసించుచున్న

తురుష్కపౌరులకడ నుండి వారిగృహముల బలవంతముగ గైకొని, వారికి తమ సామానులదీసికొని పోవుటకుకూడ గడవు నొసంగక శత్రుసైనికులు బాధింపసాగిరి. మిత్రమండలి వారిపోలీసులు, అందు ముఖ్యముగ నాంగ్లేయోద్యోగులు తమక్రింది యధికారులగు అర్మీనియనులు గ్రీకులుచెప్పెడి చాడీలకు చెవియొగ్గి తురుష్కులక్రూరముగ హింసింపసాగిరి. తురుష్కస్త్రీలు రైళ్ళనుండియు, మోటార్లనుండియు చాల మోటుదనముతో త్రోసివేయబడిరి. తురుష్కులబిడ్డలు నీచవాచకములచే సంబోధింపబడిరి. ఫెజ్ టోపీలు బలవంతముగలాగివేయబడెను.శత్రుసైనికులు మిక్కిలి చెలరేగి తురుష్కస్త్రీల మొగములపై మేలిముసుగులనుకూడ లాగివేయజొచ్చిరి. యిట్టి యవమానములనుకూడ తురుష్కనాగరకులు గంభీరభావముతో సహించి యూరకుండిరి. కాని వారిమనంబులుమాత్ర మీయవమానములకు ప్రతిక్రియగావించుటకై కృతనిశ్చయములయ్యెను. తురుష్కు డపకారమును, తుదకు ఘోరహత్యలనుకూడ మరువగలడు, క్షమింపగలడు. కాని యాత్మగౌరవమునకు భంగము కల్గినచో నాతడు మరువజాలడని జ్ఞప్తియందుంచుకొనవలయును."

యుద్ధముననడపిన యావనతురుష్కకక్షి వారు దేశమునువీడి పారిపోయిరి. సుల్తాను మిత్రమండలివారి చేతికీలుబొమ్మయయ్యెను. అట్టి యాతడు తన ప్రజల విదేశీయులు పెట్టు బాధలనుండి తప్పింపజాలడని వేరుగ చెప్పనక్కరలేదు. తురుష్కమునందలి పరిస్థితులపై

గ్రంథకర్త్రియే యిట్లువర్ణించెను. "యీవిధముగ తురుష్క మెప్పుడును విభజనము కావింపబడలేదు. తురుష్కులెన్నడును నిర్జింపబడలేదు. ఏదైననొక బలవత్తర ప్రభుత్వముయొక్క సహాయమును సంపాదించి తన ప్రజలనణచియుంచుటకై సుల్తాను సంసిద్ధుడైయుండెను. ఇంగ్లాండునెడ నాతడు చాల మొగ్గుచుండెను. బహుశః ఈజిప్టునందు స్థాపింపబడినట్లుగ తురుష్కమునందుకూడ బ్రిటీషు సంరక్షకత్వమును స్థాపింప వలయునని యాతనియభిప్రాయము కాబోలు. తురుష్క సుల్తానులలో క్రూరులును, అవినీతిపరులును, వ్యర్థులును, త్రాగుబోతులునుకూడ యుండిరి. కాని యింతకు పూర్వము ఉస్మానువంశస్థుడెవ్వడునుకూడ స్వలాభము నపేక్షించి విదేశీయుల సహాయముతో తురుష్కప్రజల నణచివేయుటకై పన్నాగములు పన్ను నంతటి నీచత్వమున కొడిగట్టలేదు. యావనతురుష్కకక్షికి శత్రువులగు మిత్రమండలివారుకూడ నిదే యత్నమున నుండిరి. బ్రిటీషువారి సంరక్షకత్వమున తురుష్కములో నిరంకుశప్రభుత్వమును స్థాపించుటకై వారూహచేసిరి. అందులకై వారును, సుల్తానునుకూడ తురుష్క పార్లమెంటును రద్దుపరుపవలయునని తలంచుచుండిరి. తురుష్క నాయకులలో కొందరు పార్లమెంటరీప్రభుత్వము తమదేశమునకు సరిపడదని యభిప్రాయపడుచుండిరని కూడ నేనీసందర్భమున తెలుపవచ్చును.

స్మర్నాయందలి కొందరు తురుష్కయువకులు గ్రీకులు ముందుముందుకు త్రోచుకొనిరాకుండ నరికట్టుటకై ఒక సంఘమును స్థాపించిరి. మరికొందరు తురుష్కసామ్రాజ్యాంతర్గత

ములై స్వపరిపాలనాధికారములుగల చిన్నచిన్న రాష్ట్రముల స్థాపింపవలయునని ప్రయత్నింపదొడగిరి. అర్మనియనుల తృప్తిపరచుటకై వారడిగినదే తడవుగ తురుష్కమండలి తూర్పు భాగము నంతను వారికొసంగుటకై కొందరు తురుష్కులు సంసిద్ధులైయుండిరి. విదేశీయుల యాజమాన్యమున నొక కుర్దురాష్ట్రమును స్థాపింపవలెనని కొందరూహలు కావించిరి. బ్రిటీషు ప్రధానమంత్రియగు లాయడుజార్జి చాలపలుకుబడి కలవాడు. కావున ఆతడు సూచించిన షరతులన్నిటిని అంగీకరించి ఆతనిని తమపక్షమునకు ద్రిప్పి కొనవలయునని వేరొక కొందరు తలంచిరి. అమెరికావారి సంరక్షకత్వముతప్ప తురుష్కమునకు వేరు తరుణోపాయము లేదని నమ్మినవారు మరికొందరుండిరి "

ఈ పైవాక్యములవలన తురుష్కమునం దాకాలమున నెంతటి ఆత్మవిశ్వాసశూన్యతయును, నైరాశ్యమును బ్రబలియుండెనో యెరుంగనగును. ఇట్టి పరిస్థితులలో తురుష్కప్రజల యందాత్మవిశ్వాసమును కల్గించుటయే కష్టసాధ్యమైయుండెను. అయినను వెనుదీయక, నిరంతరకార్యదీక్ష, అకుంఠిత దేశాభిమానము నను రెండుసాధనములవలన తురుష్కమునందాత్మ విశ్వాసమును కల్గించి, ప్రజలనేకోన్ముఖులగావించి వారిచే దేశద్రోహులును, స్వలాభపరాయణులునగు తురుష్కులను, విదేశీయ శత్రువులగు గ్రీకులనోడింపజేయుట కమాలుపాషా యనన్యసామాన్య సామర్థ్యమునకు తార్కాణము.

---

# అయిదవ ప్రకరణము.



## దేశద్రోహి కాన్స్టాంటినోపుల్ ప్రభుత్వము.



ముస్తఫా కమాలు తురుష్కప్రభుత్వముయొక్కయు, మిత్రమండలివారియొక్కయు అప్రీతికి పాత్రుడైనందున నాతడు కాన్స్టాంటినోపులు నందుండుటశాంతికి భంగకరమని తలంపబడెను. ఈ నూతనపదవియందు తన కొసంగబడిన సర్వాధికారములను దేశోద్ధరణమునకై వినియోగించుట కతడు నిశ్చయించుకొనెను. తురుష్కప్రభుత్వము, సుల్తాను ఖలీఫాలతో బహిరంగవిరోధమును నెరపుటకై యాతడు కృతనిశ్చయు డయ్యెను. అవసరమైనచో మిత్రమండలివారి నెదిరించుటకై కూడ యాతడు తీర్మానించుకొనెను. ఈతని యధికారమందున్న మిత్రమండలివా రాతనిని ఖైదీగ గైకొనవలెనని యభిప్రాయపడిరి. కాని ఉద్యోగమను మిషపైయాతనిని దూరదేశమునకు ప్రవాసమంపుట చాలునని సుల్తాను సూచించెను. తదనుగుణముగ కమాలు ఆనటోలియా యందలి తురుష్కసేనలకు ఇన్స్పెక్టరు జనరలుగ నియమింప బడెను. నిజమున కచ్చట సైన్యమేలేదు. ఆతడు నిర్వర్తింపవలసిన ధర్మములు, తురుష్కసైనికులకడ ఆయుధములు లాగికొని వానిని మిత్రమండలివారికి సమర్పించుటయే. కమాలీయుద్యోగము తనయాదర్శప్రాప్తికి సాధనముగ నుండునని తలంచి యంగీకరించెను.

సైన్యములకు యుద్ధోపకరణములు లేవు. అయినను ఆ సైన్యముతోడనే తానుబూనిన మహత్కార్యమును గావించుట కాతడూహాగావించెను. ఈమహోద్యమమునకు ప్రథమసోపానముగ కమాలు ఆనటోలియా యందలి యితర సైన్యములతో సంబంధమేర్పరచుకొన ప్రారంభించెను.

దేశమందలి పరిస్థితులను చక్కగ విమర్శించి అందులకు ప్రతీకారము నాలోచించుటకై శైవాసునందొక సమావేశమును కావించుటకై నిశ్చయించి కమాలు, ముడ్రాసు తాత్కాలికసంధి తర్వాత దేశమును వీడి పారిపోయిన యౌవన తురుష్క నాయకులను సమావేశపరచెను. ఈ శైవాసు పట్టణము నిరపాయమైనదని తెలిసియే కమాలిద్దానిని జాతీయ సమావేశమునకై నిర్ణయించెను. ఆనటోలియా యందలి ప్రభుత్వోద్యోగు లందరితోడను స్నేహము కావించుకొని, వారందరును తమ పక్షమున జేరునట్లాతడు కావించెను. దేశమందలి ఉన్నతోద్యోగు లందరకును కమాల్ పాషా సందేశముల నంపెను. మిత్రమండలివారి సహాయముతో గ్రీకులు స్మర్నాయందు కావించిన దుండగములను ఖండించుచు, తీర్మానములు కావింపబడెను. ఈ దుర్నయముల నాపింపవలయునని, తురుష్కప్రభుత్వమునకును, మిత్రమండలివారికిని కూడ కమాలుపాషా దీర్ఘములగు తంత్రీవార్తల నంపెను. కావింపబడిన తీర్మానములందును, పంపబడిన తంత్రీవార్తలనుకూడ మహమ్మదీయేతరులగు తురుష్కనివాసులయెడ నెట్టి విరోధభావమును ప్రకటింపబడలేదు.

తురుష్క ప్రభుత్వమును బహిరంగముగ ధిక్కరించి నిలచిన కమాలుపాషాకు దేశమంతయు బాసటయై నిలచెనని తలంపరాదు. బ్రెజిబాండు ప్రాంతమునందలి తురుష్కలీ యుద్యమము నెడ నెట్టి సానుభూతిని చూపకుండుటయేగాక, మిత్రమండలివారి సహాయముతో తురుష్కసుల్తాను పరిపాలనము కావింపవలయుననియు, తద్విరుద్ధముగ కావింపబడు ప్రయత్నములు తమ కంగీకారము కాజాలవనియు ప్రకటించిరి. కాని కమాలుపాషాచే నారంభింపబడిన జాతీయోద్యమమున కనుకూలురగు నిట్టివారు స్వల్ప సంఖ్యాకులుమాత్రమే. అనటోలియా యందలి తురుష్క సైన్యమంతయు నాతని యధికారము సంగీకరించెను. కమాలుపాషా కావించిన ప్రకటనలవలన దేశమందు ప్రబోధము కల్గి ఆ ఉద్యమునందలి సత్యమును గ్రహించి, ప్రజలెల్లరును జాతీయ పక్షమునే యవలంబింపసాగిరి. కాని కమాలుపాషాకుమాత్రము విషమ పరిస్థితు లేర్పడెను. ఆతడింకను తురుష్కప్రభుత్వమువారి యుద్యోగి. కావున ఉద్యోగ ధర్మముల నెరవేర్పవలయును. వేరొక వంక జాతీయోద్యమమునకు గుండెకాయ, విప్లవ కారుడు. ఈ రెండు పదవులకును సామరస్య మేర్పడుట దుర్లభముకదా !

అప్పుట తురుష్కప్రధానమంత్రికి ప్యారిసుసంధి సమావేశమునందు పాల్గొని అట్టోమాను సామ్రాజ్యమును, అట్టోమాను ప్రజల హక్కులను సంరక్షించుకొనవలయునని మిత్రమండలివారికడనుండి యాహ్వానము వచ్చెను. ఈ సమావేశమున కేగుటకై నిశ్చయించుకొని ప్రధానమంత్రి

యగు దామాదుఫరీదుపాషా, తనతోకూడ వచ్చి సంధి సమావేశమున పాల్గొనవలయుననియు, అందులకై తక్షణమే కాన్‌స్టాంటినోపులు నగరమునకు రావలయుననియు కమాలుకు వర్తమాన మంపెను. కమాలీయాజ్ఞను పాలింపలేదు. యుద్ధశాఖామంత్రి ఈ యాజ్ఞనే మరల నంపెను. రెండవ పర్యాయముకూడ కమాలు ప్రభుత్వపు టుత్తరువును తిరస్కరించెను. ఇంతటితో తురుష్క ప్రభుత్వమునకును, కమాలునకును గల సంబంధము విచ్ఛిన్నమయ్యెను. నేటినుండి ప్రభుత్వమువారి మతమున కమాలుపాషా విద్రోహి, విప్లవకారుడు.

తన కార్యక్రమమును ప్రారంభించుటకై కమాలుకు తగిన యదను లభించెను. శైవాసు సమావేశమునందు జాతీయాశయములుగల సంఘముల నన్నిటి నేకోన్ముఖము కావించుటకై కమాలు నిశ్చయించుకొనెను. ఈ యుద్దేశ్యముతో నాతడు దేశీయులందరకును ఈ క్రింది సందేశము నంపెను.

౧. తురుష్క సామ్రాజ్యమును, తురుష్క ప్రజలస్వాతంత్ర్యములును అపాయమునకు లోనై యున్నవి.

౨. వీనిని సంరక్షించుటకై ప్రభుత్వమువారు బాధ్యతగై గొనియున్నారు. కాని ఇందులకు వీరసమర్థులు. కావున దేశమ రక్షితస్థితి యందున్నది.

౩. దేశీయులు తీవ్రకృషిసల్పి తమ స్వాతంత్ర్యమును సంరక్షించుకొనవలయును.

౪. విదేశీయులతో నెట్టి ప్రసక్తియును, వారివలన నెట్టి ఒత్తిడియును లేకుండ తమ దేశీయ పరిస్థితుల స్వతంత్రముగ విమర్శించికొని, తమ జన్మస్వత్వముల స్థాపించుకొనుటకై తగు నుపాయముల నాలోచించుటకు తురుష్కజాతీయమహాసభ సమావేశము కావలయును.

౫. ఇందులకై ఆనటోలియా యందలి శైవాసు పట్టణమున జాతీయ సమావేశము కావించుటకై నిశ్చయింప బడినది. ఈ ప్రదేశము సర్వవిధముల నిరపాయమైనది.

౬. ఈ సమావేశమందు పాల్గొనుటకై దేశీయు లెల్లరును జిల్లాకు ముగ్గురుచొప్పున ప్రతినిధుల నెన్నుకొనవలయును. ప్రతినిధులు అతిశీఘ్రముగ బయలుదేరి గమ్యస్థానమును జేరవలయును.

౭. ఈ ప్రతినిధుల నామముల దేశీయులెల్లరును గూఢ రహస్యముగ పరిగణించి రక్షింపవలయును. అవసరమని తోచినయెడల ప్రతినిధులు ప్రచ్ఛన్నముగ సమావేశమున కేతెంచ ప్రార్థింపబడుచున్నారు.

నిర్భయముగ నిట్టిప్రకటనము గావించిన కమాలుపాషా సర్వనాశనమునకును తుదకు మరణమునకునుగూడ సంసిద్ధుడై యుండెనని వేరుగ చెప్ప నవసరములేదు. ప్రకటనపై రవుఫ్ బే, రెఫిత్ బే, కాసిమ్ బే, ప్రభృతులు సంతకముచేసిరి.

కమాలుపాషా నడపుచున్న యీ యుద్యమము మిత్రమండలివారికిని, తురుష్కప్రభుత్వమువారికిని చాల యాందోళనము కల్గించెను. కమాలుపాషాను ఉద్యోగము

నుండి తొలగించినట్లు ప్రకటించుచు, దేశీయ వ్యవహారమంత్రి ఈ క్రిందివిధముగ వ్రాసెను:-

"ముస్తఫా కమాలుపాషా యొక సుప్రసిద్ధనాయకుడనుట నిర్వివాదాంశము. ఆతని గాఢ దేశాభిమానమును, దేశోద్ధరణమునకై యాతడు కావించిన తీవ్రకృషియు సుప్రసిద్ధములు. కాని ప్రస్తుత మాతనిచే నడుపబడుచున్న యుద్యమము సమర్థింపరానిది. ప్రస్తుతోద్యోగమునం దాతని యసమర్థత ద్యోతకమైనది. ఇంగ్లీషు హైకమీషనరు అభిప్రాయ ప్రకార మీత డుద్యోగమునుండి తొలగింపబడుచున్నాడు. ఈతడు వ్రాసిన వ్రాతలును, చేసిన చేతలును ఈతని యసమర్థతను బలపరచుచున్నవి. అనాలోచితముగను, శాసనవిరుద్ధముగను, స్థాపింపబడిన కొన్ని సంఘముల కీతడు పంపిన తంత్రీవార్త లీతని రాజకీయస్థాలిత్యము నిను మడింప జేసినవి. ప్రభుత్వమువా రీతని నానటోలియానుండి తిరిగి రావలయునని యాజ్ఞాపించుచున్నారు. ఎవ్వరునుకూడ ఉద్యోగరీతి నీతనితో నెట్టి యుత్తర ప్రత్యుత్తరములను జరుపరాదు. రాజకీయ కార్యములయం దెవ్వరు నీతని కోర్కెల మన్నింపరాదు. చాలసంవత్సరములవరకును మనము బుద్ధిహీనులమై ప్రవర్తించితిమి. నేడు మన (తురుష్క-దేశీయుల) గతి సంధిమావేశమునందు నిర్ణయింపబడనున్నది. మనము వివేకమును, దూరదృష్టిని బూని మన జీవితములను, గౌరవమును, దేశమును రక్షించుకొనవలయును. నాగరక ప్రపంచముచే మరింత హీనముగ చూపబడునట్లు మనము ప్రవర్తింపరాదు"

ఆనాటి తురుష్క-ప్రభుత్వమువారి నిస్పృహతకును, అసమర్థతకును, వేరు దృష్టాంతమనవసరము. విధేయతచే మిత్రమండలివారి యనుగ్రహమును సంపాదించి, దేశ స్వాతంత్ర్యమును రక్షించుకొనుటకై యీ బుద్ధిమంతు లూహగావించిరి. దేశీయ స్వాతంత్ర్య స్థాపనమున కేకైక సాధనము త్యాగమేకాని పాలకులగు విదేశీయుల యనుగ్రహ సంపాదనము కాదని యెరుంగని వీరు రాజనీతికోవిదులో లేక రాజనీతి కోవిదమ్మన్యులో వివేక మహితులగు పాఠకులే యూహించుకొనగలరు.

ప్రభుత్వప్రోత్సాహముచే, శైవాసునందు "కమాలుపాషా భయంకరపురుషుడు, విప్లవకారుడు, విద్రోహి" అని ప్రకటనలుగల కాగితము లెల్లెడల నంటింపబడెను. ఆతనిని తక్షణము నిర్బంధింపవలెనని కాన్‌స్టాంటినోపులునుండి యాజ్ఞలు వెల్వడెను. ౧౯౧౯ వ సంవత్సరము జూన్ నెలయందొకనాటిరాత్రి అమేసియా యను చోటునుండి శైవాసు పట్టణమునకేగ కమాలు నిశ్చయించుకొనెను. తాను బయలుదేరుటకు పూర్వము కొందరు గుఱ్ఱపు రౌతులను శైవాసు రోడ్డునగల 'టోకటు'అను ప్రదేశమునకేగి అచ్చటి తంత్రీ కార్యాలయము నాక్రమించుకొనవలసినదని కమా లాజ్ఞాపించెను. వారట్లే కావించిరి. కమాలుపాషా బయలుదేరి 'టోకట్'ను జేరి తాను శైవాసుపట్టణమున కారుగంటలలో రాదలంచినట్లు తత్పట్టణాధికారికి తంత్రీవార్తను వ్రాసి, ఆసందేశమును తాను బయలుదేరిన తరువాత నారుగంటలకు పంపవలసినదిగా నాజ్ఞాపించి

యటనుండి బయలు వెడలెను. టోకట్ నుండి శైవాసున కారు గంటలలో చేరవచ్చును.

ఒకవంక కమా లతిశీఘ్రముగా శైవాసుపట్టణమువైపు ప్రయాణము సేయుచుండ, నాపట్టణాధికారియు, పోలీసు అధికారియు, కమాల్ పాషా యచ్చటికే తెంచి నప్పుడాతని నెట్లు నిర్బంధింపవలయునని యాలోచనలు సల్పుచుండిరి. "అవకాశము దొరకగానే యాతనినిపట్టి బంధించుట నధర్మము" అని వలీ (పట్టణాధికారి) యనుచుండెను. మహోత్సాహముతో పోలీసు ఉద్యోగి యిందులకంగీక రించెను. కమాలును బంధించి సుల్తాను అనుగ్రహము సంపాదింప నీయధికారి యువ్విళ్ళూరజొచ్చెను. ఇట్లు వీరా లోచనలు సల్పుచుండ కమాలువ్రాసిన తంత్రీవార్త వలీకి ముట్టెను. అందలి సందేశమును చూచుసరికి వలీకి ముచ్చెమటలుపోసెను. దిక్కులు తెలియవయ్యెను. పిల్లిమెడలో గంటకట్టదలచిన ఎలుకలవలె నంతవరకును బీరములు పల్కుచున్న వలీయును, పోలీసు అధికారియు వెనుకకుతగ్గిరి. "నీకు దోచినపద్ధతి నవలంభించి యాతనిని బంధింపుము." అని వలీపల్కెను. కాని పోలీసు అధికారికి ధైర్యముచాల లేదు. "ఈ మర్యాద మరియొక పర్యాయము కావించుట బాగుండునని దోచుచున్నది" అని యాతడు చల్లగ తప్పించుకొనెను. "ఆతనిని బంధింపని పక్షమున మనమందరము నేగి యాతనికి స్వాగతమొసంగుట శ్రేష్ఠము" అని యచ్చట సమావేశమైన పెద్దలెల్లరు నేకకంఠముతో సెలవిచ్చిరి.

కమాలుపాషాకు స్వాగతమొసంగుటకై ప్రయత్నములు కావింపబడెను. ఇంతలో జాతీయనాయకుడు శైవాసును సమీపించి పట్టణము వెలుపల వేచియుండెను. పట్టణ వాస్తవ్యులు స్వాగతముపేర తన్ను చెరపట్టుటకై ప్రయత్నించు చున్నారేమోయని శంకించి కమాలుపాషా తక్షణమే పట్టణములో ప్రవేశించెను. ఇంతలో వలీ కూడ తన మోటారులో కమాలుపాషా కెదురయ్యెను. ఇంకను కొంత కాలము శ్రమతీర్చుకొనవలయునని వలీ విన్నవించుకొనెను. మొదటినుండియు శంకాకులితమనస్కుడైయున్న కమాలీ విలంబనమున కంగీకరింపడయ్యెను. వలీని కూడ తన మోటారులో కూర్చుండుమని కమాలు కోరగా నాతడు వెనుదీసి ఏవియో యుపపత్తుల జెప్పజూచెను. ఆలస్యమును సహింపక, "తక్షణమే మోటారునెక్కు"మని కమాలాజ్ఞాపించు సరికి ఏమియు చేయజాలక విన్నబోయి వలీ కమాలు ననుసరించెను.

విద్రోహియని ప్రకటింపబడిన జాతీయనాయకుడును, తమవలీయును ఒకే మోటారులో గూర్చుండివచ్చుట జూచి ప్రజలెల్లరును జయజయధ్వానములు గావించిరి. కాని కమాలీ స్వాగతమునుగాంచి ఉబ్బితబ్బిబ్బుకాలేదు. సందర్భములు తమకు చాల ప్రతికూలముగనున్నవనియు, కాన్స్టాంటినోపులు నగరమునందును, ఇతర ప్రదేశములందును కూడ తమ ప్రయత్నముల కపార్థములు కల్పింపబడుచున్నవనియు, తనపక్షమున జేరదలచినవారు రానున్నకష్టపరంపరలకు సిద్ధపడియుండ వలయుననియు,

అట్లు కష్టముల నెదుర్కొ_న ధైర్యములేనివారు, తరువాత ఉద్యమమును వీడిపోవుటకు మారుగ యుద్యమమును చేరకుండుటయే యుత్తమమనియు కమాలుపాషా యచ్చట సమావేశమైన ప్రజలకు ఖండితముగ చెప్పెను. అంతటివరకును వారు తురుష్క_ ప్రభుత్వము వారి సైనికులుగ పరిగణింపబడిరి. కాని ముందట్లు పరిగణింపబడుటకు తమ కవకాశముండదనియు కమాలు విస్పష్టముగ చెప్పివైచెను. "ముందు మనము బహిరంగప్రదేశములకును, రచ్చచావిళ్ళకునుపోయి జాతీయస్వత్వములగూర్చి ప్రజలలో ప్రచారముసల్పి వారందరును హృదయపూర్వకముగ మనపక్షమవలంబించునట్లు చేయవలెను. ఈ యుద్యమముతో సంబంధము కల్గించుకొనిన నాకు ఉద్యమము నశించిన పక్షమున దారుణమగు దుస్థితి సంభవింపగలదనుట నిశ్చయము. నాతోకలసి బహిరంగముగ జాతీయోద్యమమునందు పాల్గొనుటవలన మీరుకూడ నిట్టి దుస్థితినే కోరికోరి తెచ్చిపెట్టుకొనిన వారగుదురు. అదియునుగాక, ఇట్టిమహోద్యమమును జయప్రదముగ నడుపుటకు నేను సమర్థుడనో కానో నిశ్చయముకాలేదు." అని కమా లుపన్యసించెను.

ఈవిధముగ నాతడు ఖండితముగ నుపన్యసించిన తరువాత కొందరు మెల్లగా యుద్యమమునుండి వెనుకకు జారిరి. తాను పేరునకు సుల్తానుపై తిరుగబడినను తన్ననుసరించు వారెల్లరును, సేనానాయకుడుగనున్నప్పుడు తనయాజ్ఞల నెట్లుపాలించిరో నాడు సైతమట్లే తనయాజ్ఞల శిరసావహింపవలెననియు, అట్టి క్రమశిక్షయే యుద్యమము

జయప్రదమగుటకు సాధనమనియు, కమాలుపాషా మిగిలిన వారికి బోధించెను.

౧౯౧౯ వ సంవత్సరము జూలై నెల౧౦వ తేదీని జాతీయసమావేశము కావలయునని యుద్దేశింపబడెను. కాని సకాలమునకు జాతీయ ప్రతినిధులెవ్వరును రాలేరి. కొన్ని ప్రదేశములవారు కమాలుపాషా పంపిన సందేశమును మన్నింపక, ప్రతినిధులనే యెన్నుకొనలేదు. అప్పటికే కమాలుపక్షమువారు తంత్రీమార్గముల నెల్ల తమవశము గావించుకొనినందున, ప్రతిరాష్ట్రపు గవర్నరునకును, కమాలు తక్షణమే ప్రతినిధులనంపవలసిదని వార్తలపైవార్తల నంపజొచ్చెను. అహోరాత్రము లాతనికిని, యనుచరులకును వేరొండు పనియేలేదు. నిద్రాహారములు వారికి లెక్కయే లేకుండెను. ఇట్లు చేయుటలో నెంతమాత్రమును విశేషములేదు. ఏలనన ఒకవంక జాతీయ సమావేశమునకై కమాలు ప్రభృతులు ప్రయత్నించుచుండ తురుష్కప్రభుత్వము వారు జాతీయవాద నాయకుల నెల్లైన పట్టిబంధింపవలెనని కుట్రలు పన్నుచుండిరి. కమాలెట్లును తనయాజ్ఞ మన్నింపడని తెలిసికొని సుల్తానాతనిని సెలవుతీసికొనుమని యాజ్ఞాపింపదలచెను. "అనవసరములగు కార్యములలో జోక్యము కలిగించుకొనక ఆనటోలియాయందే యుండిపొమ్ము." అని సుల్తాను కమాలుకు తంత్రీవార్త నంపెను. ఉద్యోగి తన యాజ్ఞల పాలింపడని యెరింగి ఆతని యిచ్ఛననుసరించి యాజ్ఞల కావింపవలసివచ్చిన యీ రాజనామకుని స్థితి యెంతహాస్యాస్పదమైయుండెనో వేరుగ దెలుపవలెనా!

కాని దేశీయవ్యవహారమంత్రి మాత్రము పెద్దగుఱ్ఱమునే స్వారిచేయుచు దర్పమును చూప బ్రయత్నించెను. "తక్షణమే అనటోలియానుండి మరలిరమ్ము." అని యాతడు తంత్రీవార్త నంపెను. ఆయాజ్ఞ తిరస్కరింపబడెను. మరల నిదియే తంత్రీవార్త కమాలుపాషాకడకు పంపబడెను. ఈపర్యాయము "నేను రాజాలను". అని కమాలు దృఢముగ ప్రత్యుత్తర మొసంగెను. కమాలు పాషాతో మిత్రత్వమువహించిన సేనానాయకులకుకూడ నిట్టి యాజ్ఞలొసంగబడెను. కాని ఒక్కరుకూడ నీయాజ్ఞల పాలించిన పాపమున బోలేదు. వారందరును అధికారములనుండి తొలగింపబడినట్లు ప్రభుత్వము ప్రకటించెను. ఒక బ్రిటీషు పటాలము శైవాసుపట్టణమునకు బంపబడుననియు, ఈపటాలము కమాలు పక్షమువారిచర్యల గనిపెట్టుచుండుననియు ప్రవాదములు బయలుదేరెను. కమాలుతో మిత్రత్వమును పాటించిన సైనికోద్యోగులెల్లరును అధికారములనుండి తొలగింపబడిరి గదా! వారిస్థానమున నియమింపబడిన నూతనోద్యోగులు తమతమ నియమితస్థానములకు బ్రిటీషుసైనికుల సంరక్షణతో నేగవలసి వచ్చెను. తమ యుద్యమమునెడ తురుష్క ప్రభుత్వమువారేగాక మిత్రమండలివారుసైతమును శత్రుత్వమును వహించియుండ ముస్తఫాకమాలును, ఆతని అనుచరులును వేయికండ్లతో జూచుచు, వేయిచెవులతో వినుచు, వేయిచేతులతో పనిచేయవలసి వచ్చెనని వేరుగ నుడువ నక్కరలేదు.

స్థానికాధికారులకెడ తెరపిలేకుండ తంత్రీవార్తలపై

తంత్రీవార్తలగురిపించి ఎట్టకేలకు కమాలు తనకోర్కె- నెరవేర్చుకొనెను. ప్రతిజిల్లానుండియు ముగ్గురు ప్రతినిధు లెన్నుకొనబడిరి. తుట్టతుదకు ౧౯౧౯వ సంవత్సరము జూలై ౨౩వ తేదీని ఎర్జరము పట్టణమునందు ఒక చిన్నస్కూలులో జాతీయమహాసభ సమావేశమయ్యెను. శైవాసునందువలె ఇచ్చట కమాలుపాషాను బంధించుటకై యెట్టియత్నములును జరుగలేదు. ప్రజలందరును జాతీయనాయకులకు హృదయ పూర్వక స్వాగతము నొసంగుటకై నిశ్చయించుకొని తత్ప్రయత్నముల గావించిరి. కమాలుపాషాను ఎర్జరము నివాసులందరును పురబహిర్ద్వారముకడనే యెదుర్కొని చాల నుత్సాహముతో పట్టణములోనికి గొనిపోయిరి. సభకు కమాలుపాషా యధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. సమావేశము పదునేనుదినములవరకు జరిగెను. దేశ పరిస్థితులయందు విప్లవము నెట్లు కొనిరానగునను విషయము చర్చింపబడెను. కార్యక్రమము నిర్ణయింపబడెను. దేశీయుల సమక్షమున నిడుటకై యొక ప్రకటన తయారుచేయబడెను. కాని ఈ తీర్మానములన్నియు రహస్యముగ నుంపబడెను. ఎర్జరము సమావేశపుతీర్మానములుగల పుస్తకము లెవరికడనుండునో వారు మరణశిక్షకు పాత్రులగుదురని ప్రభుత్వమువారు ప్రకటించినను, జాతీయ వాదుల యకుంఠిత కార్యదీక్షవలన నీ తీర్మానములకు చాల ప్రచారము కల్గెను. ఈ సమావేశమువారు జాతీయస్వత్వముల రక్షించుటకు అనటోలియా, రుమేలియా సంరక్షకసమితియను సంఘము నేర్పాటుచేసిరి. ఈ సంఘమే ముందు ముందు స్థాపింప

బడబోవు తురుష్క జాతీయ మహాసభకు పునాదియని చెప్పవచ్చును.

ఎర్జరమునందు జాతీయమహాసభ జరగుచున్న కాలములో కాన్‌స్టాంటినోపులు ప్రభుత్వమువా రూరకుండలేదు. "అనటోలియాయందు దల్లరులు జరగినవి. శాసన విరుద్ధముగ కొన్ని సభలు జరుపబడినవి. వీనికి జాతీయ సమావేశములని పేరొసంగబడెను. ఇట్టి సభల నాపివేయుట ప్రభుత్వోద్యోగుల ధర్మము" అని ప్రధానమంత్రి దామాదు ఫరీదుపాషా ప్రకటించెను. ఈ సందర్భమున కాజిమ్ కారాబేకిర్ పాషాయను సేనానాయకుని కమాలుపాషాను బందీగాగొని ఎర్జరము సభను విచ్ఛిన్నము గావింపవలయునని యాజ్ఞయొసంగబడెను. ఆ యాజ్ఞల నాతడు పాటింపలేదు. సభలు నిరాటంకముగ జరగెను.

సామమార్గమున తురుష్కప్రభుత్వమువారు తమ యుద్యమము సంగీకరింతురేమో యెరుంగదలచి కమాలు, ప్రధానమంత్రి దామాదుఫరీదుపాషాకొక సందేశము నంపెను. ఈ ప్రధానమంత్రి ప్యారిసుసంధిసమావేశమునుండి తిరిగి వచ్చియుండెను. పాశ్చాత్యరాజ్యాంగకోవిదులు తురుష్కము నిచ్చవచ్చిన చొప్పున విభజించి తమలో తాము పంచుకొనుటకై ప్రయత్నించుచుండుట ప్రధానమంత్రి స్వయముగ దెలిసికొనియుండెను. కావున మిత్రమండలివారిని నమ్ముకొనియుండుట యెంత వ్యర్థమో గ్రహించి జాతీయోద్యమము నెడ నీ మంత్రిపుంగవుడు సానుభూతి జూపు

నేమోయని కనూలాశపడెను. ఆతడు ప్రధానమంత్రికి పంపిన సందేశమందలి సారాంశమియ్యది:—

"ప్రభువువారికి క్లైమెన్సోమంత్రి యొసంగిన దీర్ఘమగు ప్రత్యుత్తరము చూచి నేను చాల విచారించితిని. ఈ ప్రత్యుత్తరమును జూచినప్పుడు మీకెంత కష్టము కల్గెనో నే నూహించుకొనగలను. మన సామ్రాజ్యమును ఖండ ఖండములుగ గావించి పంచుకొనుటకు ప్రయత్నములు జరగుచున్నవి. ఇది యెంతయును అవమానకరము. భగవత్కృపవలన మన జాతికి ధైర్యస్థైర్యములుగలవు. యీ విధముగ నురిదీయబడుటకు తురుష్కు లంగీకరింపరు. నానాటికిని పరిస్థితులు మనకు ప్రతికూలముగ పరిణమించుచున్న విషయమును మీరు గ్రహించియేయుందురు. గడచిన తొమ్మిది నెలలయందును తురుష్కప్రభుత్వమువారీ పరిస్థితుల జక్కపరచుటకై యెట్టి ప్రయత్నములును సేయకుండుట వారి యసమర్థతకు తార్కాణము. యీ సందర్భమున తురుష్కమును రక్షింప బూనినయెడల దేశీయుల హృదయ పూర్వక సహాయము మన కావశ్యకము. దేశీయులు తమ యాశయముల నెరవేర్చుకొనజాలుదురు. ప్రభుత్వమువారు బ్రిటీషువారి సహాయముతో నేదో గొప్ప లాభమును పొందజూచుచున్నారు. ఇది వట్టి పొరపాటు. జాతీయ పరిస్థితుల చక్కగ గ్రహించి యందులకు ప్రతీకారము నాలోచించుటకై నిక్కమగు ప్రజాప్రతినిధులుగల యొక జాతీయసమావేశము కావింపుడని జాతీయపక్షమువారు కోరుచున్నారు."

రోగికి పథ్యమువలె తురుష్క ప్రధానమంత్రికీ సందేశము రుచింపదయ్యె. దేశవిమోచనమునకై కమాలు ప్రభృతులు కావించుచున్న ప్రయత్నములయెడ సానుభూతిని జూపుటకై ప్రధానమంత్రి యంగీకరింపలేదు. అందులకు మారుగ శైవాసు సమావేశమును కావింపకుండ కమాలును బెదరించుటకై యూహజేసి యాతడొక పన్నాగమును పన్నెను. ఫరీదుపాషా కమాలునకొసంగిన ప్రత్యుత్తరమందలి సారాంశమియ్యది:—

"యీ నడుమ మేజరుబ్రూనెట్ అను ఫ్రెంచి సైనికోద్యోగి నాకడ కేతెంచెను. జాతీయ వాదులగు మీరందరును శైవాసునగరమున నొక సమావేశము కావించుచున్నట్లెరింగి యాతడు క్రుద్ధుడై, "ముస్తఫాకమాలు ప్రభృతు లెట్టిసభలనైన గావించినయెడల వారము పది దినములలో మేము శైవాసు నాక్రమించి సభల గావించు వారినందరను బంధించెదము." అని నాతో పల్కెను. ఇంటికేగి యాతడేమి యాలోచించెనోగాని మరునాడు నాకడకేతెంచి యిట్లుపల్కెను:—"మిత్రమండలివారికి విరుద్ధముగ నెట్టి యుపన్యాసములను కావింపని పక్షమున నీ జాతీయ వాదులు మరెట్టి తీర్మానములు గావించినను వారి నాటంకపరుపము. కమాలుపాషాను బంధింపవలసినదని కావించిన యాజ్ఞలనుపసంహరింపవలసినదిగ ఫ్రెంచి సేనాపతికి వ్రాయుచున్నాను. తురుష్క ప్రభుత్వమువారినికూడ నీ సమావేశములతో నెట్టి జోక్యమును కలుగజేసికొనవలదని మిమ్ములను కోరుటకై మా యధికారికి వ్రాసితిని." మొదటి

దినమున శైవాసు సమావేశమునుగూర్చి యంత విరుద్ధముగ ప్రసంగించి మరునాడు మరియొక విధముగ ముచ్చటించుట యందలి రహస్యమును బుద్ధిమంతులగు మీ రూహించియే యుందురు. మిత్రమండలివారికి మీ సమావేశములయెడ నెట్టి విరోధ భావమును లేదని నమ్మిక పుట్టించి, అదనుచూచి ఏమరిపాటున నుండగ మిమ్ములనందరను బంధింపవలయునని వీరు ప్రయత్నములు సల్పుచున్నారు. యీ విషయములు రహస్యములు కావున దీని నితరులకు తెలియకుండ కాపాడవలయును. శైవాసునందు మిమ్మందర చెరబట్టుటకై కావింపబడుచున్న రహస్య ప్రయత్నముల గుర్తించి, అప్రమత్తులై అపాయమునుండి మిమ్ముల మీరు కాపాడుకొన వలెనని ప్రార్థన. మీ క్షేమమునుగోరి శైవాసు సమావేశమును మానివేయుడని హెచ్చరించుచున్నాను.”

మిత్రమండలివారు జాతీయోద్యమము నెడ శత్రుత్వమును వహించి, కమాలు ప్రభృతులను బంధింప దలచియుండ వారినందరను తాను రక్షింపబూనినట్లును, తాను జాతీయవాదులకు మిత్రుడైనట్లును నటించుచు, ప్రధానమంత్రి దామాదుఫరీదుపాషా వ్రాసిన యుత్తరము సామాన్యులయెడ ఫలవంతమయ్యెడి దేకాని వివేకవంతుడును, శూరుడునగు కమాలునెడ యీ బెదరింపులు వ్యర్థమయ్యెను. అతడు ప్రధానమంత్రి లేఖయందలి మోసమును గ్రహించెను. దేశక్షేమమునకై ప్రాణములనైన ధారవోయుటకు నిశ్చయించుకొనిన కమాలుపాషా యీపాటి లేఖలకే బెదరునా? కొలది దినములైనతరువాత కమాలుపాషా ఎర్జరమునుండి

శైవాసు సమావేశమున కేగుచుండెను. ఎర్జింగుహాము కనుమకడ కాతని మోటారు వచ్చుసరికి కొందరు పోలీసు ఉద్యోగు లేతెంచి, "యీ కనుమను కుర్దు లాక్రమించినారు. ముందునకు సాగిపోవుట యపాయకరము. సమీపపట్టణమునకు వార్త నంపి సైన్యమును దెప్పించి యీ కనుమనుండి బందిపోటు దొంగలను తరిమివైచెదము. అంతవరకును మీరు ముందునకు సాగిపోరాదు." అని పల్కిరి. కమాలు గమ్యస్థానము శైవాసు పట్టణము. అచ్చట జాతీయమహాసభ జరుగబోవుచున్నది. తానచ్చటికి సకాలమున కేగని పక్షమున జాతీయసమావేశమున కేతెంచిన ప్రతినిధు లెల్లరును పలాయన సూత్రమును పఠింతురు. తుదకు తన యనుచరులుకూడ నిరుత్సాహపడుదురు. ఉద్యమమున కియ్యది ప్రచండాఘాతముగ పరిణమించును. పోలీసువారు చెప్పిన చొప్పున ప్రవర్తించినచో తాను ఎర్జరమునకు తిరిగి పోవలెను. సైన్యము లెప్పు డేతెంచునో, ఎప్పుడు ఎర్జింగుహాము కనుమ నిరపాయమగునో తెలియరాదు. ఒకవేళ నియ్యది తాను శైవాసునకు సకాలమున కేగకుండుటకై శత్రువులు కావించిన మాయోపాయమేమో. ఏది యెట్లైనను మంచిదియేయని నిశ్చయించి, జాగ్రత్తపడుట లెస్సయని చింతించి, ఒకటిరెండు మోటార్లను తన మోటారునకు ముందు పోవలసినదని కమా లాజ్ఞాపించెను. యీ మోటారులలో చిన్న ఫిరంగు లుంపబడెను. కయ్యమునకు కాలు ద్రువ్వవలదనియు, అవసరమని తోచినప్పుడు ఫిరంగుల నుపయోగింపవలసినదనియు, బందిపోటులు మార్గనిరోధము

కావించినచో వారిని నిర్జింపవలసినదనియు వారికి కమాలుపాషా ముదలయొసంగెను. అవసరమగు సంభ్రమమేకాని. కమాలు పక్షము వారికే కనుమలో నెట్టి యుపాయమును సంభవింపలేదు. శైవాసు సమావేశమునకు కమాలు సకాలమున కేగ కుండుటకై పరిధానమంత్రి దామాదుఫరీదుపాషాయే యిట్టి వ్యూహమును కావించెనని వేరుగ చెప్ప నవసరములేదు. కమాలుపాషాకును, జాతీయ పక్షమువారికిని మిత్రుడనని యిదివరలో కమాలుకు వ్రాసిన దీ(ప్రముఖుడేయని చదువరులు జ్ఞప్తియం దుంచుకొనవలయును.

శైవాసుపట్టణమున కమాలుపాషాకు హృదయ పూర్వకమగు స్వాగత మొసంగబడెను. ఎర్జరము సభకు వచ్చినవారికంటె ననేకులు ప్రతినిధు లీ సమావేశమున కేతెంచిరి. జాతీయ మహాసభ కుపోద్ఘాతముగ నీవరకే కొన్ని సభలు జరుపబడెను. కమాలుపాషా ప్రాముఖ్యత నానాటికిని హెచ్చుచుండుట జూచి కొందర సూయా పరవశు లాతడు జాతీయ సమావేశమున కధ్యక్షుడు కారాదని ప్రయత్నములు సల్పిరి. కాని యీ కుతంత్రములెల్ల నిష్ఫలమయ్యెను. ప్రతినిధులెల్లరును కమాలుపాషా నేకగ్రీవ ముగ నధ్యక్షునిగ నెన్నుకొనిరి. ఎర్జరము సమావేశమున గావింపబడిన తీర్మానము లీసభయందు బలపరుపబడెను. జాతీయశక్తుల కేంద్రీకరించి విజాతీయులను అందుముఖ్యముగ గ్రీకులను తురుష్కము నాక్రమించుకొనకుండ ప్రతి ఘటించుటకును, అర్మీనియా రాష్ట్రమును తురుష్కమునుండి విభజించి ప్రత్యేక రాజ్యముగ నొనర్పకుండను తీవ్ర

ప్రయత్నముల నల్పుటకును నిశ్చయింపబడెను. యీ సమావేశమున పాల్గొనిన వారలలో నాత్మవిశ్వాసశూన్యులు కొందరు శల్యసారథ్యము సేయ నారంభించిరి. ఇట్టి వారిలో నొక సభ్యు డీక్రింది యుపన్యాసమును గావించెను:—

"అన్ని జాతులవారును మనకు సంపూర్ణ స్వాతంత్రము నొసంగుటకు సమ్మతించినను, మన కితరుల సహాయము కావలసియే యుండును. మన ప్రభుత్వమునకు నలుబది ఏబదికోట్ల పౌండుల ఋణమున్నది. ఎవ్వరును వేరొకనికీ పెద్ద మొత్తమును బహుమానముగ నొసంగజాలరు. యీ అప్పునంతను మనము తీర్పవలసియుండును. ఇక మన ఆదాయమున్ననో ఋణతీర్మానమునకు కాదు సరికదా దానిపై వడ్డీని తీర్చుటకుకూడ చాలదు. ఇట్టి పరిస్థితులలో మనగతి యెట్లుండునో ఊహించుకొనవచ్చును. మన యార్థికస్థితి స్వాతంత్ర్యస్థాపనమునకు మిక్కిలి యనుకూలముగ నున్నవి. అంతేకాదు సమీప దేశములెల్లను తురుష్కమును తమలో తాము విభజించుకొనవలయునని యత్నించుచున్నవి. వారు కోరినట్లు మనము ప్రవర్తించితీరవలయును. లేనిచో సర్వనాశనము తప్పదు. ధనహీనులమగు మనమేమి సేయ గలము? సైన్యము లేకుండ మన మాత్మరక్షణ మెట్లు కావించుకొననేరుదుము? శత్రువులు వాయువిమానములనుండి యగ్నిగోళములగురిపించుచుండ మన మీదుచ్చుకొనుచు బండ్లలో పోవలయును. వారి జలాంతర్గాములు మనల దునుమాడుచుండ మనము సామాన్యపు టోడలను సైతము నిర్మించుకొనజాలకున్నారము. మనము స్వాతంత్ర్యమును

స్థాపించినను, అనతికాలములో శత్రువులు దానిని భగ్న మొనర్తురు. "సంరక్షకత్వమనిన బెదరకుడు. అంతర్జాతీయ సమితి వారి ప్రాథమికసిద్ధాంతములయం దీపద్ధతి సూచింప బడినది." అని కాన్‌స్టాంటినోపులు నగరమందలి యమెరికా ప్రతినిధులు పల్కుచున్నారు. ఇంగ్లీషువారు మనకు బద్ధవైరులనియు, అమెరికావారంతటి శత్రులుకారనియు నా నమ్మకము. మీ రంగీకరించినచో కాన్‌స్టాంటి నోపులునందలి యమెరికా ప్రతినిధికి వ్రాసి యిచ్చుటనుండి రాయబారులను గొనిపోవుటకు యుద్ధనౌకను పంపవలసినదని వ్రాయుదము."

ఆకాలమున తురుష్కము నమెరికావారి సంరక్షకత్వ ములో నుంపవలయునని కొందరు జాతీయవాద తురుష్కులే తలంచిరని పైవాక్యములవలన తెల్లమగుచున్నది. ఈ విషయమునుగూర్చి వ్రాతకోతలుకూడ జరగెను. అమెరికా ప్రతినిధులకీ మహజరు పంపబడెనోలేదో కూడ తెలియరా కున్నది. ముస్తఫాకమాలుపాషామాత్రము సంరక్షకత్వము నెడ ప్రథమమునుండియు విముఖత వహించినట్లు తెలియుచున్నది.

ఈ సమావేశమువారు తాము కావించిన తీర్మానముల నాచరణయం దిడుటకై యొక స్థాయిసంఘమును నెలకొల్పిరి. ఈ సంఘమునకు కమాలుపాషా యధ్యక్షుడుగను, రవుఫ్ బే, బేకిర్ సామిబే యను సుప్రసిద్ధ తురుష్కనాయకులు సభ్యులుగను ఎన్నుకొనబడిరి. శైవాసుసమావేశమున నిర్ణయింపబడిన కార్యవిధానమును దేశమందు ప్రచారము కావించి, తురుష్కమహాజనులు జాతీయపక్షమువారికె

సంపూర్ణ సహాయము నొసంగునట్లు కావించుటయే యీ స్థాయిసంఘమువారి కర్తవ్యము.

శైవాసుపట్టణమున జాతీయసమావేశము జరుగుచున్న కాలమున కాన్‌స్టాంటినోపులు ప్రభుత్వము ష్వారూరకుండలేదు. ఎర్జింగుహాము కనుమవద్ద కమాలుపాషా నాపుటకై ప్రయత్నములు కావింపబడెను. కాని అయ్యవి నిష్ఫలమైనట్లీవరకే తెలుపబడియున్నది. స్వార్థపరులును, దేశద్రోహులు నన్ని దేశములను కలరు. ఆ కాలమున "ఎల్ అజీజ్" అను జిల్లాకు అధికారియగు అలీగలీబ్ బే యను నుద్యోగి యిట్టివారిలో ప్రథమస్థానము నలంకరింప నర్హుడు. యీతడు జాతీయోద్యమమునకు బద్ధశత్రుడును, ప్రభుత్వమువారికి నమ్మిన బంటునైయుండెను. శైవాసునందు జరుగబోవు జాతీయమహాసభ నాటంకపరుచుటకై తగు సైన్యముతో నచ్చటికేగి, కమాలుపాషా ప్రభృతులను నిర్బంధింపవలసిదని యాతనికి తురుష్కప్రభుత్వమువారి యాంతరంగిక శాఖామంత్రి తంతియొసంగెను. ఆ తంత్రీ సమాచారమందలి వివరములు దిగువ నొసంగబడుచున్నవి:-

"కొందరు తురుష్కులు ఎర్జరమునందు సమావేశమై తమ సభను జాతీయసమావేశమని ప్రకటించిన విషయమును మీరెంగియేయుందురు. వారు కొన్ని తీర్మానములకూడ కావించిరట. వారికిగాని వారి తీర్మానములకుగాని యెట్టి ప్రాముఖ్యతయును లేవు. ఐనను యీ సభలనుగూర్చి కొన్ని యతిశయోక్తులు యీ దేశమందు వ్యాపించుటయేగాక యూరోపుఖండమునకుగూడ ప్రాకుచున్నవి. ఇందువలన,

మన కెంతయో కష్టముగలదు. కావింపబడిన సభల కెట్టి ప్రాముఖ్యతయు లేకున్నను, ఎట్టి సైన్యములును జాతీయ వాదులచే ప్రోగుచేయబడకపోయినను, అతిశయోక్తులతో గూడిన ప్రచారముల నమ్మి యులికిపడి బ్రిటీషువా రనతి కాలములో బలవత్తరమగు సైన్యముతో సామ్రాన్ సమీపమున దిగుటకై ప్రయత్నించుచున్నారని తెలియ వచ్చుచున్నది. గవర్నమెంటువారి యాజ్ఞలకు విరుద్ధముగ నెట్టి సభలు కావింపబడినను, యీ సైన్యములు శైవాసు పట్టణముదిక్కున చొరచుకొనిపోయి తురుష్కమున చాల ప్రాంతముల నాక్రమించుకొందురనుట యసంభవముకాదు. ఇట్టి యాక్రమణము మన దేశమున కెంతయో నష్టదాయకము. ఎర్జరము పట్టణమున సమావేశములు కావించినవారితో మేము జరపిన యుత్తర ప్రత్యుత్తరముల వలన వారు శైవాసునందు మరియొక సమావేశము గావింప దలంచుచున్నట్లు తెలియవచ్చుచున్నది. ఏ పదిఅయిదుగురో కూడి సభలు గావించినను అందువలన నెట్టి ఫలితము నుండదని ప్రభుత్వమువారు బాగుగ నెరుంగుదురు. కాని యూరోపుఖండమువారికీ విషయము న చ్చ జె ప్పు ట యసంభవము. కావున నీసభలు కాకుండ జేయుటయే శ్రేష్ఠము. శైవాసునగరమున ప్రభుత్వమువారికి విశ్వాస పాత్రుడును, వారి యాజ్ఞల నతిశ్రద్ధతో పాలించువాడునగు నొక యుద్యోగి కావలయును. ప్రభుత్వమువారు మిమ్మా యుద్యోగమున నియమించుచున్నారు. స్వల్పసంఖ్యాకులగు వీరి (జాతీయవాదుల) నెట్టి సభల గావింపకుండ మీరు

నిరోధింపజాలుదురని నేను నమ్ముచున్నాను. ప్రభుత్వోద్యోగులందరును, ప్రజలలో కొందరును, వీరి (విప్లవకారుల) పక్షమవలంబించియున్నారనియు, ప్రభుత్వమువారి యుద్దేశ్యములను భంగపరచుటకై వీరు యత్నములు కావించుచున్నట్లును మాకు దెలియవచ్చినది. కావున ప్రభుత్వమువారి యాజ్ఞల నిర్వహించుటకై, విశ్వాసపాత్రులగు రెండువందల సైనికుల సహాయ్యము మీ కావశ్యకము. మీ జిల్లాయందలి కుర్దులలో ౧౫౦ మంది గుఱ్ఱపు సవారుల ప్రోగుచేసుకొని శైవాసుపట్టణమును ప్రవేశించి, జిల్లా యధికారి, సైన్యాధిపతుల యధికారముల గైకొని స్థానికరక్షకభట సైన్యసహాయముతో అల్లరుల నణచివేయగలరని యూహించుచున్నాను. ఈ సమావేశము కాకుండ మీరు చేయవలయును. సభలయందు పాల్గొనినవారిని నిర్బంధించి రక్షకభట సహాయముతో కాన్‌స్టాంటినోపులు నగరమునకు బంపివేయవలయును. ఈ విధమున ప్రభుత్వప్రతిష్ఠ పునరుద్ధరింపబడినచో ఆనటోలియా ప్రాంతమందలి యీ సాహసుల యుద్రేకము చల్లారును. ఇందువలన విదేశములలోగూడ మన ప్రతిష్ఠ హెచ్చును. అప్పుడు మనకు విదేశీయుల యాక్రమణమును ప్రతిఘటించుటకు తగు కారణము దొరకును. శైవాసునగరమందలి పౌరప్రముఖులతో సంప్రతించితిమి. వారందరును, యీ కుట్రదారుల చర్యలయెడ విముఖతయు, జాతీయోద్యమమునకు విరాళములనుపేర వీరు రాబట్టుచున్న పన్నుల నొసంగుటకు తీవ్రమగు నసిష్టతయు చూపుచున్నారని మాకు విశ్వాసయోగ్యములగు

సమాచారములు తెలుపుచున్నవి. తమకు చేతనైనంతవరకు ప్రభుత్వమునకు సాయపడుటకు వీ రంగీకరించియున్నారు. మనకు కావలసినందరు సైనికులీజిల్లాయందే దొరకుదురనియు, పలుకుబడిగల పౌరు లనేకులు ప్రభుత్వమునకు తోడ్పడుదు రనియు మాకు తెలియవచ్చినది. తగినంత మంది సైనికుల సమకూర్చుకొని, కార్యసిద్ధి నిశ్చయమని మీకు దోచిన పక్షమున గుఱ్ఱపు సవారులకు వారిజీతములిచ్చివేసి యిండ్లకు పంపివేయవలెను. మీరీయాజ్ఞలనెల్ల సక్రమముగ నెరవేర్ప వలెను. కార్యము సానుకూలమగుటకు మీ చర్యలు రహస్యముగ నుండుట యత్యంతావశ్యకము. యీవిషయముల గూర్చి మీరెవ్వరితోడను, తుదకు సమీపబంధువులతో గూడ ప్రసంగింపరాదు. శైవాసుపట్టణము చేరువరకును, మీ సైనికులకు గూడ మీయుద్దేశ్యము తెలుపరాదు. ప్రస్తుతము మీకుటుంబమును "ఎల్ అజీజ్" పట్టణమున దిగవిడచి జిల్లాయందు పదిదినములు పర్యటనమొనర్చి వచ్చెదనని తెలిపి బయలుదేరవలయును. తక్షణమే బయలు దేరి శత్రువులకు దెలియకుండ మీరు శైవాసుపట్టణమును చేరవలయును. అచ్చటి కార్యము సిద్ధింపగనే స్వయముగ మంత్రివర్గమువారికీవిషయమును తంతీవార్తద్వారా తెలుప వలయును. ఆపైన మరికొన్ని యాజ్ఞ లొసంగబడును. ప్రస్తుతపు శైవాసుపట్టణాధికారికి తానుద్యోగమునుండి తొలగింపబడినట్లుగ నేవిధముగనో తెలిసినట్లున్నది. పునర్విచారణకై యాతడు యత్నములు సల్పుచున్నాడు."

పిల్లి కండ్లుమూసికొని పాలుత్రాగుచు, తన్నెవ్వరును

చూచుటలేదని తలంచినట్లు తురుష్కమంత్రి అలీగలీబ్ బే కు తాను పంపుచున్న తంత్రీవార్త రహస్యముగ నున్నదని తలంచెను. కాని యాతనియూహ తారుమారయ్యెను. తంతీశాఖోద్యోగులయందు సైతము కొందరు జాతీయ పక్షావలంబులుండిరి. ఈ విషయమును వారు కమాలుపాషాకు తెలియజేయ నాతడు మహోగ్రుడై టెలిఫోనుయంత్రము కడకు స్వయముగనేగి ఆంతరంగిక శాఖామంత్రితో నీవిధముగ పల్కెను, "మీరందరును పిరికిపందలు, దుర్మార్గులు. కానిచో ప్రజలుతమ రాజుతో తమకష్టనిష్ఠురముల మొరపెట్టుకొనుచుండ మీ రేల యాటంకపరుపవలయును. మీరెల్ల దేశద్రోహులై విదేశీయులగూడి తురుష్కమును నాశనముగావింప నెంచుచున్నారు. కాని తురుష్కజాతి మీరుతలంచినంత తేజోవిహీనముకాలేదు. మీరుకావించుచున్న దుష్కార్యములగూర్చి లెస్సగ యోచింపుడు. నేడు కాకున్న రేపైన యీదేశము తన గమ్యస్థానమును చేరగలదు. ఆనాడు మీదుష్కార్యములు విమర్శింపబడి శిక్షాభాజనములగును. ఇది ముమ్మాటికిని నిశ్చయము." ప్రభుత్వపక్షపాతియగు అలీగలీబ్ బే మాత్రము మంత్రివర్గమువారియాజ్ఞల నెరవేర్చుటయందెట్టి లోపమును చేయలేదు. కొన్నివందలమంది సైనికులను సమకూర్చుకొని యాతడు శైవాసుపట్టణాభిముఖుడై మహాడంబరముతో బయలుదేరెను. యీసైన్యము నెదిరించుటకై కమాలుపాషా జాతీయవాద సైన్యమునంపెను. గలీబ్ బేయనుచరులు జాతీయ పక్షమువారిచే ననాయాసముగ నోడింపబడిరి. మార్గాంతరము గానక గలీబ్ బే పలాయనసూత్రము పఠించెను.

---

# ఆరవప్రకరణము



## తురుష్క జాతీయసమాఖ్య

---

జాతీయపక్షమువారికిగల బలము ప్రజల యాను కూల్యత. అందువలన కమాలుపాషా ప్రజాభిప్రాయము ననుసరించి మెలగజొచ్చెను. ఆనాటి తురుష్కులయందు రాజభక్తి మెండుగనుండెను. సుల్తాను దుర్బలుడును, అసమర్థుడు నైనందున దేశక్షేమమును పురస్కరించుకొని యాతనిని పదభ్రష్టుని కావింపవలసియుండునని కమాలు ప్రథమమునుండియు నిశ్చయించుకొనియే యుండెను. కాని తన నిశ్చయమును బహిరంగపరచుట యప్పటి పరిస్థితుల యందు జాతీయోద్యమోద్దేశ్యములకు భంగకరమని గ్రహించి, తనకు సుల్తానునందును, ఆతని సదుద్దేశ్యము లందును సంపూర్ణవిశ్వాసమున్నట్లును, ఆనాడు తురుష్క మునకు సంభవించిన కష్టములకును, హీనస్థితికిని కారకులు మంత్రివర్గమే యైనట్లును, మంత్రివర్గమువారు దేశక్షేమమునకు విరుద్ధముగ ప్రవర్తించుచున్నారని సుల్తా నెరుంగనట్లును యీ విషయ మాతని మోప్రిలనిడినయెడల తక్షణమే యాతడు ప్రజల కనిష్టులగు మంత్రుల దొలగించి వారి స్థానమున ప్రజానుకూలమగు పరిపాలనను స్థాపించుననియు, తన యభిప్రాయముగ కమాలుపాషా ప్రకటించెను. తదను గుణముగ శైవాసు సమావేశానంతర మాతడు సుల్తానున కీవిధముగ తంత్రీవార్త నంపెను:—

“యీ క్రిందివిషయముల తమ మ్రోల విన్నవించుకొనుట మాధర్మమని తలంచుచున్నారము. [శైవాసు] కాంగ్రెసుపై హఠాత్తుగ దాడి సలిపి నిరపరాధులగు మహ్మదీయుల రక్తమును కండ్లజూచుటకై ప్రభుత్వమువారు కుట్రలు పన్నినారు. వీరు కుర్దిస్థానపు ప్రజలను రేకొట్టి వారిచే విప్లవము కావింపజేసి తురుష్క సామ్రాజ్యమునుండి కొంతభాగమును విడదీయుటకై ప్రయత్నించి, యిందులకై ప్రజలసొమ్మునే వెచ్చించి చూపుటకు మావద్ద లిఖితపూర్వకములగు నిదర్శనములు గలవు. ఇట్టి దేశద్రోహకరములగు కార్యములగావింప బ్రయత్నించి విఫలమనోరథులై మంత్రి వర్గము వారి యనుచరులు ఫరారియైరి. వారిని పట్టుకొని న్యాయశాస్త్రానుసారము శిక్షింపబడుటకై మీవద్దకు పంపగలము. ఇట్టి ఘోరకృత్యముల గావింప నుద్యమించిన మంత్రివర్గముపై ప్రజల కించుకయును నమ్మకము లేదు. ద్రోహులగు వారిని నిర్బంధించుటకై తక్షణమే ఏర్పాట్లు కావింపబడవలయు, ననియు, వారిని కఠినములగు శిక్షలకు పాల్జేయవలయుననియు ప్రస్తుతమంత్రివర్గమును తొలగించి వారిస్థానమున నీతివంతులగువారిని మంత్రులుగ నియమింపవలయుననియు తురుష్క మహాజనులు కోరుచున్నారు. నేటినుండియు ప్రస్తుత ప్రభుత్వమువారితో నెవ్వరును, ఎట్టి సంబంధము నుంచుకొనరాదనియు, వారితో నెట్టి యుత్తర ప్రత్యుత్తరములను జరుపరాదనియు, తురుష్కజాతివారు కోరుచున్నారు.”

ఇంతటితో నూరకుండక సైన్యాధిపతుల సందరశావించి

కమాలుపాషా వారి నీవిధముగ పరిధానమంత్రికి తంత్రీవార్త నంపవలసినదని ప్రోత్సహించెను:—

“మేము మాయేలికయగు సుల్తాను సమక్షమున నతిముఖ్యమును, అత్యవసరమునగు నొక విజ్ఞాపనము కావించుకొనదలంచియున్నారము. అట్లు కావించుకొనుట యందు మీరు మాకెట్టి యవరోధమును కల్గింపవలదని ప్రార్థించుచున్నారము. మా ప్రార్థనను పెడచెవినిబెట్టి సుల్తానుకడ మేము విజ్ఞాపనము కావించుకొనుటకు మీ రభ్యంతరము కల్పించినచో అందువలన సంభవించు ఫలితములకు మీరే బాధ్యులుకాగలరు.”

తురుష్కమునకు సంభవించిన యాపదలకన్నిటికిని నాటి మంత్రివర్గమువారే మూలకారణమనియు, వారిని పదభ్రష్టులగావించి జనానుకూలురగు మంత్రుల నియమించుకొని వారి సలహాపరికారము వర్తించిన యెడల సామ్రాజ్యమునకు క్షేమము చేకూరుననియు ఈ సైన్యాధిపతులు సుల్తానుతో మనవిచేసికొనదలంచిరి. ఈ ప్రయత్నమున కెట్టి యభ్యంతరములును కల్పింపవలదని వారు మంత్రివర్గమువారిని కోరుచున్నారు. పై తంత్రీవార్తయందలి సారాంశమదియే.

యీ తంత్రీవార్త ప్రధానమంత్రి కనేక పర్యాయములు పంపబడెను. యీ సందేశము నాతడు సుల్తానున కంపవలసినవాడయ్యు నట్లుచేయడయ్యెను. ఈ యసాధారణ విజ్ఞాపనమునుగాంచి యాతడు కింకర్తవ్యతామూఢుడయి యుండవచ్చును. తానంపిన తంత్రీవార్తకు ప్రధానమంత్రి

యెట్టి ప్రత్యుత్తరము నొసంగనందున కమాలుపాషా క్రుద్ధుడై యాతనికి స్వయముగ నీవర్తమానమంపెను, "తురుష్కజాతికి మీయందును, మీమంత్రివర్గమునందును విశ్వాసమీషణ్మాత్ర మును లేదు. ప్రజలకు సుల్తానునందు మాత్రమే నమ్మిక యున్నది. కావున దేశనిజస్థితిని దెల్పుచు నాయనకు మాత్రమే తురుష్కప్రజలు తమ కోర్కెల వెల్లడింతురు. మీ మంత్రివర్గమువారు తాము కావించిన అన్యాయకృత్య ముల ఫలితములకు వెరచి, పాదుషాకును ప్రజలకు నెట్టి సంబంధమును లేకుండ జేయుటకై యత్నించుచున్నారు. ముందుకూడ మీరీ పద్ధతినే యవలంబించిన పక్షమున ప్రజలు తమకిచ్చువచ్చినచొప్పున ప్రవర్తించుట కవకాశ మొసంగబడినట్లు నిశ్చయించి, మీతోడను శాసన విరుద్ధమగు మీమంత్రివర్గముతోడను, సంబంధముల పూర్తిగ విడనాడుదురు. ఇదియే మీకు కడసారి హెచ్చరికయని మీరు తెలిసికొనవలయును."

కాన్‌స్టాంటినోపులు నగరమునందలి తంతీశాఖాధికారి ఈసందేశమును ప్రధానమంత్రికి పంపుటకు నిరాకరించెను. యీ విషయమెరింగి తక్షణమే తన సందేశమును ప్రధాన మంత్రికి పంపనిపక్షమున కాన్‌స్టాంటినోపులు నగరమునకు దేశమందలి యితర భాగములతో నెట్టి యుత్తర ప్రత్యుత్తర ములును జరుగకుండునట్లు టెలిగ్రాపుతీగలు ఖండించివేయ బడునని కమాలు తంత్రీశాఖాధికారికి వర్తమానమంపెను. కాని తంత్రీశాఖాధికారి యీవాక్యములకూడ పెడచెవిని బెట్టెను. ప్రధానమంత్రికూడ జాతీయవాదులకెట్టి ప్రత్యుత్తర మొసంగడయ్యెను.

తాను సంగిన గడువు ముగియుటతోడనే కమాలుపాషా శైవాసునందలి జాతీయ సమావేశము తరపున నొక ప్రకటన గావించెను. "ప్రభుత్వమువారు తురుష్క సామ్రాజ్యమును నాశనముచేయు తలంపుతో విదేశీయులతో కుట్రలు పన్నుచున్నారు. యీ విషయమును గ్రహించి తురుష్క ప్రజలు తమకీమంత్రివర్గమునందలి విశ్వాసము జనించినదనియు, వారిని తొలగించి దేశాభిమానులగు మంత్రుల నియమింప వలయుననియు తమ పాదుషాతో విన్నవించుకొన దలంచుచుండ నీమంత్రివర్గమువారు స్వలాభాపేక్షతో ప్రజలు సుల్తానుకడ నెట్టి విజ్ఞాపనమును కావించుకొనకుండ నిరోధించుచున్నారు. ఇట్టికుట్రదారులు సుల్తానునకు మంత్రులుగ నుండుట కనర్హులు. కావున నీమంత్రివర్గము తొలగింపబడి ప్రజానుకూలమగు మంత్రివర్గము స్థాపింపబడువరకును ప్రజలెవ్వరును ప్రభుత్వముతో నెట్టి సంబంధము నుంచుకొనరాదు. దేశమందలి సైనిక రాజకీయోద్యోగులెల్లరు నీ ప్రకటన నాచరణయందిడి ప్రభుత్వ కార్యస్థానమగు కాన్‌స్టాంటినోపులు నగరముతో తంత్రీమూలముగగాని పోస్టుద్వారాకాని ఎట్టి సంబంధమును లేకుండ చేయవలయును. యీ ప్రకటన నాచరణయందిడి నట్లు వారు జాతీయ సమావేశమువారికి తెలుపవలయును." అని యాప్రకటనయందుండెను. యీ ప్రకటన కనుగుణ్యముగ ౧౯౧౯ వ సంవత్సరము సెప్టెంబరు ౧౨ న తేదీనాడు కాన్‌స్టాంటినోపులు నగరముతో ఉత్తర ప్రత్యుత్తరముల కవకాశములన్నియు తొలగింపబడెను. మంత్రివర్గమువారును,

జాతీయపక్షమువారును బహిరంగముగ విరోధము ప్రకటించు కొనుటకు పూర్వము సుల్తాను, రాజకీయ పరిస్థితుల గమనించియో, మరియేకారణమువలననో తురుష్కపార్లమెంటు సభ్యుల యెన్నికలకై ఏర్పాట్లు కావింపవలయునని యాజ్ఞాపించెను. కాని మంత్రివర్గమువారీయాజ్ఞను పాలింపరైరి. మంత్రివర్గమువారిచర్య కమాలు వాదములకు మరింత బలమొసంగెను. వారికి దేశద్రోహకరములగు నభిప్రాయములు లేనిచో ఎన్నికల నేల జరుపరని కమాలు ప్రశ్నింపజొచ్చెను. ప్రధానమంత్రి దామాదు ఫరీదు పాషా మిత్రమండలివారితో కుట్రలు పన్నుచున్నాడనియు, గ్రీకులచే నాక్రమింపబడిన ప్రదేశములను వారి కొసంగుటకుకూడ నాతడు వెనుదీయడనియు కమాలు ప్రకటించెను. మంత్రివర్గమువారి కుట్రలకు ప్రత్యస్త్రముగ అనటోలియాయందు జాతీయ ప్రతినిధులతోగూడిన సమావేశము నేర్పాటుచేయవలయునని నిశ్చయించుకొని, కమాలు తన యనుచరులందరకు నీయుద్దేశ్యము నెరిగించెను.

ముస్తఫాకమాలుగావించిన ప్రకటన లతిముఖ్యములని పాఠకులు గ్రహించియేయుందురు. ప్రస్తుత మంత్రివర్గమునందు తురుష్కప్రజల కవిశ్వాసము జనించినందున వారిని పదభ్రష్టుల కావింపవలయుననియు, ప్రజలా మంత్రివర్గముతో నెట్టి సంబంధము నుంచుకొనరాదనియు, ప్రకటించుటయే కాక క్రొత్త ఎన్నికలకై మంత్రివర్గమువా రేర్పాట్లు కావింపనందున వానినికూడ తానే జరుపుటకై కమాలు నిశ్చయించెను. అనగా ఆనాటి ప్రభుత్వమును సంపూర్ణముగ

తిరస్కరించి తన పక్షమునే యాతడు ప్రభుత్వముగ నెన్నుకొనెను. న్యాయసమ్మతమగు నొక ప్రభుత్వ ముండగనే వేరొక ప్రభుత్వమును దానికి పోటీగ స్థాపించెను. ఈ నూతన ప్రభుత్వమున కేకైకనాయకుడగు కమాలు పాషాకు సుల్తానునందుకూడ ఎట్టి గౌరవమును లేదు. కాని యానాటి రాజకీయ పరిస్థితుల గ్రహించి, "మన కోర్కెలను ప్రభువగు సుల్తానుకడ విన్నవించుకొనుట కవకాశము కల్గి, సక్రమమగు మంత్రివర్గము స్థాపింపబడువరకును, తురుష్క రాజ్యాంగ శాసనము ప్రకారము సుల్తానువారిపేర మనమే రాజ్య తంత్రమును నడుపవలయును." అని కమాలు ప్రకటించెను.

ఈ విధముగ దేశమునందు గొప్ప కలవరము సంభవించినతర్వాత తురుష్కమంత్రులును, సుల్తానును మేల్కాంచిరి. మంత్రివర్గమువారి ప్రోత్సాహముపై సుల్తానీ క్రింది సందేశమును ప్రజల కంపెను:-

"ప్రభుత్వమువారి కృషివలన స్మర్నాయందు కావింపబడిన ఘోర కృత్యములు నాగరక ప్రపంచము దృష్టి నాకర్షించినది. యీ విషయములనుగూర్చి నిష్పాక్షికముగ నాలోచించుటకై యొక విచారణ సంఘము నెలకొల్పబడినది. ప్రపంచమందలి యన్ని జాతులవారును మన హక్కుల నంగీకరించుటకు సంసిద్ధులైయున్నారు. మన సామ్రాజ్యమును విభజించుటకై ఎవ్వరు నెట్టి ప్రయత్నముల గావించుటలేదు. (పరిస్థితు లీవిధముగ సంతృప్తికరముగనుండ) కొందరు ప్రజలకును, ప్రభుత్వమునకును నడుమ తీవ్రమగు నభిప్రాయ భేదమున్నట్లు ప్రకటించుచున్నారు. ఇట్టి పరిస్థితులలో క్రొత్త

ఎన్నికల నేర్పాటు చేయుట యసంభవము. కావున నా ప్రజలందరును ప్రభుత్వమువారి యాజ్ఞలను శిరసావహించి ప్రవర్తించెదరని నమ్ముచున్నాను. ఇంగ్లాండు, అమెరికా మొదలగు బలవత్తర ప్రభుత్వములు చూపుచున్న న్యాయైక తత్పరత యతిశీఘ్రకాలములో సంధి కావింపబడుననియు, మన జాతీయ గౌరవమున కెట్టి భంగమును వాటిల్లదనియు నమ్మకము కల్గించుచున్నది.” సుల్తాను తన మంత్రుల సలహానే యంగీకరించెననియు, జాతీయపక్షమువారి యాందోళనయు, వారి విజ్ఞాపనలును, యాతని మనస్సున నాటలేదనియు పై ప్రకటనవలన స్పష్టముగ దేలుచున్నది. అయినను కమాలుపాషా యా విషయమును గ్రహింపనట్లు మెలగసాగెను. “మన ప్రభువువారు దయార్ద్రహృదయులు. ఆయన యిప్పటివరకును మన మొరలను వినియుండలేదు. వినినయెడల, దేశద్రోహులగు తన మంత్రుల తక్షణమే పదభ్రష్టుల గావించును” అని యాతడు పలుకసాగెను. కమాలుపాషా చర్యలను, వ్రాతలను ప్రభుత్వపక్షపాతులగు నుద్యోగులు బహిరంగముగ హేళన సేయజొచ్చిరి. అట్టి యుద్యోగులను చెరబట్టుటకు కమా లాజ్ఞయొసంగినందున ప్రభుత్వమువారు జాతీయపక్షమువారి యుద్యోగులను చెరపట్టసాగిరి.

ప్రభుత్వమునకు పోటీగ వేరొక ప్రభుత్వమును స్థాపించి యంతటితో కమాలుపాషా యూరకుండలేదు. సైన్యమునందొక భాగమున కధికారిగ ప్రభుత్వమువా రొకనిని నియమించుటతోడనే యా యుద్యోగి నంగీకరింపక

జాతీయప్రభుత్వము తరపున్న తానొక యుద్యోగిని కమాలుపాషా పంపుచుండెడివాడు. ఇట్లు నియమింపబడిన ప్రభుత్వోద్యోగులకును, జాతీయ ప్రభుత్వోద్యోగులకును నిరంతరము పోరాటములు జరుగసాగెను. మొట్టమొదట ఆంగ్లేయులు తురుష్క ప్రభుత్వముపక్షము నవలంబించిరి. కాని కొంతకాలమైనతర్వాత కమాలుపాషా కావించిన ప్రయత్నములవలన జాతీయోద్యమమందలి యాంతరంగిక విషయములలో తాము జోక్యము కలుగజేసికొనమని యాంగ్లేయులు ప్రకటించిరి. యీ కారణమున జాతీయ వాదుల కించుకబలము చేకూరెను. అనటోలియాయందలి ప్రజలందరును కమాలుపక్షమునువహించిరి. రాజకీయోద్యోగులలో ననేకులు జాతీయపక్షము నవలంబించిరి. తురుష్క ప్రభుత్వమున కేదిక్కునను సహాయమును కానరాదయ్యెను. యీ విషయమును గ్రహించి ప్రధానమంత్రి దామాదుఫరీదుపాషా ౧౯౧౯ అక్టోబరు ౨ వ తేదీని తన పదవికి రాజీనామా యొసంగెను.

దామాదుఫరీదుపాషా ప్రధానమంత్రిత్వమును వదలుకొనినతరువాత అలీరజాబేయను నాతడు ప్రధానమంత్రిగ నియమింపబడెను. ఈతడు సేనానాయకుడుగను, శాసన సభ్యుడుగను కూడ పనిచేసియుండెను. వెనుకటి ప్రధానామాత్యునివలెగాక యీతడు ఉభయపక్షము చూపులకైన జాతీయపక్షమువారితో సానుభూతి చూపసాగెను. అలీరజాపాషా మంత్రిత్వమును స్వీకరించగనే క్రొత్త ఎన్నికల కొరకై ఏర్పాట్లు కావింపబడెను. ఈ ఎన్నికలయందు

జాతీయవాదులే యధికసంఖ్యాకులుగ నెన్నుకొనబడిరి. నూతన మంత్రి యధికారసూత్రముల గ్రహింపగనే కమాలుపాషా యాతనితో యుత్తర ప్రత్యుత్తరముల మొదలిడెను. జాతీయపక్షమువారెట్టి షరతులపై తురుష్క-మంత్రులతో నేకీభవింతురో, నూతనముగ నెన్నుకొనబడిన శాసనసభ్యు లెచ్చట సమావేశము కావలయునో యను విషయములగూర్చి జాతీయవాదనాయకునకు, నూతన ప్రధానమంత్రికిని జరగిన చర్చలు ముందు సవిస్తరముగ తెలుపబడును.

అంగోరాయందు జాతీయవాద కార్యనిర్వాహకవర్గము వారు సమావేశమైరి. ఎర్జరమునందును, శైవాసునందును కావింపబడిన తీర్మానముల క్రోడీకరించి వాని సారాంశమును నొక ముఖ్య రాజకీయ పత్రము తయారుచేయబడెను. ఇందు తురుష్క-జాతీయవాదుల యాశయములును, వారితరజాతుల యెడ నవలంబింపదలచిన రాజనీతియు, మిత్రమండలివారు తురుష్క-ముతో కావింప నూహించుచున్న సంధిని గూర్చి వారి విమర్శనలును, స్పష్టముగ తెలుపబడినవి. ఈ రాజకీయ పత్రము తురుష్కజాతీయ సమాఖ్యయను పేర ప్రసిద్ధి చెందెను. నూతన శాసనసభ్యు లంగోరాయందు సమావేశమై జాతీయ సమాఖ్యను చర్చించి యంగీకరించిరి. తురుష్క-జాతీయ సమాఖ్యయందలి ప్రధానసూత్రములు శ్రీకాళేశ్వరరావుగారి "తురుష్క- ప్రజాస్వామికము" నుండి సంగ్రహింపబడు చున్నవి:-

"ఈ దిగువ చెప్పబడిన సూత్రములను పూర్తిగ

గౌరవించుటవలన ప్రభుత్వముయొక్క స్వాతంత్ర్యమును జాతియొక్క అభివృద్ధిని నిశ్చయముగ పొందవచ్చుననియు, న్యాయమైనట్టియు, శాశ్వతమైనట్టియు శాంతిని పొందుటకు గాను ఇతర జాతులమీది రాజ్యమును త్యజించుటకు సిద్ధపడినారమనియు, ఈ సూత్రములు అమలు జరుగనిచో నిలుకడగల్గిన తురుష్క రాజ్యముగాని, సంఘముగాని నిలచి యుండుట అసాధ్యమనియు, అట్టోమాను ప్రజాప్రతినిధి సభవారు గ్రహించి తీర్మానించుచున్నారు.

౧. సూత్రము:— తురుష్క సామ్రాజ్యములో నరబ్బులు అధిక సంఖ్యాకులుగ కాపురమున్నట్టియు, ౧౯౧౯ వ సంవత్సము అక్టోబరు 30 వ తేదీన జరగిన తాత్కాలిక సంధివలన శత్రుసేనల స్వాధీనములో నున్నట్టియు, ప్రదేశముల భావిస్థితి యక్కడ నివసించెడి ప్రజలు స్వేచ్ఛగ ఓట్లనిచ్చి నిశ్చయించుకొనినప్రకారము ఏర్పాటు కావలసి యున్నది. కావున తాత్కాలికసంధియొక్క గీతలో చేరినను, చేరకపోయినను మతముచేతను, సాంఘిక భావములచేతను ఆదర్శములచేతను, త్యాగమువలన గల్గిన పరస్పర గౌరవము చేతను, పరస్పర సాంఘికమగు హక్కుల గౌరవించుటచేతను ఐక్యమును పొంది అట్టోమాను మహమ్మదీయులచే విశేషముగ నివసింపబడుచున్న ప్రదేశములన్నియు కలిసి అవిభాజ్యమైన స్వతంత్ర తురుష్క ప్రభుత్వముక్రిందనుండి తీరవలెను.

౨ వ సూత్రము:— ఇదివరకు ప్రజల సమ్మతులచేత మాతృదేశములో చేరిన మూడు జిల్లాలలోను అవసరమైనచో మరల ప్రజల సమ్మతుల దీసికొనుట కభ్యంతరము లేదు.

3 వ సూత్రము:— పశ్చిమత్రేసుయొక్క భావిస్థితి కూడ అచ్చటి కాపురస్తులు స్వేచ్ఛగ నిచ్చెడి ఓట్లప్రకారము నిర్ణయించుట కభ్యంతరము లేదు.

౪ వ సూత్రము:— ఖిలాపతునకును, సుల్తానుకును, అట్టోమాను ప్రభుత్వమునకును రాజధానియగు కాన్‌స్టాంటినోపులుయొక్కయు, మర్మరాసముద్రముయొక్కయు సంరక్షణమున కెట్టియుపాయము వాటిల్లకుండ కాపాడుకొనవలెను. ఈసూత్రి మంగీకరింపబడినయెడల బాస్ఫరసు జలసంధిగుండ జరుగు ప్రపంచముయొక్క రాకపోకలగూర్చియు వర్తకమునుగూర్చియు మేమును, ఇతర ప్రభుత్వములవారును కలిసి చేసికొనెడి ఏర్పాట్లు చెల్లగలవు.

౫ వ సూత్రము:—మిత్రమండలివారును, వారి శత్రువులును చేసికొనిన సంధిషరతుల ప్రకారమే మాదేశములోని స్వల్పసంఖ్యాకములగు సంఘముల హక్కుల నన్నిటిని మేము శాశ్వతముగ కాపాడెదమని ప్రతిజ్ఞచేయుచున్నాము. అట్టి హక్కులే మాప్రక్క దేశములలో స్వల్పసంఖ్యాకులుగ నున్న మహమ్మదీయులకును ఇవ్వబడునని విశ్వసించుచున్నాము.

౬ సూత్రము:—మా జాతీయ ఆర్థికాభివృద్ధిని పొందుటకును, పరిపాలనను నవీనపద్ధతులమీద సౌష్ఠవముగ జరుపుటకును మాయిష్టమైన విధానములను అమలు

జరపుటకును, ఇతర దేశములన్నిటివలెనే మాకును సంపూర్ణమగు స్వాతంత్ర్యము, స్వేచ్ఛయుండవలెను.

ఈ కారణముచేత మా దేశములో రాజకీయ, ఆర్థిక, న్యాయవిచారణ మొదలగు విషయములలో నేర్పడిన ప్రత్యేకపు హక్కులను, నిర్బంధములకును మేము వ్యతిరేకులమై యున్నాము.

మేము ఇవ్వవలసినట్లు ఋజువగు ఋణములను చెల్లించు విషయమునకూడ పై సిద్ధాంతమునకు వ్యతిరేకముగ జరుగకూడదు."

ప్రపంచసంగ్రామ మారంభము కాకముందును, ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ, రష్యా మొదలగు బలవత్తర దేశములు తమలో తాము రహస్యముగ సంధులు కావించుకొని తురుష్కమును పంచుకొనవలయునని నిశ్చయించుకొనుట యీ వరకే మనము తెలిసికొనియున్నాము. ఈ నాల్గు దేశములవారేగాక గ్రీకులుకూడ సామ్రాజ్యభావ ప్రేరితులై ఆంగ్ల ప్రధానమంత్రియగు లాయడుజార్జి సహాయమున తురుష్కముపై దండెత్తి త్రేసు, స్మర్నా ప్రాంతముల నాక్రమించిన విషయముకూడ తెలుపబడియే యున్నది. పాశ్చాత్య ఐరోపాజాతులవారు తురుష్కము నేవిధముగ పంచుకొనవలయునను విషయమును సంపూర్ణముగ నిర్ణయింపకపోయినను, తురుష్కమునెడ వారికిగల యభిప్రాయమును తురుష్కజాతీయవాడు లెఱుంగకపోలేదు. పైన ఉదహరింపబడిన జాతులవారు తురుష్కమును ఖండఖండములుగ గావించి పంచుకొనదలంచుచున్నారను

విషయమును మనమునందుంచుకొని, తురుష్కమును విభజించుటకు వీలులేదనియు, జాతిమత విజ్ఞాన చారిత్రిక సంబంధములచే బంధింపబడిన అట్టోమాను తురుష్కులచే నివసింపబడుచున్న భూభాగములన్నియు, తురుష్కుల యధికారమునుండి విడివడరాదని జాతీయవాదులు ప్రథమమున నే స్పష్టముగ దెల్పిరి. ఈవిధముగ వారు తమ జాతీయాశయముల నిర్భయముగ ప్రకటించిరి. తమ రాజ్యమును సంరక్షించుకొనుచు ఇతరజాతుల రాకపోకలు వర్తక సౌకర్యములు మొదలగు విషయములయందు అంతర్జాతీయ నియమములను పాటింతుమని జాతీయ సమాఖ్యయందలి నాల్గవ సూత్రమున వీరు ప్రకటించియున్నారు. తమ జాతీయతను సంకుచితమొనర్పక అంతర్జాతీయ నియమముల కనుకూలముగ గావించిన జాతీయవాదు లెంతయు శ్లాఘా పాత్రులు. తమ స్వాతంత్ర్యమున కెట్టి యవరోధము నుండ రాదనియు, దేశము నెట్లభివృద్ధి కావింపవలెను, ఎట్లు పాలింప వలెను, అను ఆంతరంగిక విషయములయందు తమకు సంపూర్ణమగు స్వేచ్ఛ యుండవలెననియు, అందులకు విరుద్ధముగ విదేశీయులకు తమ దేశములో నొసంగబడు రాజకీయార్థికాది సౌకర్యములు రద్దుపరుపబడవలెనని నిర్ణయించి వీరు తమ స్వాతంత్ర్యమును నిర్నిరోధము గావించుకొనిరి. జాతీయవాదులు నిష్కలంక దేశాభిమానముతోపాటు విశాల దృష్టిని, పర శ్రేయోభిలాషనుకూడ జాతీయసమాఖ్యయందు చూపిరి. సమాఖ్యయందలి రెండవ సూత్రమునం దిదివరలో తమ సమ్మతిప్రకారము తురుష్కములో జేగిన జిల్లాలకుకూడ

స్వయంనిర్ణయాధికార మొసంగుట కంగీకరించుట వారి విశాలదృష్టికి తార్కాణము.

విల్సను మహాశయుని సుప్రసిద్ధ చతుర్దశసూత్రముల యం దొకటియగు స్వయం నిర్ణయ సూత్రమును శిరసావహించి తురుష్కజాతీయవాదు లంతర్జాతీయ శాంతికొక సోపానమును నిర్మించిరనుట యతిశయోక్తి కానేరదు. తమ దేశమందలి స్వల్పసంఖ్యాక సంఘముల తాము రక్షించుచు, తమ ప్రక్కనున్న దేశీయు లీ సూత్రము నవలంబింపవలెననియు, అరబ్బు దేశములకు స్వాతంత్ర్య మొసంగవలయుననియు ప్రకటించుటయందు వీరి జాతీయత విశాలమైనదనియు, విశ్వకల్యాణమే వీరి యాదర్శమనియు తేటతెల్లమగుచున్నది. సమాఖ్యయందలి ముఖ్యతమమగు విషయము జాతీయవాద తురుష్కులు చిరకాలమునుండియు తురుష్కసామ్రాజ్యాంతర్గతములైన యరబ్బు దేశములపై తమకుగల యధికారమును ఎట్టి నిర్బంధమును లేక కేవల న్యాయైకబుద్ధితో వదలుకొనుట యనునది. బలవంతుడు బలహీనుని లోబరచుకొని యధికారమును సాగించుట యనాదినుండియు యంగీకరింపబడుచున్న పశుబలవాదసిద్ధాంతము. ఆ సిద్ధాంతమునకు సామ్రాజ్యవాదమని నామాంతరము. నాగరకతాశిఖరము నధిష్ఠించియుంటిమని విఱ్ఱవీగుచున్న జాతులవారే నేడు పైన పేర్కొనబడిన పశుబలవాద సిద్ధాంతము ననుసరించి స్వల్ప జాతుల మ్రింగివేయుచుండ చిరకాలమునుండి తమకు లోబడియున్న వేరొక దేశమునకు స్వాతంత్ర్యము నొసంగవలెనని వాదించు జాతీయవాద తురుష్కు లత్యంత శ్లాఘా

పాత్రిలని వేరుగ వక్కాణింపవలయునా? తురుష్కజాతీయ వాదులు తమ జాతీయ సమాఖ్యయందు ధర్మేతరమగు సామ్రాజ్యవాదమును విసర్జించి న్యాయసమ్మతమగు జాతీయవాదము నంగీకరించుట వారి మహోన్నతా దర్శములకు నిదర్శనము. ఈ జాతీయసమాఖ్యయే తురుష్క స్వాతంత్ర్యసంగ్రామమునకును, ముందు ముందు తురుష్క జాతీయవాదులు మిత్రమండలివారితో గావించికొనిన సంధికిని పునాదియని చెప్పవచ్చును.

నూతనప్రధానమంత్రి అలీరజాపాషాతో సంధి కావించుకొను తలంపుతో కమాలీతని కీవిధముగ వ్రాసెను:-

"ఎర్జరము, శైవాసు సమావేశములకు ఫలితముగ నేర్పడిన జాతీయసమితిని మంత్రివర్గమువారు సక్రమమైనదిగ అంగీకరించినపక్షమున జాతీయవాదసైన్యములు వారికిసహాయ మొసంగగలవు. తురుష్కప్రజాప్రతినిధిసభ సమావేశమై, సరియైన పరిపాలన యేర్పడువరకును మంత్రివర్గమువారు సంధినిగూర్చి యితరజాతులతో నెట్టి వాగ్దానములును సేయరాదు. సంధిసమావేశమునకు పంపబడు తురుష్క ప్రతినిధులు జాతీయాశయముల చక్కగ నెరింగినవారై యుండవలెను." ఇదే విషయమునుగూర్చి వ్రాయుచు, పూర్వపు మంత్రివర్గమువారి చర్యలవలన దేశీయులు చాల నసంతృప్తులై యున్నారనియు, సాధ్యమగునంతవర కాతనికి (కమాలుపాషాకు) నూతనమంత్రివర్గమువారికి సహాయము గావింప కోర్కెగలదనియు, అయినను నూతన మంత్రి వర్గమందు ఫరీదుపాషా మంత్రివర్గమునందలి కొందరుద్యోగు

లుండుట తన కనుమానకారణముగ నున్నదనియు, నూతన మంత్రులు జాతీయపక్షమువారి షరతుల నంగీకరింతురో లేదో తెలుపవలెననియు, కమాలు ప్రధానమంత్రికి వ్రాసెను. కార్యాంతర నిమగ్నుడగు ప్రధానమంత్రి కమాలుపాషా కెట్టి ప్రత్యుత్తరము నొసంగలేదు. ఇందుల కనుమానమంది జాతీయనాయకుడు తన పక్షమువారికి తొల్లింటివలెనే కాన్‌స్టాంటినోపులు ప్రభుత్వముతో శత్రుత్వమును బాటింపవలయుననియు, పూర్వపు మంత్రివర్గమును బంధించి, విచారణ సల్పి తగు శిక్షలు విధింపవలెనని నూతన మంత్రివర్గమును కోరవలసినదనియు వ్రాసెను. ఇంతేకాక జాతీయపక్షమున కనుకూలురగు కొందరు సేనానాయకు లకారణముగ నుద్యోగములనుండి తొలగింపబడిరనియు, వారినందరను పూర్వపు టుద్యోగములయందు నియమింపవలెననియు, జాతీయోద్యమమునకు ప్రతికూలురగు సేనానాయకుల నధికారమునుండి తొలగింపవలయుననియు, కమాలు యుద్ధశాఖా మంత్రిని కోరెను.

ఈ విధముగ జాతీయవాదులు సందేశములపై సందేశముల నంపుచుండ ప్రధానమంత్రికి మౌనము వహించుట కదను లభింపదయ్యెను. కావున నాతడు కమాలుపాషాకు ప్రత్యుత్తరమొసంగుచు, ఎర్జరము, శైవాసులందు జరిగిన సభలెట్టివియో, అందు కావింపబడిన తీర్మానములెట్టివియో తనకు తెలియదనియు, అచ్చట కావింపబడిన తీర్మానముల దనకు తెలుపవలసినదనియు కోరెను. ప్రధానమంత్రి వ్రాతలయందలి రహస్యమును కమాలు గ్రహింపక

పోలేదు. ప్రపంచమునకంతకును దెలిసిన శైవాసు తీర్మానములు తనకు తెలియలేదనుట, కాలహరణముకొరకు ప్రధానమంత్రి యెత్తిన యెత్తుగాని వేరుకాదని గ్రహించియు, కమాలాతడు (ప్రధానమంత్రి) కోరినప్రకారము శైవాసు తీర్మానముల సవిస్తరముగ తెలియజేసెను. కమాలు పంపిన సందేశముల కతిశీఘ్రకాలములో ప్రధానమంత్రి ప్రత్యుత్తరమొసంగెను:-

"తురుష్కజాతివారు కోరుచున్న ప్రకార మతిశీఘ్రముగ చర్య దీసికొనవలెనను విషయమున మంత్రివర్గము మీతో నేకీభవించుచున్నది. అట్టోమాను సామ్రాజ్యమును, మన స్వాతంత్ర్యమును, ప్రజల సౌఖ్యమును, ఖలీఫా పీఠమును సంరక్షించుకొనుట కొకేమార్గము కలదు. అయ్యది తురుష్కరాజ్యాంగపద్ధతి కనుగుణ్యముగ ప్రవర్తించుటయే. సంధిసమావేశమునందు పాల్గొను తురుష్కప్రతినిధులు విశ్వాసపాత్రులును, జాతీయాశయముల చక్కగ గ్రహించిన వారును అయియుందురు. మన రాజ్యాంగపద్ధతిప్రకారము సమస్త జాతీయ సమస్యాపరిష్కారమునకు తురుష్కజాతియే సమర్థము. ఈ విషయమును గ్రహించి ప్రస్తుత ప్రభుత్వము వారు, తురుష్కప్రజలు తమ యభిప్రాయముల సక్రమ పద్ధతులపై దెల్పుటకై ప్రజాప్రతినిధి సభను సమావేశ పరచుట కేర్పాట్లు సేయుచున్నారు. ప్రస్తుత ప్రభుత్వమువారు తాము శాసనబద్ధులై ప్రవర్తించుచు, తద్విరుద్ధముగ నెట్టి కార్యక్రమమును దేశమందు జరుగకుండ జాగ్రత్త గైకొందురు. అసామాన్యములును, అశాస్త్రీయములునగు పరిస్థితు లేర్పడినచో జాతీయ పక్షమునకును ప్రభుత్వమువారికిని

నిశ్చయముగ స్నేహవిచ్ఛేదము సంభవించును. స్నేహవిచ్ఛేద మనర్థదాయకము. ఇందువలన దేశమందలి చాల భాగములు విదేశీయులచే నాక్రమింపబడుట కవకాశము కల్గును.

కావున ప్రభుత్వమువారు మిమ్ము మీ రాక్రమించిన ప్రభుత్వ మందిరముల తక్షణమే విడచిపోవలసినదనియు, ప్రభుత్వ కార్యస్థానములలోని పనిపాటల కెట్టి యవరోధమును కల్పింపరాదనియు, ప్రభుత్వాధికారమున కెట్టి యవిధేయ తయు చూపరాదనియు, ఇతర దేశీయులతో నెట్టి సంబంధ ములను కల్పించుకొనరాదనియు, ప్రజాప్రతినిధి సభ ఎన్నికలలో ప్రజల కెట్టి నిర్బంధములను కల్పింపక, అయ్యవి స్వేచ్ఛగ జరుగుట కవకాశ మొసంగవలయుననియు కోరుచున్నారు."

ప్రధానమంత్రి యొసంగిన ప్రత్యుత్తరము కమాలుపాషాకు చాల నాశాభంగము కల్గించెను. అలీరజాపాషా జాతీయవాదుల కననుకూలుడు కాడని కమాలు తలంచియుండెను. అట్టి యాతడు తమ్ము తిరస్క రించుచు వ్రాసిన నాశాభంగము కల్గు టాశ్చర్యకరము కాదుకదా! ఎర్జరము, శైవాసు సమావేశములకు ఫలితముగ నేర్పడిన జాతీయసమితిని సక్రమమైనదిగ నంగీకరింపవలెనని కమాలు ప్రధానమంత్రిని కోరెను. ప్రభుత్వము పెడత్రోవల బట్టి పోవుచున్నప్పుడు ప్రజలు సంఘములుగ నేర్పడి తమ యభిప్రాయముల ప్రభుత్వమునకు దెల్పి, ప్రజాభిప్రాయమున కనుకూలముగ వారు ప్రవర్తించునట్లు కావించుటకై ప్రజల

కధికారము కలదనువాదముపై జాతీయోద్యమము నంగీకరింప వలసినదని కమా లభిప్రాయపడెను. ప్రధానమంత్రి యీ వాదము నంగీకరింపక తురుష్క-రాజ్యాంగపద్ధతి (Turkish Constitution) చే నేర్పరుపబడిన మంత్రివర్గమువారి కేగాని యితర సంస్థలకు రాజకీయాధికారములు లేవనియు, అట్టి సంస్థలను ప్రభుత్వము సక్రమమైనవానిగ నంగీరింపజాల దనియు తన ప్రత్యుత్తరమున సూచించెను. అంతియేకాదు, జాతీయవాదుల యునికి దేశమున కనర్థదాయకమనియు, అయ్యది విదేశీయులు తురుష్కముపై దండెత్తుట కవకాశ మొసంగుననియు తొల్లింటి మంత్రివర్గమువారివలెనే వాదించెను. సంధిసమావేశమునకు ప్రతినిధుల నంపు విషయమునగూడ ప్రభుత్వమువారే ప్రతినిధుల యోగ్యతల విమర్శించి తగువారి నంపెదరని ప్రధానమంత్రి తెలిపెను. ఈ విషయమున జాతీయవాదపక్షమువారి యభిప్రాయము గైకొనబడునని యైన యాతడు వాగ్దానము చేసినవాడుకాడు. విదేశీయులతో నెట్టి రాయబారములను నడుపవలదని ప్రధానమంత్రి కమాలుపాషాకువ్రాసియుండెను. విదేశీయులతో దేశానర్థకములగు సంధి గావించుకొనుటకు ప్రభుత్వమువారు సిద్ధపడినను ప్రజలు వారినే నమ్ముకొనియుండవలయును గాని తమ యాశయముల నెరవేర్చుకొనుట కెట్టి ప్రయత్నములును కావింపరాదని ప్రధానమంత్రి యభిప్రాయమైనట్లు స్పష్టమగుచున్నది. సూక్ష్మములో తెలుపవలసినయెడల అలీరజాపాషా రాజ్యాంగతంత్రమును మంత్రివర్గమువారి హస్తములయందిడి జాతీయపక్షము తన్నుతాను రద్దుపరచు

కొనవలయునని కమాల్ పాషాకు తెలియజేసెను.

ప్రధానమంత్రి ప్రత్యుత్తర మాశాభంగకరముగ నున్నను కమా లంతటితో నిరాశుడు కాలేదు. అలీరజాపాషాతో స్వయముగ సంభాషించిన లాభకారి యగునేమోయని తలంచి కమా లందులకే యత్నించెను. అశనిపాతము బోలు సందేశము నంపి ప్రధానమంత్రి కమాలుతో మరెట్టి సంధి సంభాషణకును అంగీరింపడయ్యెను. ఇంకను నిరాశ సందక ప్రధానమంత్రికొక దీర్ఘలేఖ వ్రాయుచు, దేశమం దేర్పడిన యసాధారణ పరిస్థితులకు దామాదుఫరీదుపాషా మంత్రివర్గమే కారణమనియు, వారు ప్రజాభిప్రాయమును సంపూర్ణముగ నిరసించినందుననే జాతీయసమావేశమువారు శాసనవిరుద్ధముగ ప్రవర్తింపవలసి వచ్చెననియు, నూతనమంత్రివర్గమువారు తమకు జాతీయోద్యమము నెడ సుహృద్భావము గలదని స్పష్టముగ ప్రకటించినచో పరిస్థితులు చక్కబడుననియు కమాలు తెలియజేసెను.

జాతీయవాదుల సహాయము లేనియెడల ప్రభుత్వము సాగుటయే దుస్తరముగ కాన్పించినందున మంత్రివర్గమువారు సంధిప్రయత్నములు చేయక తప్పదయ్యెను. ప్రభుత్వమువారు యూనస్ బే యను నాతని రాయబారిగ నియమించిరి. ఈతనికిని జాతీయవాదనాయకుడు కమాలునకును టెలిగ్రాఫు యంత్రముపైననే సంభాషణలు జరిగెను. అలీరజాపాషా ప్రభుత్వము తాత్కాలికమైనదనియు, ఎన్నికల ఫలితము తెలిసినతరువాత స్థిరమగు ప్రభుత్వ మేర్పడుననియు,

అంతవరకును జాతీయవాదులు ప్రభుత్వ కార్య నిర్వహణమున కెట్టి యభ్యంతరములను కల్పింపరాదనియు యూనస్ బే వాదించెను. ఎర్జరము, శైవాసుసమావేశములందు నిర్వచింపబడిన ప్రజాశయముల నంగీకరించుట ప్రభుత్వమువారు సమ్మతి చూపినచో తమకును వారికిని పొత్తు కలుగునని కమాలు తెలియజేసెను. రెండు దినముల తరువాత ప్రభుత్వమువారు కమాలుపాషా కావించిన సూచనలకు తమ సమ్మతి తెల్పుచు, మంత్రివర్గమువారు జాతీయ పక్షమువారి యాశయముల ప్రకారమే వర్తింతురనియు, జాతీయవాదులు ప్రభుత్వమువారికి సర్వవిధముల సహాయము కావింపవలయుననియు కోరిరి.



# ఏడవ ప్రకరణము.



జాతీయసమాఖ్యను తురుష్కపార్లమెంటువా రామోదించుట.



మంత్రివర్గమువారి తంత్రీవార్త కమాలుపాషాకు చాల సంతసము కల్గించెను. తానును, తన పక్షమువారును ప్రభుత్వమువారికి సర్వవిధముల సహాయ మొసంగుదురని యాతడు తెలియజేసెను. సుల్తానునకుకూడ ధన్యవాదము లర్పించెను. గత్యంతరము లేక మంత్రివర్గమువారు జాతీయ వాదులతో సంధి కావించుకొనిరేకాని వారికీ సంధి విషయమున నెట్టి వ్యగ్రతయును లేదు. అనతికాలములో వీరిరువురకు నభిప్రాయభేదములు పొడసూపజొచ్చెను. 'యూనియన్ అండ్ ప్రోగ్రెస్' పార్టీవారికిని, జాతీయ వాదులకును ఎట్టి సంబంధము నుండరాదని ప్రభుత్వమువారు ప్రకటించిరి. కాన్‌స్టాంటినోపులు నందలి పత్రికలు కమాలుపాషాను తీవ్రముగ విమర్శింపజొచ్చెను. కమాలు దంభవ్యాపారియనియు, విప్లవకారుడనియు వీరు ప్రకటింప మొదలిడిరి.

యూరోపునందు సంధిసమావేశములు యథా ప్రకారముగ జరగుచునేయుండెను. తురుష్కమును గూర్చిన సంధిషరతులను మార్చవలసినదని ప్రభుత్వమువారు మిత్రమండలివారికి తెలియజేయరైరి. సంధిసమావేశములందు అమెరికా సంయుక్త రాష్ట్రాధ్యక్షుడగు విల్సను మహాశయుడు పాల్గొని నన్ని న్నాళ్ళును శత్రుపక్షమువారు తమకు న్యాయము జరుగవచ్చునని యాసించుచుండిరి. కాని మహామాయావులగు

ఐరోపారాజ్యతంత్రజ్ఞుల కుటిలనీతిని గని విసువుజెంది యాతడు స్వదేశమునకు మరలిపోయెను. అంతటితో బలహీనులగు వారి యాశ లడుగంటెను. వారిలో తురుష్క-లొక్కరు. అట్టోమాను సామ్రాజ్యమునందలి సిరియా, పాలస్తైన్, ఇరాకు, స్మర్నా, అడానాప్రాంతములు శత్రు హస్తగతమయ్యెను. పరిస్థితు లిట్లు విషమముగనున్నను తాను గావించిన వాగ్దానము ప్రకారము కమాలు మంత్రివర్గము వారికి సహాయము చేయుచునేయుండెను. ప్రభుత్వమువారి యాజ్ఞ ననుసరించి ప్రజాప్రతినిధి సభకు సభ్యుల నెన్నుకొన వలయునని ఆతడు ప్రజలకు బోధించెను కాని జాతీయోద్యమమును మాత్రము కమాలు విడనాడలేదు. వానిచే స్థాపింపబడిన స్థాయిసంఘమును రద్దుపరుపలేదు. ఎన్నికలకై ప్రయత్నములతోబాటు ప్రజాప్రతినిధిసభ యెచ్చట సమావేశము కావలయునను విషయమునుగూర్చిన చర్చలు తీవ్రముగ సాగజొచ్చెను. ఆనటోలియాయందుగాని, ఎర్జరమునందు జాతీయసమావేశము కావింపవలెనని కమాలు వాదించెను.

కాన్స్టాంటినోపులు నగరమున ప్రభుత్వమువారు రహస్యముగ సభలు జరుపజొచ్చిరి. అచ్చట జరగుచున్న తంత్రములన్నియు చారముఖమున కమాలున కెప్పటి కప్పుడు తెలియుచునేయుండెను. అలీరజాపాషాను మంత్రిత్వమునుండి తొలగించి జాతీయపక్షమునకు బద్ధవిరోధియగు సెకేపాషా యను సేనానాయకుని ప్రధానమంత్రిగ నియమింపవలెనని సుల్తాను నూహచేయుచున్నట్లు తెలియవచ్చెను. కమాలు

మాత్రము తొందరపడక ప్రభుత్వమువారితో సంధినే పాటింపజొచ్చెను.

ప్రజాప్రతినిధిసభ కాన్స్టాంటినోపులునందు జరుగుట యెంతమాత్రమును వాంఛనీయము కాదని కమాలు తెలిపెను. రాజధానియందు సభాసమావేశమును జరిపినయెడల ప్రభుత్వమునకును, మిత్రమండలివారి సేనలకును భయపడి ప్రతినిధులు తమ యభిప్రాయములను నిర్భయముగ ప్రకటింప జాలరనియు, ప్రతినిధులలో ననేకుల కుద్యోగులతో వైరముకలదు కావున వారేదో యొక విధముగ కష్టములకు గురియగుట సంభవించునని కమాలువాదము. ఈవిషయమును చర్చించుటకై యాతడు జాతీయపక్షమువారి స్థాయిసంఘమును సమావేశము కావించెను. సంఘమువారు కాన్స్టాంటినోపులు నందు ప్రజాప్రతినిధి సభసమావేశము కారాదనియు, మరియొక ప్రదేశమునందు సభ నేర్పాటు కావింపవలయు ననియు తీర్మానించిరి. ఈ విషయములో ప్రభుత్వమువారికిని, జాతీయవాదులకును ఉత్తర ప్రత్యుత్తరములు జరగెను. ప్రజాప్రతినిధిసభ కాన్స్టాంటినోపులునందే కాని మరెచ్చటను సమావేశము కారాదని ప్రభుత్వము పట్టుపట్టినందునను, శాసనమున కనుగుణముగ తురుష్క-రాజధానియందు సమావేశమైన ప్రజాప్రతినిధిసభచే కావింపబడిన తీర్మానములను మాత్రమే తా మంగీకరింతుమని మిత్రమండలివారు ప్రకటించినందునను, విధి లేక కమాలుపాషా యందుల కంగీకరించెను. కాని తన మిత్రుల కెట్టి యపాయమును కలుగకుండుటకు, వారందరును జట్టుగా కలిసి

రాజధాని కేగవలయుననియు, వారొకరికొకరు సమీపమున నుండి యన్యోన్య సహాయ మొనర్చుకొనుచుండవలెననియు సలహా నొసంగిపంపెను.

ప్రజాప్రతినిధిసభ కాన్‌స్టాంటినోపులు నగరమునందు జరుగరాదని తెల్పుచు కమాలు కావించిన ప్రకటనయందలి భాగము లీ దిగువ నొసంగబడుచున్నవి:-

"కాన్‌స్టాంటినోపులు నగరము మిత్రమండలివారికిని, అందు ముఖ్యముగ నాంగ్లేయులకును సంబంధించిన సేనలచే నాక్రమింపబడియున్నది. సముద్రముపై వారి నౌకాసైన్యము రాజధానిని చుట్టు ముట్టియున్నది. పోలీసులును, పురరక్షక సైన్యమును విదేశీయుల యధికారమునందుండి, మిత్ర ప్రభుత్వముచే పాలింపబడుచున్నారు.

గ్రీకులు నలుబదిమందిని తమ ప్రతినిధులుగ కాన్‌స్టాంటినోపులునందు నిల్పియున్నారు. ఈ గ్రీకులును, ఏథెన్సునుండి యేతెంచిన మరికొందరు గ్రీకు ఉద్యోగులును, ఇచ్చట నొక గుప్తరక్షక భటసంఘమును, సైన్యమును ఏర్పాటు గావించియున్నారు. ఏ నిముషమందైనను వీరు ప్రభుత్వముపై తిరుగుబాటు చేయుటకు సంసిద్ధులు.

దురదృష్టవశమున కాన్‌స్టాంటినోపులు ప్రభుత్వము వారి కెట్టి కార్యక్రమమును నడపుటకును స్వాతంత్ర్యము లేదు. కావుననే ప్రజాప్రతినిధిసభ యెచ్చట సమావేశము కావలయునను విషయమునుగూర్చి యింత తీవ్రముగ చర్చింపవలసివచ్చినది. పార్లమెంటు సమావేశము రాజధాని యందే జరుపవలయునని నిశ్చయింపబడినచో, ప్రతినిధుల

నెదుర్కొనుచున్న యపాయ పరిస్థితులు మాబోంట్ల కాందోళన కారణమగును. ఈ ప్రతినిధులు నెరవేర్పవలసిన దేశహితకార్యమును దృష్టియందుంచుకొనునప్పుడీ యాందోళన ద్విగుణీకృతమగుచున్నది.

తురుష్కముయొక్క అవిభాజ్యతను పట్టుదలతో సమర్థించు, మిత్రమండలివారి స్నేహితులు తాత్కాలిక సంధిసమావేశ సూత్రములకు విరుద్ధముగ, సంధిప్రయత్నములు సాగుచున్న కాలములో, మన దేశమందలి యనేక ప్రాంతముల నాక్రమించి, అందలి ప్రజల జన్మహక్కులను నాశనము చేసిన క్రైస్తవ ప్రజలను లోలోపల నభినందించుచున్నందులకై, వారిని (మిత్రమండలివారిని) తురుష్కప్రతినిధులు కఠినముగ విమర్శించినచో, మిత్రమండలివారీ ప్రజాప్రతినిధులను నిర్బంధించుట కాని, తరిమివేయుటగాని యసంభవముకాదు. ఎన్నికలయందు పాల్గొనని క్రైస్తవులు మా శత్రువులపక్షము నవలంబించి, మాకు విరుద్ధముగ నెన్నియో కుతంత్రముల బన్ని కుట్రల గావింతురు. ఈ సభవారిచే నిర్ణయింపబడవలసిన యతి ముఖ్యవిషయములు దృష్టియందుంచికొనినచో నీ సభవారు రాజధానియందు సమావేశమగుట సమంజసము కాదని తోచితీరును. విదేశీయుల యొత్తిడి యెంతమాత్రమును లేకుండజేసి, సభ్యుల కెట్టి యాపదయును రాకుండ కాపాడగల్గినచో కాన్‌స్టాంటినోపులునందు ప్రజాప్రతినిధిసభ సమావేశమగుటకు గల యభ్యంతరములన్నియు తీరిపోవును.

దేశస్వాతంత్ర్యమునుగూర్చి యసందిగ్ధముగను, నిర్భయముగను, ఏదేని తీర్మానములు కావింపవలసినయెడల ఈ సభవారు రాజధానికి దూరముగనున్న మరెచ్చటనైన సమావేశమగుటయే శ్రేష్ఠము. ఈ సభవారు కాన్‌స్టాంటినోపులు నగరమును వీడి మరేపట్టణమునందైన తమ చర్చలు జరపినయెడల రాజధాని నగరము పూర్తిగ విసర్జింపబడినదని ప్రజలు తలంతురనియు, ప్రజాప్రతినిధి సభవారికిని, ప్రభుత్వమునకును సంబంధము లుండవనియు మీ రభ్యంతరములు చూపవచ్చును. మన సుల్తానువారి కెట్టి యసనుకూలతయును సంభవింపకుండుటకై ప్రజాప్రతినిధిసభ ప్రారంభోత్సవము రాజధానియందే జరుపవచ్చును. కాని ప్రభుత్వమువారు మరెచ్చటను సభ కావించుట కంగీకరింపకున్నారు. ప్రజాప్రతినిధులు రాజధానికేగక, తమ కిచ్చవచ్చిన మరే పట్టణమునందైనను సమావేశమైనచో వారు కావించిన తీర్మానములు శాసన బద్ధములు కానేరవు. ఇట్లగుట మా కిష్టముకాదు. ఈ ప్రజాప్రతినిధిసభ రాజధానికి దూరముగ మరెచ్చటనైన జరుపబడినయెడల దేశీయుల హృదయాంతర్గతములగు నభిప్రాయములును, వారి స్వాతంత్ర్యేచ్ఛయును నిర్నిరోధముగ ప్రకటింపబడును. కాని యీ ప్రయత్నములను ప్రభుత్వమువారు సర్వవిధముల ప్రతిఘటించి నిర్బంధవిధానము నవలంబింతురు. ఇందువలన ప్రజలకును, ప్రభుత్వమునకును మనస్పర్థలు సంభవించును."

ప్రజాప్రతినిధి సభాసమావేశమునకై తీవ్రప్రయత్నములు కావింపబడుచున్న యీ సందర్భములో గ్రీకులు

స్మిర్నాయందు నానాటికి బలవంతులు కాజొచ్చిరి. తురుష్కుల కియ్యది కంటకముగనుండెను. తురుష్కమునందలి ఆంగ్లేయో ద్యోగులును, జాతీయోద్యమమునకు ప్రతికూలురగు కొందరు తురుష్కులును, తురుష్కమందలి క్రైస్తవుల దౌర్జన్యములు కావింపబడుచున్నవని యపవాదములు వేయసాగిరి. నిజమునకిందించుకయును సత్యము లేదు. ఈ కల్పనల నాధారముగ జేసికొని కొందరాంగ్లేయులు పశ్చిమ ఐరోపా దేశములందు తురుష్కమునకు ప్రతికూలముగ ప్రచారము కావింపదొడగిరి. కమాలుపాషా కీ విషయ మెంతో కష్టమును కల్గించెను. తురుష్కమునందాంగ్లోద్యోగులు కావించుచున్న దుండగములును, కుట్రలును, ఇంగ్లాండునందును, తదితర దేశములందును తెలియకుండ దాచియుంపబడుచున్నవనియు, అవి బహిరంగమైననాడు తురుష్కుల నిర్దోషిత్వమును, విదేశీయుల దౌర్జన్యమును తేటతెల్లమగునని కమాలు కాన్స్టాంటినోపులు నందలి బ్రిటీషు రాయబారికి తెలియజేసెను. భగవత్సేనకులమని విఖ్యాతిగు క్రైస్తవోత్తములుకూడ విదేశములయందు తురుష్కమునుగూర్చి దుష్ప్రచారమును కావించుచున్నారని కమాలు బ్రిటీషురాయబారికి వ్రాసెను. ఈ సందేశమునకు బ్రిటీషురాయబారి ప్రత్యుత్తర మొసంగెనో లేదో తెలియ రాకున్నది. కాని తురుష్కప్రభుత్వమువారు మాత్రమీ లేఖలను గాంచి మిక్కిలి కలవరము చెందిరి.

పాపము నాటి తురుష్కప్రభుత్వమువారి పరిస్థితి మిక్కిలి శోచనీయముగ నుండెను. వారికి తురుష్కమునం

దెంతమాత్రమును విశ్వాసము లేకుండెను. తమ సామ్రాజ్యమును రక్షించుకొనుటకై యేకైకమార్గము మిత్రమండలివారి యనుగ్రహ సంపాదనమని వారి దృఢ విశ్వాసము. ఆ యనుగ్రహ సంపాదనమునకై వారు మిక్కిలి ప్రాకులాడ జొచ్చిరి. ఏమనిన వారి కాగ్రహము కల్గునోయని యడలుచుండిరి. అట్టి సందర్భమున కమాలుపాషా బ్రిటీషు ఉద్యోగుల చర్యలను కఠినముగ విమర్శించుచు బ్రిటీషు రాయబారులకు పంపిన సందేశము వారికి భయకారణ మగుటలో నాశ్చర్య మేదియును లేదు.

యుద్ధశాఖామంత్రియగు జమాలుపాషా పైన నుదహరింపబడిన విషయమును మనమునం దుంచుకొని కమాలున కీ సందేశము నంపెను. "తురుష్క ప్రభుత్వమువారు సంధిసమావేశమునకు తమ ప్రతినిధుల నంపుటకై ప్రయత్నించుచున్నారు. ప్రప్రథమమున మన దేశమునందు శాంతి నెలకొల్పవలయునని విదేశ రాయబారుల యభిప్రాయము. ప్రాణభీతిచే ననేకులు క్రైస్తవులు ఆనటోలియానుండి వెలువడి మిత్రమండలిచే నాక్రమింపబడిన ప్రదేశములకు వలసపోవుచున్నారని వీరు మాకు పదే పదే వ్రాయుచున్నారు. ఆనటోలియాయందలి కొందరు సాహసులు ప్రభుత్వమువారి యాజ్ఞలను తిరస్కరించుచు, వారిచే నియమింపబడిన యుద్యోగుల నష్టకష్టముల పాల్జేయు చున్నారని తెలియవచ్చుచున్నది. తమకిష్టులగు నుద్యోగులను మాత్రి మేమియును సేయక, అనిష్టులగువారిని వీరు తరిమి వేయుచున్నారు. ఇట్టి విషయములు విదేశములందు

మన ప్రతిష్ఠకు భంగము కల్గించి తీరును. ఇట్లగుట మీకు నుముదావహము కాజాలదు.” ఇందులకు ప్రత్యుత్తరము నొసంగుచు ప్రభుత్వమువారు ప్రజల విశ్వాసమునకు పాత్రులు కాదలచినచో జాతీయాశయముల కనుగుణ్యముగ వర్తింప వలయునని కమాలు తెలియజేసెను. ఇట్టి అన్యోన్య విమర్శనములు స్నేహభావమును పెంపొందింపవుకదా! సమావేశము కాబోవు ప్రజాప్రతినిధిసభయందు బలవత్తర మగు జాతీయవాదపక్షమును ఏర్పాటు చేయవలయునని కమాలు కృతనిశ్చయుడయ్యెను. ప్రజాప్రతినిధులు జిల్లా కొక్కనిచొప్పున తములో నెన్నుకొని వారినందరను ఎస్కిషెహరు పట్టణమున తన్ను కలియవలయునని కమాలు కోరెను. జాతీయోద్యమమున కంగోరాను ముఖ్యస్థానముగ కావింపవలెనని కమా లీ సందర్భముననే నిశ్చయించుకొనెను. ఎస్కిషెహరునకును, అంగోరాకును క్రొత్తగ రైలు మార్గము వేయబడెను. కావున ఎస్కిషెహరునకు వచ్చిన వారందరు గోరాకు సులభముగ రాజాలుదురు. అంగోరాను జాతీయవాదులు తమ కేంద్రముగ నిర్ణయించుకొనుటకు గల కారణములు శ్రీ కాళేశ్వరరావుగారి తురుష్కప్రజాస్వామికము నుండి సంగ్రహింపబడుచున్నవి:—

“అంగోరా జాతీయవాదులకు కార్యస్థానముగ జేసికొనుటకు ప్రబలకారణములుగలవు. జాతీయవాదులు విప్లవమునకై యత్నించుచున్నారు. రాజధానిలోని సుల్తాను యొక్క ప్రభుత్వపు టుత్తరువులను ధిక్కరించుచున్నారు. పనులన్నియు రహస్యముగ చేయబడవలసియున్నది.

అందువలననే జాతీయవాదులు తమ సమావేశములను దేశ మధ్యమున చొరశక్యముగాని ఎర్జరము, శైవాసు పట్టణములలో జరపుకొనిరి. అంగోరా దేశమధ్యమున పర్వత పజ్ఞుల ప్రక్కన ఉన్నది. అచట భద్రతగలదు. రహస్యముగ వ్యవహారములను నడుపవచ్చును. ఏ క్షణమందైనను జాతీయవాదులపైకి మిత్రిమండలిచే సుల్తానుయొక్క సైన్యములు పంపబడవచ్చును. వాని నుండి కాపాడుకొనుటకు అంగోరాయందే ఎక్కువ సౌకర్యములు గలవు.

అంగోరా పూర్వపు గ్రీకు భాషలో అంకైరాయని పిలువబడుచుండెను. అంకైరాయనగా పడవ చుక్కానియని అర్థము. అనాదినుండియు ఇది మంచి సైనికస్థానము. దీనికి వెనుకనున్న పర్వత పజ్ఞులు కోటగోడలవలె నభేద్యములుగ నున్నవి. ఆ పర్వతములలో నొకదానిమీద పూర్వులు నిర్మించిన కోట నిలచియుండి చారిత్ర్యాత్మక ప్రాముఖ్యమును జాటుచున్నది. ఆకోట చాలవరకు శిథిలమైపోయినను ఒక బురుజు మాత్రము దృఢముగ నిలచి సంరక్షణకు తోడ్పడుచున్నది. చుట్టుపట్లకూడ నాగరకప్రదేశములు లేవు. చుట్టును ఎడారులున్నమాట వాస్తవమేకాని బహిఃప్రపంచముతో రాకపోకలు సేయుటకు రైలుమార్గమును, కాన్‌స్టాంటినోపులుతో తంతిసంబంధములును గలవు. వీలు కొలది రైల్వేను, తంతని, రాకపోకలు చేయుటకును, సమాచారములు తెప్పించుకొనుటకును ఉపయోగింపవచ్చును. అపాయకరముగ నున్నప్పుడు వాని సంబంధములను తెగగొట్టి వేయవచ్చును. మరియు రాజధానియగు కాన్‌స్టాంటినోపులులో

విదేశీయులు పెక్కుమంది పాతుకొనియున్నారు. అది అన్ని జాతులకును సంబంధించిన నగరము. అంగోరా కేవలము తురుష్కపట్టణము. తురుష్కముయొక్క మధ్యభాగముననుండి, ఎటుచూచినను తురుష్కులు కాపురమున్న ప్రదేశములే కలిగి. తురుష్కజాతీయభావమును, దుఃఖమును, దుఃఖమునుండి యుత్పన్నమైన వీరావేశమును వెలిబుచ్చుచున్నది. దానివెనుక శిథిలమైన కోటగోడలు, తమ పూర్వపు ఔన్నత్యమును, ప్రస్తుత దుస్థితిని సదాజ్ఞాపకము చేయుచున్నవి. అచటి పర్వతపజ్ఙులు శౌర్యమును, స్థైర్యమును పురికొల్పుచున్నవి.

కాన, అంగోరా యొక చిన్న పాడుపడిన పట్టణము. వీధులు ఇరుకుగను అపరిశుభ్రముగను ఉండును. తరచుగ చలిజ్వరములును, బంక విరేచనములును ప్రజలను బాధించు చుండును. అయినను ఈ పట్టణముననే విప్లవమును రహస్యముగను, సురక్షితముగను నడపుచు నలువైపులకు సైన్యములు పంపుటకు వీలుగనున్నదని తలచి జాతీయవాదులు దీనిని తమ ముఖ్యపట్టణముగ జేసికొనిరి. ఇంతటినుండియు అంగోరాచరిత్ర తురుష్క విప్లవ చరిత్రతో సమ్మేళనము చెందినది. తురుష్కజాతికి అంగోరాచరిత్ర పవిత్రమైన యితిహాసమైనది. బానిసత్వమునుండి ముందు తరములవారిని తప్పించుటకు తురుష్కదేశాభిమానులు మిగుల అందమయిన నగరములను, గృహవసతులను, కుటుంబసౌఖ్యమును, ధనమును, ప్రపంచములో గల యావత్తు సుఖములను వదలి తమ నాయకునితో గూడ అననుకూలమగు శీతోష్ణపరిస్థితులు

కలిగి యెడారిమధ్యమునుండి పాడుపడిన పట్టణమగు అంగోరాలో ప్రవేశించిరి. కాన్స్టాంటినోపులు వద్ద సముద్రములో గుంకిన తురుష్క స్వాతంత్ర్యభానుడు అంగోరా కొండలలో మరల నుదయించెను. తురుష్కుల పోరాటము జయప్రదముగ ముగిసి నూతన జాతీయప్రభుత్వ మేర్పడినపిమ్మటగూడ అంగోరాయే తురుష్క దేశమునకు ప్రధాన పట్టణముగ విలసిల్లుచున్నది."

ఎర్జి రూమునందు జాతీయవాద సభ్యులు సమావేశము కాకుండుటకై ప్రభుత్వమువారు చాల ప్రయత్నములు కావించిరి. కమాలుపాషా ప్రజాప్రతినిధులందరకును యాశ యముల బోధించి, ప్రభుత్వమునకు ప్రతికూలురుగ కావించు నేమోయని వారి భయము. ప్రతినిధులెల్లరును తక్షణమే బయలుదేరి ఎచ్చటను జాగుసేయక రాజధానికి రావలయునని తంతీవార్త లంపబడెను. యుద్ధశాఖామంత్రి కమాలుపాషా కీ విషయమున నిట్లు సందేశ మంపెను. "ప్రజాప్రతినిధిసభ చాల శీఘ్రముగ సమావేశమగుట అత్యావసరము. మీరు ప్రతినిధుల నంగోరాయందు సమావేశపరచుటకై ప్రయత్నములు సేయుచున్నట్లు తెలిసినది. ప్రజాప్రతినిధు లంగోరాయందు కొన్ని రహస్య సమావేశములలో పాల్గొనుచున్నారను విషయము మన ప్రభుత్వమునుగూర్చి విదేశములలోనపోహములు ప్రబలుటకు కారణమగును. దీనివలన ప్రజాప్రతినిధులు కొందరు కుట్రదారులతో కలిసి వ్యవహరించుచున్నారని విదేశస్థు లనుమానపడుదురు. ఇట్టి సందర్భములలో తురుష్కపార్లమెంటువారు సక్రమముగ

తమ ధర్మములను నిర్వర్తింపజాలరు. తగినంత యధికార మొసంగి ప్రతినిధుల బంపినప్పుడు జాతీయాశయములు సక్రమముగ ప్రకటింపబడుట కెట్టి యవరోధములు నుండవు." ఇందులకు ప్రత్యుత్తర మొసంగుచు కమాలుపాషా, "ఎర్జరము శైవాసు సమావేశములందు తురుష్కజాతిచే నంగీకరింపబడి, ప్రకటింపబడిన తీర్మానముల నిప్పుడు రాజధానియందు జరుగబోవుచున్న పార్లమెంటునందు ప్రతిపాదించి వానిని నిరాక్షేపముగ నంగీకరింపజేయుట మిక్కిలి ఆవశ్యకము. అట్లు కానినాడు దేశమునకు ముప్పు సంభవించును. ఇందులకై బలవత్తరమగు జాతీయపక్షమును పార్లమెంటు సభయందు స్థాపించుటకై యత్నించుచున్నారము." అని తెలియజేసెను. అంగోరా సమావేశము సం దెట్టి దురుద్దేశ్యములును లేవు. పార్లమెంటుసభ కుపోద్ఘాతముగ నొక సభ నేర్పాటుచేసి జాతీయవాదులు తమ పక్షము నేవిధముగ సమర్థించుకొనవలయునో, తురుష్కప్రజల యాశయములను ప్రజాప్రతినిధిసభవారిచే నెట్లామోదింప జేయవలయునో వారికి బోధించుటకై కమా లిట్టి సభ నుద్దేశించియుండెను. ఇట్టి స్వల్ప విషయము కూడ ప్రభుత్వమువారికి భయము కల్గించుట చూడ వారికి తమ పక్షము దౌర్బల్యమును, ప్రతి పక్షుల సామర్థ్యమును స్పష్టముగ బోధపడియుండుననని తోచుచున్నది.

ప్రభుత్వమువారు జాతీయవాదులతో సంధి కావించు కొనిరేకాని అది మనఃపూర్వకమైనది కానందున ఎట్లైన

తమ యాధిక్యతను స్థాపించుకొనవలెననియు, లేనిచో తమ ప్రతిష్ఠ మంట కలిసిపోవుననియు వారు తల్లడిల్లుచుండిరి. ప్రభుత్వమునకు పోటీగ వేరొక ప్రభుత్వము స్థాపింపబడుట కెంతమాత్రము నంగీకరింపదు. స్త్రీలవలెనే ప్రభుత్వములు కూడ సవతులను సహింపవు. నాటి తురుష్క ప్రభుత్వము తమ యధికార మకుంఠితముగ సాగుచున్నదని తెలియజేయుటకు కాబోలు ఒక వింత చర్య నవలంబించిరి. అప్పటికివి సైన్యమునందు జాతీయపక్షము నెడ బహిరంగముగ నభిమానమును చూపు తురుష్కులు సేనానాయకులుగ నుండిరి. మంత్రివర్గమువా రట్టి వారి నుద్యోగములనుండి తొలగించి వారి స్థానే ప్రభుత్వ పక్షపాతులగువారిని నియమించిరి. అందు ముఖ్యముగ ఆనటోలియా యందలి సేనానాయకులయెడ నిట్టి చర్య తీవ్రరూపమున గైకొనబడెను. మంత్రివర్గమువారి యాగ్రహమునకు పాత్రులయిన సేనానాయకు లెల్లరును గత ప్రపంచసంగ్రామమునందు పాల్గొని ఖ్యాతిని గడించిరి. వారందరును కూడ నుత్సాహవంతులగు యువకులు. వారి స్థానమున ప్రభుత్వముచే నియమింపబడినవారు వృద్ధులు. ఉపకార వేతనమును పొందుచున్నవారు. మంత్రివర్గమువారు కావింప దలచిన మార్పులు చాల న్యాయముగ నున్నందున కమాలు వానిని ప్రతిఘటింప దలంచెను. యుద్ధశాఖామంత్రి యీ విషయమున చాల పట్టుదల చూపుచు, తన పట్టిన పట్టు నెగ్గనిచో రాజీనామా నొసంగెదనని బెదరింపసాగెను. ఆతని బెదరింపులకుకూడ తగిన కారణములు గలవు.

ముడ్రాసు తాత్కాలికసంధిప్రకారము తురుష్కసైన్య మంతయు తొలగింపబడెను. కొంత సైన్యముమాత్రము పోలీసు అధికారములతో దేశమునం దల్లరులు జరుగకుండ కాపాడుటకై నిలుపబడెను. తాత్కాలికసంధి షరతులు పూర్తిగ నమలు చేసినయెడల తురుష్కసైన్యమెల్ల నిర్వీర్యము కావలసినదే. కాని కమాలుపాషా యిందులకు విరుద్ధముగ స్మర్నాయందలి గ్రీకులతో పోరాడుటకై సైన్యముల సిద్ధముచేసియుండుట మిత్రమండలివారి కాశ్చర్యమును, కోపమును కల్గించెను. ప్యారిసునందలి మిత్రమండలివారి యున్నతసంఘము ఆజ్ఞల ననుసరించి బ్రిటీషుసేనానియగు సర్ జార్జిమిల్ని యుద్ధశాఖామంత్రియగు జెమాలుపాషాకు కఠినముగ జాబు వ్రాసి, తురుష్కప్రభుత్వమువారు తాత్కాలిక సంధి షరతుల నాచరణయందిడక అందుల కేవేవో సాకులు కల్పించుచున్నారని తెలియజేసెను. జెమాలుపాషాకు మిత్రమండలివారి యాగ్రహమునకు గురియగుట యిష్టములేదు. నిజమున కాతనికి సైన్యముపై నెట్టి యధికారమును లేకుండెను. తన యధికారమును పునరుద్ధరించుకొనుటకై యాతడు పాటుపడుట యసహజముకాదు. తాను రాజీనామా నొసంగినయెడల ప్రజాప్రతినిధిసభ సమావేశమగుట యసంభవమనికూడ యాతడు కమాలుపాషాకు వ్రాసెను. కాని కమాలీ బెదరింపులకు లొంగలేదు. ప్రభుత్వమువారు గైకొనదలచిన చర్య యన్యాయమని కమాలు వారికి ప్రత్యుత్తరమొసంగెను. అట్టి ప్రయత్నములను తాను సర్వవిధముల ప్రతిఘటింతుననికూడ యాతడు తెలియజేసెను.

యుద్ధాంగమంత్రి కెట్లు చేయుటకును పాలుపోలేదు. మిత్రమండలివారు కోరినప్రకారము తురుష్కసైన్యములందు మార్పులు కావింపజాలక, మరల వారినే ప్రాథేయపడి తనకు సంధిషరతుల నమలు కావించు విషయమున మిత్రమండలివారి సహాయము కావలెనని కోరెను. యుద్ధాంగమంత్రికిని, మిత్రమండలివారికిని జరుగుచున్న యుత్తర ప్రత్యుత్తరములను కమాలు గమనించుచునే యుండెను. తురుష్కప్రభుత్వమువారు తన సేవకులైనట్లు సర్ జార్జిమిల్ని వారి కాజ్ఞల నొసంగుటయు, ఆ బ్రిటీషు సేనాని యాజ్ఞలను తురుష్క-ప్రభుత్వమువారి యుద్ధాంగమంత్రి శిరసావహించి, వానిని నెరవేర్పజాలనందులకు క్షమార్పణ వేడుచు ప్రత్యుత్తర మొసంగుటయు నాతనికి చాల యవమానకరముగ గాన్పించెను. తన యసమర్థతను ప్రభుత్వము బహిరంగముగ నంగీకరించినదనియు, అట్టివారు మంత్రులుగ నుండుట కనర్హులనియు కమాలు నిశ్చయించుకొనెను. ఇది యిట్లుండ మిత్రమండలివారి దౌర్జన్యము నానాటికిని హెచ్చసాగెను. తాము కోరినప్రకారము తురుష్క యుద్ధాంగమంత్రి వర్తింపలేదనియు, అందువలన నాతడును, ముఖ్య సేనానాయకుడును రెండు దినములలో తమ పదవికి రాజీనామా నొసంగవలయునని వారు తెలియజేసిరి. ఈ యుద్యోగుల యపరాధములు మిత్రమండలివారిచే నీవిధముగ పేర్కొనబడెను:—

౧. జాతీయసైన్యములపై సమర్థులగు నుద్యోగుల నియమించుట.

౨. తురుష్క సైన్యమునుండి తొలగింపబడిన సైనికులను జాతీయ సేనలో చేర్చుకొనుట.

౩. ఫిరంగి సైన్యమునకు మందు సామానులు వగైరాలు పంపుట.

౪. సాంగల్ డక్ నుండి కాన్స్టాంటినోపులుకు పంపిన సైన్యమును కొంతకాలమువరకు నిలిపియుంచుట.

౫. కొన్ని సేనాభాగములను మిత్రమండలివారి యనుమతి లేకుండ ఒకచోటినుండి వేరొక ప్రదేశమునకు మార్చుట.

తురుష్క మంత్రిలపై మోపబడిన నేరము లతిస్వల్పములు. సైన్యమునందు కొన్ని ఆంతరంగికమగు మార్పులను గూర్చియు, సేనల రాకపోకలగూర్చియు పై విషయములు సంబంధించియున్నవి. ఇట్టి విషయములందు ప్రతి యుద్ధాంగమంత్రికిని తన యిచ్చవచ్చినచొప్పున మార్పులు గావించుట కధికారముండును. తన ప్రాథమిక హక్కుల నుపయోగించినందులకే మిత్రమండలివారు తురుష్క మంత్రిని నాజీరామా నీయవలసినదని తొందర పెట్టినప్పుడు ప్రభుత్వములోని చేవ స్పష్టముగ కానవచ్చు చున్నది.

యుద్ధాంగమంత్రిని రాజీనామా నీయవలసినదని మిత్రమండలివా రాజ్ఞాపించిన విషయము కమాలుపాషాకు తెలియవచ్చెను. తురుష్క ప్రభుత్వము మిత్రమండలికి లోబడుట యాతని కెంతమాత్రమును సమ్మతముకాదు. యుద్ధాంగమంత్రిని రాజీనామా నొసంగవలదని కోరుచు

కమా లాతనికి వర్తమానమంపెను. ప్రధానమంత్రి కీ విషయమున నీక్రింది సందేశము నంపెను:-"యుద్ధాంగమంత్రిని, ముఖ్య సైన్యాధికారిని ఉద్యోగమునుండి తొలగింపవలసినదని మిత్రమండలివారు కోరియున్నారు. ఇయ్యది మన స్వాతంత్ర్యముపై దాడి వెడలుటయని నేను వేరుగ వ్రాయ నక్కరలేదు. మన దేశమును ఖండఖండములుగ గావించి పంచుకొనవలయునని విదేశీయులు కావించుచున్న తంత్రములు పరి.సమాప్తినొందినవనియు, ఆనాటకములో తుదీయాంకమును వారు ప్రదర్శించుచున్నారనియు నాకు దోచుచున్నది. లేక తురుష్కస్వాతంత్ర్యమును నాశనము కావించుటకై వీరీ యెత్తుల నెత్తుచున్నారా? నిజమెట్లున్నను, విదేశీయులు బాహాటముగ చేయుచున్న యీ ప్రయత్నములు ప్రభుత్వము వారు మానముతో నుపేక్షించినను, తురుష్కజాతివారు ప్రతిఘటించక మానినను, మున్ముందు మన యస్తిత్వమే సంపూర్ణముగ నశించుననుట కెట్టి సందియమును లేదు. తురుష్కప్రభుత్వమువారికి జాతీయవాదులు సర్వవిధముల తోడ్పడెదరు. కావున భీతిచెందక ప్రభుత్వమువారు మిత్రమండలి సూచనలను సంపూర్ణముగ నిరాకరింపవలయునని కోరుచున్నాను. ఈ విషయములో ప్రభుత్వము శత్రువులతో నెట్టి రాయబారములు నడపినను, తురుష్కజాతియెడల తమకుగల బాధ్యతను విడనాడినట్లు ప్రజలు నిశ్చయముగ తలంతురు. ఆంగ్లేయు లంపిన సందేశము నంగీకరింపనియెడల, వారు (బ్రిటీషువారు) యుద్ధాంగమంత్రిని, ప్రభుత్వమునుకూడ బలాత్కారముగ నధికారమునుండి తొలగింపనచ్చును.

కాని అట్లగుట, మనంత మనము వారికి లొంగుటకంటె శ్రేష్ఠమని నా నమ్మకము.” యుద్ధశాఖామంత్రికిగూడ నిదేవిధముగ నాతడు తన యుద్యోగమున కా రాజీనామా నొసంగరాదనియు, యథాప్రకారము తన ధర్మములను నెరవేర్పవలయుననియు కోరుచు కమాలు వ్రాసెను.

ముస్తఫాకమాలు పంపిన సందేశమున కాప్రధానమంత్రి అలీరజాపాషా ప్రత్యుత్తర మొసంగెను. యుద్ధాంగమంత్రిని, ముఖ్యసైనికోద్యోగిని తొలగింపవలసినదని కోరినవారొక్క-బ్రిటీషువారేకాదనియు, ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీల ప్రతినిధులుకలిసి యట్లు వర్తమానమంపిరనియు, వారారోపించిన నీవిషయములు సత్యేతరములని తాను వ్రాసినను వినక మిత్రమండలివారు తమ పట్టినపట్టును నెగ్గింప దలచి యున్నారనియు, మిత్రమండలివారి షరతులు మంత్రివర్గమువారి కనంగీకారములనియు, కావున వారు తమంతతామే రాజీనామా నొసంగుటకు నిశ్చయించిరనియు తెలియజేసెను. మిత్రమండలివారిసందేశము సమావేశము కానున్న ప్రజాప్రతినిధిసభలో సవిస్తరముగ చర్చింపబడ నున్నది. కావున ఆసభ సమావేశమగువరకు శాంతముగ నుండవలసినదనియు, ఆ రహస్యమును బహిరంగపరుప వలదనియు ప్రధానమంత్రి కమాలును కోరెను. కాని కమాలిందుల కంగీకరింపలేదు. తక్షణమే అతడు దేశమందలి జాతీయవాదనాయకుల కందరకు నీవిధముగ వర్తమాన మంపెను:- “బ్రిటీషువారు మన యుద్ధాంగమంత్రిని రాజీనామా నీయవలసినదని తొందరపెట్టుచున్నారు. ఇయ్యది

తురుష్క-స్వాతంత్ర్యమునకు భంగకరము. ఇట్టి ప్రయత్నముల ప్రతిఘటించుటకూడ మనము కావించుచున్న స్వాతంత్ర్య సమరమునం దొక ముఖ్యాంగము. ఈబాధ్యత ప్రజాప్రతినిధులపైనున్నది. మనము కావించుచున్న ప్రయత్నముల నెఱింగి మిత్రమండలివారు ప్రజాప్రతినిధిసభనే విచ్ఛిన్నము గావింపవచ్చును. కావున మనము ముందేజాగ్రత్తపడి మిత్రమండలివారికిని, ఇతర మహమ్మదీయ దేశములకును మన స్వాతంత్ర్యనాశనమునకై కుట్రలు కావింపబడుచున్నవని వర్తమానములంపవలెను. అప్పుడుకూడ ఆంగ్లేయులు మితిమీరి ప్రవర్తించుట మాననియెడల కాన్‌స్టాంటినోపులు నందలి ప్రభుత్వము సంపూర్ణముగ నశించినదని నిశ్చయించుకొని, ప్రజాప్రతినిధిసభను అనటోలియా కాహ్వానముచేసి ప్రభుత్వమును మనమే నడుపబూనుదము." తన మిత్రులగు కొందరు జాతీయవాదులకు వ్రాయుచు కమాలీవిధముగ బ్రిటీషువారి చర్యను ఖండించెను:—

"బ్రిటీషువారు తమ కిష్టులగువారిని మంత్రులుగ నియమించుటకును, అనిష్టులగు వారిని తొలగించుటకును బూనుకొనియున్నారు. పరుల కొకపర్యాయము మన రాజ్యాంగ విషయములయం దధికారమొసంగినచో ఇది వారికి మార్గదర్శకముగనుండి మన స్వాతంత్ర్యమును మనమే చేతులార పోగొట్టుకొనినవార మగుదుము. రేపు తురుష్క-జాతివారి సంపూర్ణ విశ్వాసముగల మంత్రివర్గమును కూడ వీరి దేవిధముగ తొలగింపజూతురనుట కెట్టి సందేహమును లేదు. ఇట్టి మహోత్తర సమస్యల నేదో

సామాన్యవిషయముగ పరిగణించి యూరకుండుట దేశస్వాతంత్ర్యమునకు తీరని యపకారము గావించుటయే."
మరికొందరు జాతీయవాద నాయకుల కాతడీక్రింది సందేశము నంపెను:- "జాతీయస్వాతంత్ర్యమును గూర్చిన యతిముఖ్య విషయములలో శత్రువులతో నిట్లు సర్దుబాట్లు కావించుకొనుట ప్రస్తుత మంత్రివర్గమువారి యసమర్థతకు నిదర్శనము. రాజనీతి దూరులును, అసమర్థులునగు నీ మంత్రివర్గమువారు క్లిష్టమగు మన జాతీయసమస్యల తృప్తికరముగ పరిష్కరింపజాలరు. కావున నీ మంత్రివర్గమును పదభ్రష్టము కావించి ప్రజల విశ్వాసమునకు పాత్రులగు మంత్రులను నియమించుట మన ధర్మము."

తమ పంతమును నెరవేర్చుకొనుటకై బ్రిటీషువారు సర్వవిధముల ప్రయత్నింతురని యెరింగి కమాలుపాషా వారి యెత్తులకు పై యెత్తు నాలోచించెను. తమ సందేశము ప్రకారము యుద్ధాంగమంత్రి రాజీనామా నొసంగని యెడల బ్రిటీషువా రాతనిని నిర్బంధింతురు. ఇట్లు కావించుట యక్రమమని ప్రజాప్రతినిధిసభవా రాంగ్లేయుల చర్యను ఖండించినచో ప్రతినిధులలో కొందరనుకూడ వారు చెరపట్టుట నిశ్చయము. కావున ఆనటోలియా యందలి విదేశోద్యోగుల కొందరను నిర్బంధించినచో బ్రిటీషువారు కావింపబోవు కృత్యముల కియ్యది ప్రతీకారముగ నుండును. మంత్రులను, ప్రజాప్రతినిధులను నిర్బంధించినతరువాత వారి నెట్టి కష్టములకును పాల్సేయకుండుటకై యిట్టిచర్య అవసరమని కమాలు నిశ్చయించుకొనెను.

ఇట్టి విషమపరిస్థితులలో ప్రజా ప్రతినిధిసభ సమావేశమయ్యెను. రాజీనామా నొసంగుటకు సర్వమును సంసిద్ధము కావించుకొని అలీరజాపాషా ప్రమోపవేశమున కెదురు చూచుచుండెను. మిత్రమండలివారు మరియొక పర్యాయము హుంకారము కావించినచో రాజీనామా నొసంగెడివాడేకాని యేలకో వారు శీఘ్రముగ చర్య గైకొనరైరి.

ఈ ప్రజాప్రతినిధిసభవారు కావించిన తీర్మానములలో జాతీయసమాఖ్య సంగీకరించుట ముఖ్యతమమైనది. తురుష్కజాతీయవాదుల యాశయము లిందు విశదీకరింపబడినవి. తురుష్కము విదేశీయుల యాక్రమణమును ప్రతిఘటింపవలెననియు, మిత్రమండలివారు కావింప దలచుకొనిన పంపిణీలకు తురుష్క మంగీకరింపరాదనియు ఇందు స్పష్టీకరింపబడినది. ఇదివరలో నీ సమాఖ్య నంగీకరించినవారు జాతీయవాదులు మాత్రమే. ఇప్పుడన్ననో అయ్యది సక్రమ పద్ధతులపై నెన్నుకొనబడి తురుష్క రాజధానియందు సమావేశమైన ప్రజాప్రతినిధిసభచే నామోదింపబడినందున న్యాయసంగతముగ పరిణమించినది. ఇట్టి సమాఖ్యను తురుష్కపార్లమెంటుచే నంగీకరింప జేసినందులకు జాతీయవాదపక్షము మిత్రమండలివారి యాగ్రహమునకు గురియయ్యెను.

పార్లమెంటువారతిముఖ్యమగు తీర్మానములు కావించుచుండ అలీరజాపాషా స్వార్థపరుడై మెలగసాగెను. పార్లమెంటుసభ్యులు తన కనుకూలురు కారని యెరింగి

యాతడొక ప్రకటనను గావించెను. తాను జాతీయవాదులను, మంత్రివర్గమునకును సంధి కావించి తురుష్క పార్లమెంటును సమావేశ పరచితిననియు, మున్ముందు తురుష్క జాతివారి యాశయములు పార్లమెంటుద్వారా ప్రకటింపబడుననియు, కావున మరెవ్వరును తురుష్క జాతికి ప్రతినిధులమని ప్రకటించుకొనుచు ప్రభుత్వకార్యములకు భంగము కల్గింప రాదనియు, అట్లు కావించినవారు శిక్షకు పాత్రులగుదురనియు ఆ ప్రకటనయందు తెలుపబడెను. జాతీయవాదపక్షమువారి యావశ్యకత లేదు కావున వారు తమ్ము తాము రద్దు పరచుకొనవలయునని ఈ ప్రకటనయందలి యుద్దేశ్యము. పాము నోటిలో నిరికికొని మరణింప సిద్ధముగనున్న కప్ప నాలుకజాచి పురుగులను పట్ట బ్రయత్నించినట్లున్నవి ప్రధానమంత్రి ప్రయత్నములు. ఒక వంక బ్రిటీషువారు మంత్రివర్గమును రాజీనామా నొసంగవలసినదని నిర్బంధించుచుండ జాతీయపక్షమును నాశనము కావించుటకై అలీరజాపాషా యత్నించుట హాస్యాస్పదము కాదా! కమాలిట్టి బిభీషికలకు బెదరువాడు కాడు. ప్రధానమంత్రి ప్రకటనమునకు ప్రత్యుత్తరముగ మరియొక ప్రకటన నాతడు కావించెను. "మనము విశ్వప్రయత్నములు గావించి ప్రజాప్రతినిధి సభాసమావేశ మూలమున తురుష్క జాతియందు సంఘీభావమును నెలకొల్పినారము. ఆ సంఘీభావమునకు ఫలితముగ జాతీయాశయముల కనుగుణ్యముగ సంధి కావింపబడవలెను. అంతవరకును మన మప్రమత్తులమై యుండవలయును." అని యందు తెల్పబడెను.

ఈ సందర్భమున బ్రిటీషు రాయబారి కాన్స్టాంటినోపులు ప్రభుత్వమువారికి మరల నొక తాఖీదు నంపెను. గ్రీకులపై దాడి వెడలుటకు తురుష్కమునందు సాగుచున్న ప్రయత్నములు విరమింపబడవలెను. అర్మీనియనులపై కావింపబడుచున్న దురంతములు మాన్పవలెను. లేనిచో కాన్స్టాంటినోపులు నగరము సైత మాంగ్లేయులచే నాక్రమింపబడునని బ్రిటీషురాయబారి బెదరించెను. మిత్రమండలిచే నాక్రమింపబడిన ప్రదేశములకు తమ సైన్యముల నంపి జాతీయవాదులు వానిని జయించుచున్నారనియు, ఆ సైన్యముల నచ్చటినుండి మగలింప ప్రభుత్వమునకు సామర్థ్యము లేదనియు గ్రహించి, ఆసాకుపై మిత్రమండలివారు తురుష్కరాజధానియగు కాన్స్టాంటినోపులు నాక్రమింప నూహించుచున్నారని కమాలు కనిపెట్టెను. తురుష్కులు అర్మీనియనులపై దౌర్జన్యములు సల్పిరనుట వట్టి కల్ల. నిజమునకు అర్మీనియనులే తురుష్కులపై ఘోర ఘాతుక కృత్యముల గావించిరి. స్త్రీలు, శిశువులు నిర్దయగ ఖండింపబడిరి. అర్మీనియను లిట్లు విచ్చల విడిగ మారణ కృత్యముల గావించుచుండ తురుష్కులు ప్రతిఘటించినమాట వాస్తవమే. ఈ సందర్భములో నా యాప్రదేశములలోనున్న అమెరికా దేశీయులు స్వజాతీయులకు పంపిన తంత్రీవార్తల వలన నీ ఘోరకృత్యములకు అర్మీనియనులే బాధ్యులని స్పష్టముగ దెలియవచ్చుచున్నది. ఇట్టి పరిస్థితులలో మిత్రమండలివారు అర్మీలయనులపై గావింపబడుచున్న దౌర్జన్యము లంతమొందవలయునని తెల్పుట యెంతయును

ఆశ్చర్యకరము. గ్రీకులు తా మాక్రమించుకొనిన స్మర్నా మొదలగు ప్రదేశములయందు తమ బలమును వృద్ధినొందించు కొనుటకై ప్రయత్నించుచుండిరి. అనుదినమును, ఆయుధ సామగ్రియు, నూతన సైన్యములును వారి సహాయమునకు రాజొచ్చెను. ఈ ప్రయత్నములు క్రమ క్రమముగ తురుష్కమునంతయు జయించుటకొరకేయని కమాలుపాషాకు తెల్లమయ్యెను. సర్వవిధముల విదేశీయుల యాక్రమణమును నిరోధించుటకును, గ్రీకులతో పోరాడుటకును ఆతడు తన సైన్యముల నాయత్తము కావింపదొడగెను.

కమాలు స్వాధీనమందున్న సేనకు ఆయుధ సామగ్రి లేకుండెను. ఆ సైనికులకు గల సాధనములు కత్తులు, బాకులు మాత్రమే. తాత్కాలిక సంధి ప్రకారము తురుష్క సైనికుల కడనుండి తుపాకులు తీసికొనిబడెను. ఇట్టి యసహాయస్థితిలో శత్రువులతో పోరాడుట దుర్లభము. తుపాకులును, మందు సామానును లేని కొరతను దీర్చుటకై కమాం లొక సాహసమును గావించెను.

మధ్య ధరాసముద్రతీరమున గెల్లి పోలీకి సమీపమున అకాబాష్ అనుచోట ఫ్రెంచివారిచే సంరక్షింపబడుచున్న ఒక ఆయుధశాల గలదు. ఆ ఆయుధశాలయందలి సామగ్రియంతయు కొంతకాలములో ఆంగ్లేయుల హస్తగత మగును. ఈ ఆయుధశాలపై దాడి వెడలి అందలి తుపాకులు మున్నగువానిని తన వశము గావించుకొనుటకై కమాలు నిశ్చయించెను. కమాలు మిత్రుడును, జాతీయవాదియునగు హమీదీబే యను నాతనిపై నీ కార్యభార ముంపబడెను.

ఒకనాటిరాత్రి యాతడు జలసంధిని దాటి ఆయుధశాలపై బడెను. దాడి అకస్మాత్తుగ కావింపబడినందున రక్షకసైన్యము ప్రమత్తమైయుండెను. ఆ సైన్యమును సులభముగ నోడించి ఆయుధ సామగ్రినంతను తురుష్కులు గొనిపోయిరి. ఈ దాడినిగూర్చి యెచ్చటికిని సందేశములు పంపకుండుటకై తంతి తీగలు తెగగొట్టబడెను. ఆయుధ సామగ్రియంతయు సురక్షితముగ ఆనటోలియా జేరెను. ఆయుధశాలకడనున్న రక్షకభటుల కెట్టియపాయమును కల్గింపక తురుష్కులు వారిని పంపివేసిరి. ఈసాహసకృత్యమువలన జాతీయవాదులకు ౮౦౦౦ రైఫలులును, ౪౦ మరఫిరంగులును, ౨౦,౦౦౦ మందు పెట్టెలును లభించెను. దేశమునందనేక ప్రదేశములలో మిత్రమండలివారిచే రక్షింపబడుచున్న ఆయుధశాలలుండెను. తమదాడుల విషయమై వారికి తెలియకపూర్వమే కమాలు వాని నతిశీఘ్రముగ నాక్రమించెను. ఈవిధముగ నాయుధ సామగ్రినంతయు గూర్చుకొని జాతీయవాదులు గ్రీకులతో పోరాడుటకు సంసిద్ధులై యుండిరి.

జాతీయవాదుల సాహసకృత్యములకడలిపోయి అలీరజాపాషా ప్రధానమంత్రిత్వమునకు రాజీనామా నొసంగెను. కొందరు కమాలుపాషాను ప్రధానమంత్రిత్వము నంగీకరింపవలసినదని కోరిరి. కాని యాతడంగీకరింపలేదు. సలీపాషాయను నతడు ప్రధానమంత్రిగ నియమింపబడెను.

---

# ఎనిమిదవ ప్రకరణము



## మిత్రమండలివారు కాన్‌స్టాంటినోపులును ఆక్రమించుట.



తురుష్క పార్లమెంటువారు జాతీయసమాఖ్య నంగీకరించుట మిత్రమండలివారికి క్రోధము జనింపజేసెను. అందలి యంశములన్నియు ముడ్రాసు తాత్కాలికసంధికిని, మిత్రమండలి తురుష్కమునెడ మున్ముందు అవలంబింప దలంచిన నీతికిని విరుద్ధముగ నుండెను. అందులకు తోడు కమాలుపాషా యనుచరులు కావించిన సాహసకృత్యములు మిత్రమండలివారి యాగ్రహము నినుమడింపజేసెను. లండను నుండి పంపబడినయాజ్ఞల ననుసరించి మార్చి ౧౧వ తేదీని మిత్రమండలివారి ప్రతినిధులు కాన్‌స్టాంటినోపులు నగరమున సభగావించి రాజధానియందున్న జాతీయవాదుల నందరను నిర్బంధించుటకై నిశ్చయించుకొనిరి. అంగోరా యందలి బ్రిటీషురాయబారి వెడలిపోవుటకు సంసిద్ధుడయ్యెను. బ్రిటీషురాయబారి వెడలిపోయినతోడనే అంగోరాతో నన్ని సంబంధములును—శాకపోకలును, తంత్రీవార్తలును—ఆపివేయ బడునని కమాలుకు తెలియవచ్చెను. కాన్‌స్టాంటినోపులు నందలి జాతీయవాదులెల్లరును కలవరమందసాగిరి. రెండు దినముల తర్వాత రవుఫ్‌బే ప్రభృతులగు జాతీయవాదులు బ్రిటీషువారిచే చెరపట్టబడి మాల్టాద్వీపమునకు పంపబడిరి. 'తురుష్క-భూమి' యను పత్రికా కార్యస్థానమును బ్రిటీషు

వారాక్రమించినందున కార్యస్థానము మరియొక ప్రదేశమునకు మార్పబడెను. ఆక్రమింపబడిన గృహములన్నిటియందును బ్రిటీషు సైనికులు నివసింపదొడగిరి. బ్రిటీషు పటాలములు ప్రభుత్వమందిరములపైగూడ చాడిసల్పెను. కావలియున్న తురుష్క సైనికులకును, బ్రిటిషు సేనలకును యుద్ధము తటస్థించెను. ఇంకను చీకటియుండగనే ఆంగ్లేయులు ప్రభుత్వ కార్యస్థానముల ముట్టడించినందున, నిద్రితులగు తురుష్కులకు సమరసన్నాహమునకెట్టి యవకాశమును లభింపలేదు. ఈసంఘర్షణయందు కొందరు తురుష్క సైనికులు మరణించిరి, మరికొందరకు గాయములు తగిలెను. తుట్టతుదకు బ్రిటీషువారు తంత్రీకార్యాలయమునుకూడ ముట్టడించి ఎచ్చటికిని సందేశములు పోకుండ తంతితీగెలను తెగగొట్టిరి. కాన్‌స్టాంటినోపులునందలి జాతీయవాదులెల్లరును ఆత్మ సంరక్షణమునకై ప్రాకులాడిరి. గాని బ్రిటీషువారి దౌర్జన్యములగూర్చి అంగోరా కెట్టివార్తలను పంపవైరి. హమీదీయను జాతీయవాదియొక్క డెప్పటివార్తలప్పుడు కమాలుపాషాకు తెల్పియుండనియెడల, కాన్‌స్టాంటినోపులునందలి పరిస్థితు లంగోరాయందు చాలదినములవరకును తెలిసెడివేకావు.

ఎటుజూచినను కమాలుపాషాకు కష్టములే చూపట్ట దొడగెను. రాజధాని నగరమాక్రమింపబడెను. నామమాత్రమునకు తురుష్కప్రభుత్వము నిలచియుండెను. కాన్‌స్టాంటినోపులు సభకేగిన జాతీయవాద సభ్యులెవ్వరు నాతనికి తగుసహాయ మొనర్పరైరి. సమర్థులగువారు

బ్రిటీషువారిచే చెరపట్టబడి విదేశములలో ప్రవాసము ననుభవించుచుండిరి. రాజధానియందలి పరిస్థితు లెప్పటి కప్పుడు తెలియకుండ తంతితీగెలు ఖండింపబడినవి. తంత్రీ కార్యాలయము శత్రుహస్తగతమయ్యెను. కాని కమాలు ధైర్యము గోల్పోవలేదు. ఆంగ్లేయులపై కోపముచే చేతికి దొరకిన బ్రిటీషువారిపై దౌర్జన్యములును జరుపలేదు. అందులకు మారుగ ప్రపంచమందలి యన్ని జాతులవారి సానుభూతిని సంపాదించుటకై యాతడు యత్నించెను. స్మర్నా ప్రాంతమునందున్న రెఫిత్ బే యను జాతీయవాద నాయకునకు జాబు వ్రాయుచు, "తురుష్కమునందు జాతీయప్రభుత్వ మేర్పడినచో నచ్చటి క్రైస్తవజాతుల కెట్టి సంరక్షణయు నుండదని మన శత్రువులు గావించుచున్న ప్రతికూల ప్రచారమున కెట్టి యవకాశమును మన మీయరాదు. మనము వారిని (తురుష్కమందలి క్రైస్తవ ప్రజలను) స్నేహభావముతో జూడవలయును." అని తెల్పెను. ప్రతికూల వాతావరణమునందు కృషి సల్పుచున్న జాతీయవాదనాయకుని వాక్యములు సమయోచితమగు రాచకీయపు టెత్తుగ పాఠకు లూహింపవచ్చును. కాని యీ ప్రకటన ప్రపంచసానుభూతికొరకై కావించిన తాత్కాలిక ప్రయత్నము కాదనియు, ఉదారస్వభావులగు నొక జాతివారు వేరొక జాతివారితో ప్రవర్తించు మార్గమనియు మున్ముందు మనము గమనింతుము.

కాన్‌స్టాంటినోపులు నగరము నాక్రమించి, తాము

కావించిన యసామాన్య కృత్యమును సమర్థించుచు, మిత్రమండలివా రొక ప్రకటన గావించిరి. ఆ ప్రకటనను తురుష్కమండలి వివిధప్రాంతములకు పంపదలంచి, వివిధ తంత్రీకార్యాయముల కొక్కొక్క ప్రతిని పంపిరి. కాని తంత్రీశాఖయందలి యుద్యోగు లెల్లరును కమాలు పక్షమువా రైనందున వారట్లు సందేశమును పంపుటకు నిరాకరించిరి. స్వల్పసంఖ్యాకులుమాత్రము బ్రిటీషువారి సందేశమును ప్రకటించిరి. అట్టి వారు సముద్రమునం దొక నీటిబొట్టు.

మిత్రమండలివారి ప్రకటనయందు కాన్‌స్టాంటినోపులు నాక్రమించుటకు కారణములు చూపబడెను. ముందు తా మెట్టి నీతి నవలంబింతురో కూడ నందు తెలుపబడెను. ఆ ప్రకటన యియ్యది:-

“ సుమారు ఆరుసంవత్సరములకు పూర్వము, ఐక్యత, అభివృద్ధిసంఘమువారు తురుష్కసామ్రాజ్య సూత్రములను తమ హస్తములందు గైకొని జర్మనీపక్షమున ప్రపంచ సంగ్రామమునందు పాల్గొనిరి. అపాయకరములు, అన్యాయమునగు నీచర్యవలని ఫలితములు మనకు దెలిసియే యున్నవి. ఈ మహాసంగ్రామమునందు అనేక కష్టములకు లోనై తురుష్కప్రజలు తుదకు పరాజయమునొందిరి. ఈ కష్టముల నెదుర్కొను ధైర్యము లేక ఐక్యత, అభివృద్ధిసంఘమువారు మిత్రమండలితో సంధి కావించుకొని విదేశములకు పారిపోయిరి. తాత్కాలికసంధియైన తర్వాత మిత్రమండలివారి ధర్మములు లోకవిదితము. జాతిమతభేదములు లేకుండ అట్టోమాను సామ్రాజ్యమునందలి ప్రజలందరి

యొక్కయు ఆర్థిక, సాంఘికాభివృద్ధికిని, శాంతిస్థాపనమునకును, అనుకూలమగు పరిస్థితులు కల్పించుట మిత్రమండలివారి బాధ్యతయైయున్నది. సంధిసమావేశమునందీ సమస్యలు చర్చింపబడుచుండ, పలాయితులైన ఐక్యత, అభివృద్ధిసంఘమువారి యనుచరులు కొందఱు జాతీయపక్షమను పేరిట నొక సంఘమును స్థాపించి, సుల్తాను నాజ్ఞలకు విరుద్ధముగ తురుష్కప్రజలను సైనికులుగ తయారుజేయుచు, ప్రజలలో నాంతరంగిక విభేదముల గల్పించుచు, జాతీయోద్యమమునకు చందాలు వసూలు చేయుచున్నామను పేరుతో ప్రజలను దోచుకొనుచున్నారు. సంధి పొసగునట్లు కావించుటకు మారుగ వీరు మరియొక యుద్ధమును రేకెత్తించుచున్నారు. ఇన్ని కుట్రలు జరుగుచున్నను సహించి మిత్రమండలివారు కాన్‌స్టాంటినోపులు నగరమును తురుష్కుల యధీనమునందే యుండనిచ్చిరి. ఈ నిశ్చయము అట్టోమాను ప్రజలకు సంతోషదాయకముగ నుండగలదని మా నమ్మకము. సుల్తాను ప్రభుత్వమువారు కొన్ని విషయములలో బాధ్యత వహింపవలెనని మిత్రమండలివారు కోరియున్నారు. తురుష్కమునందు కాపురమున్న క్రైస్తవ ప్రజల కెట్టి యపాయమును సంభవింపరాదనియు, తురుష్కమందు నెలకొనియున్న మిత్రమండలివారి సేనల పైనను, వారి మిత్రుల సేనలపైనను ఎట్టి దాడియు కావింపబడరాదనియు మిత్రమండలివారు కోరిరి. తురుష్కప్రభుత్వమువారీ షరతుల నంగీకరించి యందుల కనుగుణ్యముగ వర్తించుచున్నారు. ఇయ్యది మోదావహము.

కాని జాతీయసంఘమను పేర బరగు వ్యక్తులు మాత్రము తమ కుట్రలను మానలేదు, సరికదా వారికి సర్వవిధముల నష్టము కల్గించుచున్నారు. అంతేకాక వారు ప్రభుత్వమును తమ పక్షమునకు ద్రిప్పికొనుటకై యత్నించిరి. సర్వజనులును వాంఛించుచున్న సంధి సంస్థాపనమున కీ పరిస్థితు లవరోధకములుగ నుండుట గమనించియు, అనతికాలములో నారంభము కానున్న సంధిసమావేశము జయప్రదముగ జరుగుటకును, మిత్రమండలివా రొక చర్య దీసికొనవలసిన వారైరి. అయ్యది కాన్స్టాంటినోపులు నగరమును తాత్కాలికముగ నాక్రమించుటయే. ఈ సందర్భమున ప్రజాసామాన్యమునకీ క్రింది విషయములు తెలుపబడు చున్నవి:-

౧. ఈ యాక్రమణము తాత్కాలికము.

౨. మిత్రమండలివారి యాశయము సుల్తాను అధికార మును క్షీణింపజేయుటకాదు. ఆయన యధికారమందుండ బోవు రాష్ట్రములపై నాయధికారమును బలపరచుటయేవారి యుద్దేశ్యము.

3. కాన్స్టాంటినోపులును తురుష్కులకడనుండి తీసికొనుట మిత్రమండలివారిమతముకాదు. కాని దైవప్రాతి కూల్యమున దేశమందంతటను అల్లరులుజరిగి (క్రైస్తవప్రజలు) హింసింపబడినచో బహుశః ఈనిశ్చయము మార్పబడును. ఈక్లిష్టపరిస్థితులయందందరు మహమ్మదీయులును, మహమ్మదీయేతరులునుకూడ దేశమునందు శాంతిస్థాపించుట కును, నూతన తురుష్కవ్యవస్థకై నిరర్థకములును,

నష్టదాయకములునగు చర్యలకావించుచున్న జాతీయవాదుల అసత్యప్రచారములకు చెవియొగ్గకుండుటకును, ప్రభుత్వ కార్యస్థానమగు కాన్‌స్టాంటినోపులునుండి వెలువడునాజ్ఞలను సక్రమముగ పాలించుటకును హెచ్చరింపబడుచున్నారు. పైన సూచింపబడిన కుట్రలయందు పాల్గొనుచున్న కొందరు ధూర్తులు నిర్బంధింపబడిరి. తాము కావించిన యకృత్యముల ఫలితములకు వారు బాధ్యులుకాగలరు."

దోషమంతయును ప్రతిస్పర్థిపై నారోపించి, తామేమియు నెరుగని నంగనాచులమనియు, శత్రువుల దురంతదౌర్జన్యములనుండి ఆత్మరక్షణము గావించుకొనుటకై స్వల్పప్రతిక్రియల గావించుచున్నామనియు ప్రకటించి, లోకమును మోసగించుటయందు బ్రిటీషువారందె వేసినచేయి. ఇట్టి విపరీతప్రచారమే బ్రిటీషు సామ్రాజ్యమునకు మూలస్తంభముగనున్నది. బ్రిటీషువారి విచిత్ర ప్రకటనలలో నియ్యదియొకటి.

ప్రపంచ సంగ్రామమునందు తురుష్కము జర్మనీపక్షము నవలంబించుటయే తురుష్కముయొక్క ప్రథమాపరాధముగ నిందు సూచింపబడినది. స్వతంత్రరాజ్యమగు తురుష్కము తనకిచ్చవచ్చినవారితో మిత్రత్వ, శత్రుత్వముల నెరపుటకు సమర్థమని వేరుగ చెప్పనక్కరలేదు. అట్టియెడ తురుష్కము కావించుకొనిన మిత్రత్వమునందెట్టి యన్యాయము నారోపింప వీలులేదు. ఓటమిచెందిన శత్రువులను పరిహసించుటయు, వారిపక్ష మన్యాయపక్షమనియు, తామే న్యాయైకవర్తనులై నట్లును డంబములుపల్కుట మిత్రమండలివారి నైజము.

తురుష్కులు తమశత్రువులతోఁజేరి తమతో యుద్ధముగావించి యోడినను, ఉదారస్వభావులగు తాము వారిని నాశనము చేయుటకు మారుగ వారిదేశములో జాతిమతభేదములు చూపకుండ సర్వజనులను ఆర్థికముగను, సాంఘికముగను అభివృద్ధిచేసి, శాంతినెలకొల్పుటకై యత్నించుచున్నారమని మిత్రమండలివారు ప్రకటించుట యాశ్చర్యకరము. ఆప్రకటన యందే మరొక భాగమున సుల్తాను నధికారమునుండి తురుష్కప్రాంతము లనేకములు లాగుకొనబడుచున్నట్లు తెలుపబడినది. తుదకు తురుష్కరాజధానియగు కాన్‌స్టాంటినోపులునుకూడ కబళించివైచిదానినిసమర్థించుటకు సాకులు వెదకుచుండిరి. తురుష్కమండలి క్రైస్తవ ప్రజలపై నెట్టి దౌర్జన్యములును జరుపబడకుండినయెడలను, మిత్రమండలియొక్కయు, వారిమిత్రులయొక్కయు సేనలపై నెవ్వరును దాడివెడలకుండ రక్షింపగల్గిన యెడలను కాన్‌స్టాంటినోపులు నగరము తురుష్కులకుతిరిగి యొసంగ బడునట తురుష్కముయొక్క సర్వతోముఖాభివృద్ధికై పాటుపడుటకు వారిసామ్రాజ్యమునంతనుమ్రింగివైచిరాజధానిపై కన్ను వేసియుంచుటకంటె వేరుమార్గమెయ్యది? తురుష్కమండలి క్రైస్తవప్రజలపై నెట్టియన్యాయములును జరుపబడుటలేదని నిష్పక్షపాతమగు విచారణవలన తేలియుండెను. అట్టియెడ దౌర్జన్యములనాపుట యననెట్టిది? లేనిదోషమును సవరించు టెట్లు? ఒకవంక మిత్రమండలివారును, వేరొకవంకనుండి గ్రీకులును దేశము నాక్రమించుచుండ తురుష్కులు వారిని నిరోధించుటకై యత్నించుట యన్యాయకార్యమైనట్లు

ప్రకటనయందు సూచింపబడినది. ఇంత చోరబడిన దొంగను తరిమివేయుట యెంత దోషకృత్యమో, ఇయ్యదియు నంతటిదే. సమస్త జాతులవారికిని తమతమ దేశీయులను విదేశీయుల బారినుండి సంరక్షించుకొనుటకు హక్కుగలదని వేరుగ చెప్పవలయునా? నాటి తురుష్క ప్రభుత్వమువారసమర్థులై మిత్రమండలి చేతికీలుబొమ్మలైయున్నందున వారు సత్పురుషులైనట్లును, వారియాజ్ఞలను తురుష్క ప్రజలెల్లరును శిరసావహించుట ధర్మమైనట్లును తెలుపబడినది. శత్రువు తన యాక్రమణమునకు సాయపడుచు దేశద్రోహియై వర్తించు ధూర్తుని భూషించి, దేశభక్తుడగు వానిని ఖండించి పల్కుట సహజమే. మిత్రమండలివారును అట్లే కావించిరి.

మిత్రమండలివారి ప్రకటనము కమాలుపాషాను క్రుద్ధుని గావించెనని వేరుగ తెలుపనక్కరలేదు. ఇందులకు ప్రత్యుత్తరముగ నొక ప్రకటనమువ్రాసి దానిని అడేలియా యందలి ఇటలీ రాయబారిద్వారా ఇంగ్లాండు, ఫ్రాన్సు, అమెరికా, ఇటలీ రాయబారులకును, తటస్థదేశములందలి విదేశాంగమంత్రులకును ఇంగ్లాండు ఫ్రాన్సులలోని పార్లమెంటుసభలకును పంపెను.

“తురుష్క స్వాతంత్ర్య చిహ్నములగు ప్రభుత్వకార్య స్థానములును, పార్లమెంటు భవనమును, బలాత్కారముగ మిత్రమండలివారి సేనలచే నాక్రమింపబడినవి. జాతీయోద్యమముయొక్క ఉద్దేశ్యముల కనుగుణ్యముగ నడచుచున్న తురుష్క దేశభక్తులనేకులు నిర్బంధింపబడిరి. కాన్స్టాంటినోపులు ఆక్రమణము తురుష్క స్వాతంత్ర్యమునకే

గాక, సమస్త నాగరక ప్రపంచమునందును పవిత్రముగ పరిగణింపబడుచున్న అంతర్జాతీయ నియమములను భగ్నమొనర్చినది. జన్మహక్కులకొరకును, స్వాతంత్ర్యము కొరకును మేము కావించుచున్న సమరము పవిత్రమైనదని మా దృఢవిశ్వాసము. ఒక జాతిని సంపూర్ణముగ రూపుమాపుటకు ప్రపంచమం దెట్టి శక్తియునుకూడ నసమర్థమని మేము నమ్ముచున్నాము. మా యుద్యమమునందలి న్యాయాన్యాయములను విమర్శించుటకు సమర్థులు ఇంగ్లాండు అమెరికా మున్నగు దేశములందలి నాగరకులును, విజ్ఞానవంతులునగు ప్రజలేకాని అచ్చటి ప్రభుత్వోద్యోగులు కారు. కాన్‌స్టాంటినోపులు ఆక్రమణమువంటి యకార్యము మానవచరిత్రయందు మరెప్పుడును సంభవింపలేదు. ఈ కుట్రయందు పాల్గొన్న యన్ని జాతులకును ఇది తీరని కళంకము. ఇట్లు కావించుట కేవల మన్యాయ్యము. విల్సను సభాపతి చతుర్దశసూత్రములపై ఈ (ముద్రాసు) తాత్కాలిక సంధి కావింపబడినది. ఈ తాత్కాలిక సంధి ననుసరంచి మా దేశమునం దాత్మరక్షణోపాయముకూడ లేకుండ గావింపబడెను. ఇట్టి యన్యాయకృత్యములలో మీకు గల బాధ్యత చరిత్రకారులచే భవిష్యత్కాలమున నెట్లు పరిగణింపబడునో గుర్తింపుడని కడపటి పర్యాయము మిమ్ము హెచ్చరించుచున్నాము.”

ఇట్టి తంత్రీవార్తలనే ఇంగ్లాండు మున్నగు దేశములకు పంపవలసినదని కమాలు ఇతర జాతీయవాదులను కోరెను.

'కాన్‌స్టాంటినోపులు నందుండుట అపాయకరమని

యెరింగి జాతీయవాదులెల్లరును అచ్చటినుండి నలుదెసలకును పారిపోయిరి. ఇట్టి వారందరును అంగోరాకు రాదగునని కమాలు వర్తమానమంపెను. జాతీయవాదులనేకు లంగోరాకు వచ్చిచేరిరి.

కాన్స్టాంటినోపులునందు నూతన ప్రభుత్వము స్థాపింపబడెను. దేశద్రోహియగు దామాదుఫరీదుపాషా ప్రధానమంత్రిత్వమును స్వీకరించెను. అతనికిష్టులును, మిత్రమండలివారికి దాసులునగు తురుష్కప్రముఖులు మంత్రులైరి. సంధిసమావేశమువారు తదితర సమస్యల నన్నిటిని పరిష్కరించి తురుష్కసంధిని గూర్చిన షరతులను చర్చింపదలచుచుండిరి. ఇట్టి సందర్భమున తమ యాజ్ఞలను నిస్సంశయముగ పరిపాలించువారును, తమ నిశ్చయములు తురుష్కమున కెంత నష్టదాయకములైనను వానిని శిరసావహించెడివారునగు మంత్రులు కాన్స్టాంటినోపులు నందుండుట మిత్రమండలివారి కనుకూలము. తదను గుణముగనే వారు నూతన తురుష్క మంత్రివర్గమును నియమింపజేసిరి. "జాతీయవాదులెల్లరును తిరుగుబాటు దారులని సుల్తానుప్రభుత్వము ప్రకటించెను. రాజద్రోహ నేరముక్రింద మరణశిక్షను విధించి వారంటులఁ బంపెను. తురుష్కములో ఇస్లామునకు ప్రధాన మతగురువగు షేకుల్ ఇస్లాము జాతీయోద్యమము మహమ్మదీయ మతమునకు వ్యతిరేకమనియు, జాతీయవాదులెల్లరును రాజద్రోహులు గనుక వారిని మతమునుండి తొలగించితి ననియు, ఎవరైనను వీరిని చంపినచో భగవంతునికి ప్రీతికరమగు

కార్యమనియు, మరియొక ప్రకటనము గావించెను. ఇటుల ముస్తఫా కమాలుపాషాయును, ఆయన యనుచరులును మిత్రమండలికి శత్రువులును, సుల్తానుకు తిరుగుబాటు దారులును, మతమునకు ద్రోహులును, సంఘమునుండి బహిష్కరింపబడిన వారు నైరి. మత గురువులు తమ స్వసంరక్షణకొరకును, స్వలాభముకొరకును, అజ్ఞానులైన ప్రజలమీద తమకుగల పలుకుబడిని దేశాభివృద్ధికిని, దేశ లాభమునకును, వ్యతిరేకముగ నెటుల నుపయోగింతురో తెలియుటకిదియొకనిదర్శనము." * ప్రభుత్వమువారియొక్కయు, ప్రధానమతగురువుయొక్కయు ఆగ్రహమునకు పాత్రులైన వారిలో ప్రముఖులు ముస్తఫాకమాలుపాషాయును, సుప్రసిద్ధ తురుష్కగ్రంథకర్త్రియగు మేడమ్‌హాలిడేఎడిబ్ మున్నగువారు. ఈ వార్త వినినంతనే కమాలుపాషా ఆగ్రహోదగ్రుడై తమకు ఉరిశిక్ష విధించినవారికే మరల ఉరిశిక్ష విధించి, ఆ ఆజ్ఞను మరికొందరు మత గురువులచే నంగీకరింపజేసి ప్రకటించెను.

జాతీయవాదులందరును అంగోరాయందు సమావేశమైన తరువాత ప్రజాప్రతినిధిసభను గావించుటకై కమాలు నిశ్చయించెను. మిత్రమండలివారు కాన్‌స్టాంటినోపులు నగరము నాక్రమించి తురుష్కప్రభుత్వమువారి స్వాతంత్రమును సంపూర్ణముగ నాశనము చేసిరనియు, ప్రజాప్రతినిధిసభను సమావేశ పరచుటకు ప్రభుత్వమువా రంగీకరించుటలేదు కావున జాతీయవాదులే ఇట్టి సభను గావింపదలంచిరనియు,

* (తురుష్కప్రజాస్వామికము)

ఈ సభవారు దేశస్వాతంత్ర్య స్థాపనకై యావశ్యకములగు విషయములను చర్చింతురనియు కమాలు ప్రకటించెను. నూతన ఎన్నిక లెట్లు జరుగవలయునో యతడు సూచించెను. ఈ యెన్నికలు పదునేనుదినములలో ముగిసిపోవలయునని యాతడు కోరెను. న్యాయసమ్మతమగు తురుష్కప్రభుత్వముతో తాను పోరాడుచున్నను చట్టసమ్మతమగు పద్ధతిని వీడుటకు మాత్ర మాత డంగీకరింపలేదు. ప్రభుత్వమువారి దేశద్రోహ కార్యములవలన యసామాన్య పరిస్థితు లేర్పడినవనియు, అందువలన తాను ప్రభుత్వముపై తిరుగుబాటు కావించితి ననియు, అంతేకాని శాసనవిరుద్ధముగ ప్రవర్తించుటయన నతని కించుకయు నిష్టము కాదని కమాలుపాషా వాదము. తురుష్క-రాజ్యాంగ పద్ధతి ప్రకారము ప్రజాప్రతినిధిసభ కాన్స్టాంటినోపులునందు సమావేశముకావలెను. కాని ఇప్పు డాసభ అంగోరాలో కానున్నది. ఇట్టి మార్పులను కావించుటకు తురుష్క-పార్లమెంటు సభ కధ్యక్షుడుగ నున్న యాతనికి మాత్ర మధికారముగలదు. అంగోరాయందు పార్లమెంటుసభ సమావేశమగుట కనుజ్ఞ నీయవలసినదని కమాలు తత్సభాధ్యక్షుడగు జమాలుద్దీన్ ఆరిఫ్ బేను కోరెను. ఆ రాజ్యాంగశాస్త్ర పండితుడు చాలదినములవరకును న్యాయసూక్ష్మములను విచారించి తుట్టతుదకు కాన్స్టాంటినోపులునందుతక్క మరెచ్చటను పార్లమెంటుసభ సమావేశము కారాదని తీర్మానించెను. జాతీయాశయము లీడేరుట కీ తీర్మానము ప్రతిబంధకముగ దోచినందున కమా లందుల కంగీకరింపలేదు. అంగోరాయందే

ప్రజాప్రతినిధులు సమావేశము కావలెనని కమాలు నిశ్చయించెను.

ప్రజాప్రతినిధి సభకై యెన్నికలు జరుగజొచ్చెను. ఈ పరిస్థితులయందు సైతము తురుష్కులెల్లరును కమాలుపాషా పక్షమునే యవలంభించిరని చెప్పుటకు వలనుపడదు. సామ్సూను అను ప్రదేశమునందున్న సైన్యము సుల్తాను పక్షము నవలంబించెను. ఇందులకు తోడు మిత్రమండలిచే నాక్రమింపబడిన రాజభవనములు, ప్రభుత్వ మందిరములును, తిరిగి తురుష్కప్రభుత్వమున కొసంగబడెననియు, తురుష్కమంత్రివర్గమువారు సక్రమముగ పరిపాలన గావించుచున్నారనియు కొన్ని పత్రికలు ప్రకటింపజొచ్చెను. మిత్రమండలివారి యన్యాయ ప్రవర్తనచే విరక్తులై జాతీయపక్షమున జేరిన కొందరు మితవాదులు మంత్రివర్గమువారు సక్రమముగ ప్రభుత్వమును కొనసాగించుచుండ విద్రోహులతో జేరుటెందులకని చింతించి వెనుకకు తగ్గజొచ్చిరి. జాతీయపక్షమువారి యత్నములు భగ్నమొనర్చుటకై కొన్నిప్రదేశములందు శత్రువులు వంతెనలను తీసివేసిరి. తంతితీగెలను తెగగొట్టిరి. దేశములో రాజభక్తుల సంఘములనేకములు వెలసెను. తాము సుల్తాను ప్రభుత్వమునేగాని తదితర సంస్థల నంగీకరింపమనియు, జాతీయోద్యమమును రూపుమాపుటకై ధనప్రాణముల ధారపోయుటకు సిద్ధముగ నున్నామని వారు ప్రకటించిరి. ఇట్టి విరుద్ధ ప్రచారము నరికట్టుటకు కమాలుపాషా తగుకట్టుబాట్లను గావించెను.

౧౯-౨౦ సంవత్సరము ఏప్రిలు ౨౦వ తేదీని అంగోరా యందు జాతీయసమావేశము కావించుటకై నిశ్చయింపబడెను. ఈ దినమునకు రాజకీయ ప్రాముఖ్యతయేగాక మతసంబంధమునుకూడ కొంత కల్పింపవలెనని కమాలు తలంచెను. "జాతీయ మహాసభవారు అతిముఖ్యమగు విషయములు అనగా తురుష్క జాతీయ స్వాతంత్ర్య స్థాపనమునుగూర్చిన ప్రయత్నములు ఆలోచించుటకు పవిత్రమగు శుక్రవారమునాడు సమావేశము కానున్నారుకావున ప్రప్రథమమున సభ్యులెల్లరును మసీదునకు దయచేయ ప్రార్థింపబడుచున్నారు. అచ్చట దైవప్రార్థనము కావింపబడును. గౌరవనీయులగు సభ్యులెల్లరును అందు పాల్గొందురు. అనంతరము పవిత్రగ్రంథమగు ఖురానునుండి జ్ఞానోపదేశము కావింపబడును. మహాసభ సమావేశమగుటకు పూర్వము భగవానునకు కృతజ్ఞతానందనము లర్పింపబడి, తత్ప్రీతికరముగ గొఱ్ఱెలు బలి యొసంగబడును. ప్రార్థనాసమయమున సుల్తాను వారి నామముచ్చరింపబడినప్పుడు వారి మహత్తరవ్యక్తికొఱకును, వారి రాజ్యముకొఱకును, దుఃఖితులగు వారి ప్రజల కొఱకును ప్రత్యేక ప్రార్థనములు కావింపబడును." అని కమాలుపాషా ప్రకటనము గావించెను. మతాచారముల యెడలను, తురుష్క సుల్తాను నెడలను కమాలుపాషాకుగల భావములు మరుగు పరుపబడినవి. మతాభిమాన పూరితులగు సామాన్యప్రజల సంతసముకొఱకును, రాజభక్తుల నమ్మికకొఱకును ఇట్టి ప్రకటన ముద్దేశింపబడెనని వేరుగ తెలుప నక్కరలేదు.

---

# తొమ్మిదవ ప్రకరణము



## జాతీయోద్యమము నణచివేయుటకై విశ్వప్రయత్నములు.



ప్రప్రథమమునుండి కమాలుపాషా సుల్తాను పదవిని రద్దు పరుపవలయునని నిశ్చయించుకొనియుండెను. కాని ప్రజాసామాన్యమును, జాతీయవాదులలో ననేకులును, తురుష్కము ననేక శతాబ్దులనుండి పాలించుచున్న అట్టోమాను వంశీయులయెడ భక్తి గౌరవముల గల్గియుండి నందున తన యభిప్రాయముల నాతడు బహిరంగపరుపలేదు. కాన్‌స్టాంటినోపులునందలి సుల్తాను ప్రభుత్వము వారు స్వాతంత్ర్యమును గోల్పోయి మిత్రమండలివారి చేతి కీలుబొమ్మలవలె నున్న విషయము నందరును అంగీకరించిరి. గ్రీకులు స్మర్నాయందు గావించిన దురంతములును, మిత్రమండలివారు కాన్‌స్టాంటినోపులు నాక్రమించుటయు, తురుష్కులకు మహాగ్రహమును కల్గించెను. విదేశీయులయెడ ద్వేషభావమును, ఎట్లైనను వారి బారినుండి తప్పించుకొన వలయునను నిశ్చయమును దేశమందెల్లెడల బలపడెను. దేశమోక్షణము విషయమున సుల్తాను ప్రభుత్వ మేమియు చేయజాలదనియు, జాతీయవాదులవలననే దాస్యవిమోచనము కావలయుననియు ప్రజలకు దృఢవిశ్వాస మేర్పడెను. ఇట్టి సందర్భమున అంగోరాయందు జాతీయ సమావేశము కావించుటకు నిశ్చయింపబడినందున, సుల్తాను ప్రభుత్వమును సంపూర్ణముగ తిరస్కరించి జాతీయ ప్రభుత్వమును

బలపరచుటకు ప్రజలెల్లరును సంసిద్ధులైయుండిరి. ప్రజాస్వామిక సిద్ధాంతములపై నూతన ప్రభుత్వమును స్థాపింపవలయుననియు, అందొక శాసనసభయు, మంత్రివర్గమును, రాజ్యమున కొక సంరక్షకుడు నుండవలయుననియు సంరక్షకుడు శాసనసభ కధ్యక్షుడుగ నుండవలయుననియు కొందరు సూచించిరి. కాని కమాలుపాషా యీవిధానమునకు ప్రతికూలత వహించెను. ఈ ప్రభుత్వ విధానము ప్రజాస్వామికము గావున దానిని ప్రజ లంగీకరింపరనియు, అదియునుగాక ప్రజాస్వామిక పద్ధతి యుద్భవించిన పశ్చిమ ఐరోపాయందే అయ్యది సంపూర్ణముగ తిరస్కరింపబడిన దనియు, కావున నట్టి విధానము నవలంబించుట సమంజసము కాదనియు కమాలు వాదించెను. తుట్టతుద కొక రాజ్యాంగ విధాన మంగీకరింపబడెను.

ఆవిధానము ప్రకారము ప్రజాప్రతినిధి సభవారే శాసన నిర్మాణాధికారమును, కార్యనిర్వాహణాధికారమునుగల్గి మంత్రివర్గమును నియమింతురు. మంత్రులు వారివారి సమర్థత ననుసరించి నియమింపబడుదురు. వారు ప్రజానిధిసభకు మాత్రమే బాధ్యులుగనుందురు. శాసన సభవారి నిర్ణయములను పాలించుట యీమంత్రివర్గమువారి ధర్మము. ఈ మంత్రివర్గమునకు శాసన సభాధ్యక్షుడే నాయకుడుగ నుండును. ఈ ప్రభుత్వ విధానమును జాతీయమహాసభలో ప్రవేశపెట్టుటకై తీర్మానింపబడెను. ప్రజాప్రతినిధి సభకు తురుష్కజాతీయసభయని నామమొసంగబడెను. ౧౯౨౦ ఏప్రిలు ౨౩వ తేదీనాడు జాతీయమహాసభ సమావేశమయ్యెను. ఈ సభయందు కమాలుపాషా అతిగంభీరముగ

నాల్గుగంటలుపన్యసించెను. యుద్ధరంగమునందెంత సమర్థుడో సభాభవనమునకూడ నంతకు తీసిపోవువాడు కాడని ప్రతినిధులెల్లరకును తెలియవచ్చెను. ఇంగ్లాండు, అమెరికా దేశములలో ప్రభుత్వములు చూపులకు ప్రజాభిప్రాయ ప్రకారము నడుపబడుచున్నట్లు కాన్పించినను నిశ్చయముగ నట్లు కావనియు, అచ్చటి ప్రభుత్వములు వ్యక్తులపై నాధారపడి యున్నవనియు, కావున నయ్యవి తమ యనుసరణమున కయోగ్యములనియు కమాలు పల్కెను. ప్రజాభిప్రాయమును నిరాటంకముగ కొనసాగించుటకై పైన సూచింపబడిన ప్రభుత్వవిధానము నంగీకరింపవలెనని యాతడు కోరెను. తురుష్కజాతివారు తమ యస్తిత్వమును నిల్పుకొనదలచినచో శతాబ్దులనుండి తురుష్కసుల్తాను లవలంబించిన రాజనీతిని విడనాడి నూతన పద్ధతుల నవలంబింపవలయునని యాతడు సూచించెను. వ్యక్తులును, జాతులునుకూడ జీవింపదలంచి యుండినచో నైతిక, భౌతిక శక్తుల నభివృద్ధి గావించుకొనవలయునని యాతడు వక్కాణించెను. ప్రాక్పశ్చిమ ఖండములనడుమ జరిగిన నిరంతర యుద్ధముల యందొక గొప్ప చారిత్రక ప్రాముఖ్యత యిమిడి యున్నదని యాతడు తెల్పెను. ప్రాగ్దేశీయులలో తురుష్కులే ఈ యుద్ధములలో విశేషముగ పాల్గొని ఇస్లాము మతస్థాపనానంతరమును, తత్పూర్వమునుకూడ యూరోపు ఖండమును, తదితర ప్రాంతములను పాలించిరి. కాన్‌స్టాంటినోపులునందు అట్టోమాను సామ్రాజ్యమును స్థాపించిన తురుష్కులు సెల్జూక్ తురుష్కులకు

వారసులవంటివారు. జర్మనీ దేశమును, రోముపట్టణమును జయించి, మహాసామ్రాజ్యమును స్థాపించి, సిరియా, ఈజిప్టు ప్రాంతముల నాక్రమించి, ఖలీఫా బిరుదమును వహించి, తురుష్క సుల్తానులు దిగంతవిశ్రాంతకీర్తి నార్జించిరి. తురుష్కసుల్తానులు యూరోపుఖండముపై నడపిన దాడులకు ప్రతీకారముగ యూరోపు దేశస్థులు తురుష్కముతో నిరంతర యుద్ధము గావించిరి. తత్ఫలితముగ తురుష్కము బలహీనమయ్యెను. తురుష్కసుల్తాను లవలంబించిన నీతి వారి వ్యక్తిగౌరవమును పెంపొందించెనేకాని అందువలన దేశమున కెద్దియు లాభము చేకూరలేదు. ఈ రాజనీతియందెట్టి ఉన్నతోద్దేశ్యము నున్నట్లు కాన్పింపదు. ప్రస్తుతము జాతీయ సిద్ధాంతములనే మనము పునాదిగ గైకొనవలయును. ప్రపంచపరిస్థితులును, రాజకీయముగ మానవునియందు కల్గిన గొప్ప యభివృద్ధిని గమనించి సామ్రాజ్యస్థాపనము మున్నగు అసంభవ ప్రయత్నముల జోలికి పోకుండుటయే మనకు శ్రేయోదాయకము. జాతీయనీతిని మాత్రమే మన మవలంబింపవలయును. జాతీయనీతియని పల్కుటలో నా యభిప్రాయ మియ్యది. మన దేశపు సరిహద్దులలో, మన దేశముయొక్కయు, జాతియొక్కయు సౌఖ్యము నభివృద్ధి గావించుటకై పాటుపడుచు, ఆత్మరక్షణమునకై మన బలముపైననే ఆధారపడియుండుట" యని కమాలు పాషా గంభీరముగ నుపన్యసించెను. ఈ విధముగ అట్టోమాను సుల్తాను లవలంబించిన నీతిని తిరస్కరించి నూతన పద్ధతులపై

తురుష్క రాజ్యమును స్థాపించుటకై కమాలుపాషా నిశ్చయించుకొనెను.

జాతీయమహాసభవారు తురుష్కజాతీయ సమాఖ్యను మరల సంగీకరించిరి. మిత్రమండలివారి దౌర్జన్యములనుండి దేశమును సంరక్షింపవలెనని తీర్మానింపబడెను. సుల్తానును, కాన్‌స్టాంటినోపులు ప్రభుత్వమువారును, మిత్రమండలివారి యధీనములోనుండి దేశక్షేమమునకు విరుద్ధముగ ప్రవర్తించుచున్నారు గావున ౧౯౨౦ సంవత్సరము పదునారవ మార్చినుండి వారు తమ ధర్మములను నిర్వర్తింప మానినట్లే నిశ్చయింపబడెను. వారి స్థానే కమాలుపాషా రాజ్యాంగమును నడపుచున్నట్లు ప్రకటింపబడెను. ఈ విషయమును గూర్చి కమాలు తన విదేశీయ మిత్రులలో నొకరి కీవిధముగ జాబువ్రాసెను:- "౧౯౨౦ ఏప్రిలు ౨౩ వ తేదీని సమావేశమైన తురుష్కజాతీయ మహాసభవారీ క్రింది తీర్మానముల గావించిరి. నేటినుండియు, సుల్తాను ఖిలాఫతుపదవులును, కాన్‌స్టాంటినోపులు ప్రభుత్వమును, మిత్రమండలివారి ఖైదీలని అట్టోమాను ప్రజలు తలంచుచున్నారు. కాన్‌స్టాంటినోపులు నగరము శత్రువుల యాక్రమణయందున్నన్నినాళ్ళును, అచ్చటినుండి వెలువడు రాజకీయాజ్ఞలును, శ్రీముఖములును అధికారరహితములు. కాన్‌స్టాంటినోపులు ప్రభుత్వమువారు కావించుకొను సంధులు అట్టోమాను ప్రజలచే సంగీకరింపబడవు. అట్టోమాను ప్రజలు పవిత్రములును, పురాతనములునగు తన జన్మహక్కులను సంరక్షించుకొనుటకును, దేశస్వాతంత్ర్యమును

స్థాపించుకొనుటకును కృతనిశ్చయులైయున్నారు. న్యాయమైనట్టియు, గౌరవ భంగకరము కానట్టియు పద్ధతులపై వారు విదేశీయులతో సంధి కావించుకొనుటకు సంసిద్ధులు. కాని యీ విధముగ సంధి కావించుకొనువారు జాతీయ మహాసభవారిచే నియమింపబడిన ప్రతినిధులై యుండవలయును. తురుష్కమునందు నివసించుచున్న క్రైస్తవులితర విదేశీయులవలెనే తురుష్కజాతివారి సంరక్షణలో నున్నారు. కాని దేశక్షేమమునకు భంగకరములగు నెట్టి యుద్యమములందును వారు పాల్గొనరాదు."

ఈ విధముగ కాన్‌స్టాంటినోపులు ప్రభుత్వమునకు ప్రతిద్వంది గ వేరొక ప్రభుత్వమును స్థాపించుట యందలి యర్థమును కమాలు సంపూర్ణముగ గ్రహించి యంగీకరించెను. సుల్తాను ప్రభుత్వమును, ఖిలాఫతుపదవియును, తాత్కాలికముగ నధికారపదవినుండి తొలగింపబడినట్లు జాతీయమహాసభ వారును అంగీకరించిరి. వానిని శాశ్వతముగ రద్దుపరచినట్లే కమాలు నిశ్చయించుకొనెను. కాని యాతడు తన మనోగతాభిప్రాయములను మాత్రము ప్రకటన మొనరింపలేదు. తాము కావించిన నూతన ప్రభుత్వస్థాపనమునం దింతటి విప్లవబీజములు కలవని సభ్యులు గ్రహింపజాలకపోయిరి. సుల్తాను స్వయముగ నిర్దోషియైనట్లును, దేశద్రోహులగు మంత్రులచే నాతడు మోసగింపబడునట్లును సభ్యులు తలంచిరి. జాతీయమహాసభ స్థాపింపబడిన ప్రథమ దినములలో సుల్తానునకును, తమకును సంబంధమున్నట్లు పలువురు సభ్యులు ప్రసంగించెడివారు. కాన్‌స్టాంటినోపులు ప్రభుత్వముతో

రాయబారములు సల్పుటవలన నెట్టి లాభము నుండదని కమాలు జాతీయవాదులకు నచ్చజెప్పెను. "తురుష్కజాతివారు తమ యాశయముల వెల్లడించుటకు సాధనముగ జాతీయ మహాసభను నియమించినారు. జాతీయమహాసభను మించిన యధికారము తురుష్కములో లేదు. శాసననిర్మాణమును, ప్రభుత్వనిర్వహణమును మహాసభవారే కావింతురు. ఈ యసామాన్య పరిస్థితులు మారినతరువాత సుల్తానువారు ప్రభుత్వవిధానమునందు తొల్లింటివలెనే ప్రాముఖ్యత వహింతురు." అని కమాలుపాషా ప్రకటించెను.

ముస్తఫా కమా లవలంబించుచున్న కార్యక్రమ మతి వాద మార్గముననున్నదనియు, ఆతని యుని కి వల న నే ప్రభుత్వము జాతీయపక్షము నెడ వైరము పాటించుచున్న దనియు, జాతీయోద్యమమందు కమాలు ప్రాముఖ్యత తగ్గినయెడల నుద్యమమునకు క్షేమమనియు, కొందరు జాతీయవాదులు లోలోపల తలంపజొచ్చిరి. మరికొందరు సాహసముతో తమకు కమాలు నెడ గల విరోధభావమును బహిరంగముగ ప్రకటించి యాతనిని విమర్శింపబూనిరి. దేశమునం దనేక ప్రదేశములలో కమాలు ప్రతిపక్షులు జాతీయపక్షముపై తిరుగుబాటు కావించిరి. మరికొందరు అంగోరా నాక్రమించుటకై యత్నములు సల్పిరి. కాని వారి ప్రయత్నములు విఫలమయ్యెను. డూజే యను ప్రదేశమునందు శత్రువులు జాతీయసైన్యముల నోడించి వారి ఆయుధముల గైకొని, సైనికులను చాల అవమానపరచిరి. మహమూద్ బే యను సేనానాయకునిని జాతీయవాదులు శత్రువులపై బంపిరి.

శత్రువులు డూజే నుండి అడాబజారునకు వెడలిపోయినందున మహమూదుచే వారిని వెంబడించి యుద్ధము కావించెనుకాని దురదృష్టవశమున యుద్ధారంభమునందే యాతడు తుపాకి దెబ్బ తగిలి మరణించెను. జాతీయవాదుల ఆయుధ సామగ్రులను శత్రువులు కొల్లగొట్టిరి.

కాన్స్టాంటినోపులు ప్రభుత్వమువారు జాతీయపక్షము నణగద్రొక్కుటకై యెదురుచూచుచుండిరి. వారికిప్పుడు తగిన యదను చిక్కెను. వారు సుబేపాషాయను నాతని నాయకత్వమున నొక సేనను జాతీయవాదులపై బంపిరి. సలోనికాయందు సుబేపాషాయును, కమాలుపాషాయును ఒకే సైన్యవిభాగమునం దుద్యోగులుగనుండిరి. ఒక సందర్భమున కమాలు సుబేపాషాను తీవ్రముగ విమర్శించెను. ఉన్నతోద్యోగియగు సుబే తనకు చాల యాగ్రహము కలిగినట్లు ప్రవర్తించెను. కాని నిజమున కాతడు కమాలు సామర్థ్యమును, నిర్భయత్వమును గాంచి మిగుల సంతసించెను. నాటినుండియు వారిరువురును మిత్రులైరి. మిత్రుడగు సుబేపాషా తనతో యుద్ధము కావించుటకై వచ్చినాడని విని కమా లాతనిని సందర్శింపనేగెను. 'సుల్తానుపక్షము నేలవహించితి' వని కమా లాతనిని ప్రశ్నించెను. ఇంచుక యాలోచించి 'నీచే నోడింపబడుటకై' యని సుబేపాషా మందహాసపూర్వకముగ ప్రత్యుత్తర మొసంగెను. నిజమున కాతడు జాతీయపక్షమువారికి జయము చేకూర్పవలయుననియే సేనానాయకత్వము నంగీకరించెను. కాని సు బే పా షా యధికారమును గ్రహింపకపూర్వమే సుల్తాను సైన్యములు

జాతీయవాదులచే నోడింపబడి పారిపోయెను. దేశమునం దల్లరు లణగునప్పటి కొక సంవత్సరము పట్టెను.

బహిరంగయుద్ధమున జాతీయవాదుల నోడింపజాలక కృత్రిమమార్గములచే వారి నసహాయులుగ గావించుటకై కాన్ స్టాంటినోపులు ప్రభుత్వమువారు పతకముల నాలోచింపజొచ్చిరి. జాతీయవాదపక్షమునకు కమాలు గుండెకాయ. అతని నేవిధముగనైన కడతేర్చినయెడల జాతీయవాదులు నాయకుడులేక నిరుత్సాహపడి తమ యత్నముల విరమింతురని తలంచి, ఈ ప్రభుత్వమువారు దుర్మార్గుల కొందర నీఘాతుక కృత్యమునకై నియమించిరి. కాని దైవానుకూల్యమువలన కమాలీ హంతకుల వాతబడక తప్పించుకొనెను. శ్రీ కాళేశ్వరరావుగారి తురుష్క ప్రజాస్వామికమునుండి ఈ హత్యాప్రయత్న వృత్తాంతము సవిస్తరముగ నొసంగబడుచున్నది:—

“ఈ కుట్రలయొక్క పట్టుదల, క్రౌర్యము, ఎంతవర కుండెనో హిందూదేశమునుండి వెళ్ళిన ముస్తఫాసఫీర్ అని పేరు పెట్టుకొన్న హంతకుని విచారణవలన ౧౯౨౧ వ సంవత్సరము మే నెలలో బయలు బడెను.

ఈ హంతకుని అంగోరాకు ముస్తఫాకమాలును చంపుటకై పంపకమునుపు ఆంగ్లేయులు అనోషియర్ ఖాన్ అను భయంకరమైన జైలులో పడవేసిరి. ఇంతలో ఆయన తప్పించుకొని పారిపోయినట్లు కనపరచిరి. ఆయన తాను హిందూదేశములోని ఖిలాఫతుసంఘప్రతినిధిననియు, తానును తురుష్కజాతీయ పోరాటములో పోరాడుటకై

కాగా దుష్టులగు ఆంగ్లేయులు తనను పట్టుకొని ఖైదులో వేసిరనియు, తాను దైవానుగ్రహమున తప్పించుకొని పారిపోయి బ్రతికివచ్చితిననియు, మహమ్మదీయ మతము కొరకును, తురుష్క-స్వాతంత్రముకొరకును, ప్రాణముల నర్పించుటకు సిద్ధముగ నుంటిననియు, చెప్పి అంగోరాలో ముస్తఫాకమాల్ పాషా యొక్క సేనలో జేరెను. అంగోరా నుండి సమాచారములు ఎప్పటి కప్పుడు కాన్‌స్టాంటినోపులు లోని జాతీయవాదులకు తీసికొని వెళ్ళు పనిలో వేయించుకొనెను. ఆయనను జాతీయవాదులు నమ్మి అట్టి ముఖ్యమైన పనిలో నియమించిరి. కొంతకాలము అంగోరా లోని సమాచారములు కాన్‌స్టాంటినోపులులోని ఆంగ్లేయ ప్రతినిధులకు తెలుపుచుండెను. ఆయనయొక్క బండి తోలు వాండ్లవల్లను, నౌకరులవల్లను ఆయన ఆంగ్లేయుల గూఢచారి యనియు, ముస్తఫాకమాలును చంపుటకు ప్రయత్నము కావించుచున్నాడనియు, అంగోరాలోని ప్రభుత్వోద్యోగులకు తెలిసినది. ఆయనను కనిపెట్టి ఆయన చర్యలను వివరము ఎప్పటికప్పుడు అంగోరా యుద్యోగస్థులకు తెలుపుటకు ఆయనపైన నొక గూఢచారిని నియమించిరి. ఆయన క్రింద నొక నౌకరుగ మరియొక తురుష్క-గూఢ చారి ప్రవేశించి పని చేయుచుండెను. ముస్తఫాకమాలు ఆయన యెడల ఎక్కువ జాగ్రత్తగ సంచరించుచుండెను. పాపము ముస్తఫా సఘీర్ కేసంగతి తెలియక తాను నియమింప బడిన ప్రకారమే సంచరించుచుండెను. ఒకరోజున ఆయనవద్ద తగిన నిదర్శనములుండగ ఆయనను తురుష్క-జాతీయ

ప్రభుత్వపు పోలీసులు పట్టుకొని అంగోరాలో విచారణకు పెట్టిరి. ఆయనకు ముప్పది సంవత్సరముల వయస్సు. ఆయన మంచి కుటుంబమునకు చెందినవాడు, విద్యావంతుడు. విచారణలో ఆయన తన నిజవృత్తాంతమునంతను బయలు పరచుచుండగా అంగోరా ప్రజలెల్ల విస్మయచిత్తులై నిశ్శబ్దముగ వినుచుండిరి. ఆయన హిందూదేశములోని కాశీపట్టణ వాస్తవ్యుడగు మహమ్మదీయుడు. చిన్నతనమునందే హిందూదేశ ప్రభుత్వమువారాయనకు విద్యార్థి వేతనము నిచ్చి ఇంగ్లాండునకుపంపి ఉత్తమ విద్యను చెప్పించిరట. ఆక్సుఫర్డులో బి. ఏ., పరీక్షయందు త్తీర్ణుడు కాగానే ఈజిప్టు జాతీయవాదులపై రహస్యముగ దృష్టియుంచుటకై కైరోపట్టణమున ఆయనకు ఉద్యోగమియ్యబడెనట. తరువాత పారసీకములోను, ఆఫ్ఘనిస్థానములోను, హిందూదేశములోను జాతీయవాదులను ముఖ్యముగ మహమ్మదీయ జాతీయవాదులను రహస్యముగ వెంటాడుచు వారిచర్యలు కనిపెట్టి ఆంగ్లేయ ప్రభుత్వమునకు తెలుపుచుండుటకై అనేక స్థలములలో పనిచేసెను.

ప్రతినెలకు తురుష్క సుల్తాను ఆంగ్లేయులవలన ఎంత సొమ్ము పుచ్చుకొనుచుండెనో ఆయన విచారణలో తెలియ పరచెను. ముస్తఫా కమాలుపాషా ఆంగ్లేయులకులోబడి నట్లయిన ఆంగ్లేయులు రెండుకోట్లరూప్యము లిచ్చుటకు నిశ్చయించిరని తెలిపెను. తనకెంత విలువకలదో అదివరకు తనకు తెలియులేదనిచెప్పి ముస్తఫా కమాలు పకపక నవ్వెను. ముస్తఫా కమాలును హత్యకావించుటకై సుల్తాను,

దామాదుపాషాపక్షపుమంత్రులు, కాన్స్టాంటినోపులులోని ఆంగ్లేయ సైనికాధికారులు కుట్రను పన్నిరనియు, అనటోలియాలో ముస్తఫాకమాలును హత్యచేయుటకు తనను నియమించిరనియు ఆయన చెప్పెను.

'ఈపనికి నిన్నెందుకు నియమించిరి' అని ఆయన నడిగిరి. ఇంతకన్న ఎక్కువ అపాయకరమైన పనిలో నేను నియమింపబడి జయప్రదముగ ఆపనిని ముగించి యుంటిని. అందువలన నా సామర్థ్యమునందు నమ్మకముగలిగినన్నా పనియందు నియమించిరి' అని ఆయన బదులు చెప్పెను.

ఈవిధముగ యావత్తు వృత్తాంతమును బయలుపరచి సందులకు తన నిజమైనపేరును, తన గౌరవమైన కుటుంబము యొక్క పేరును బయలుపెట్ట నవసరములేకుండ తనకు మరణశిక్ష నివ్వవలసినదని ఆయన వేడెను. ఆయనను ఉరిదీసిరి."

ఈవిధముగ కాన్స్టాంటినోపులు ప్రభుత్వమువారును, ఆంగ్లేయులునుకలిసి చేసిన దుర్మార్గ ప్రయత్నములు విఫలమయ్యెను. ఈ దుష్ప్రయత్నములు తురుష్కులకు ముస్తఫాకమాలునందుగల ప్రేమగౌరవములను, కాన్స్టాంటినోపులు ప్రభుత్వమునెడలను, వారిమిత్రులగు నాంగ్లేయుల యెడలను విరోధమును, అసహ్యమును ఇనుమడింపజేసెను. గ్రీకులుకూడ కమాలుపాషాను తుద ముట్టించుటకై ప్రయత్నించిరి. కాని వారియత్నములకుకూడ

నిదియే గతిపట్టెను. కమాలునుచంపు ప్రయత్నములు విఫలములైనందున ఆతడుమరణించెనని గ్రీకులు ప్రవాదములుపుట్టించిరి. ఆతడాంగ్లేయులకడ లంచములు పుచ్చుకొని దేశద్రోహియయ్యెనని ప్రకటించిరి. కాని యీచదరంగపు ఎత్తులుకూడ వ్యర్థము లేఅయ్యెను.

## మొదటి భాగము

### తొమ్మిదవ ప్రకరణము

సంపూర్ణము





కొండా శంకరయ్యగారి ప్రిమియర్ ముద్రాక్షరశాల, సికింద్రాబాద్.

# ప్రజాభిప్రాయములు.

## ప్రాథమిక స్వత్వములు.

(గ్రం. సు. ప్రతాపరెడ్డిగారు. బి. ఏ., బి. ఎల్.)

" ఇది ప్రతిరోజు ప్రతియాంధ్రుడు పారాయణం చేయదగ్గ గ్రంథం. ధార్మిక గ్రంథ పారాయణంచేత ధార్మిక భావాలు గట్టి పడేలాగు ఈ గ్రంథ పారాయణంవల్ల రాజకీయ, ఆత్మీయ, స్వాతంత్ర్యభావాలు గట్టిపడుతాయి"

—భారతి

"ప్రాథమికస్వత్వములు లేని మానవ జన్మ నిరర్థకమను భావ ముట్టిపడు నట్లుగా వ్రాయబడినది."

—గృహలక్ష్మి

"దేశదేశములందలి స్వాతంత్ర్య సమరముల చరిత్రలు, స్వాతంత్ర్యోద్యమ స్వరూపము, హైద్రాబాదులో అమలునందున్న ప్రజాస్వత్వములు ఈ గ్రంథ మందు చక్కగా వివరింపబడియున్నవి. స్వాతంత్ర్యోద్యమమును తెలియగోరు వారికిది చాల ఉపకరించును"

—ఆంధ్రవార

" స్వాతంత్ర్యహక్కుల పోరాటము, మానవుని పౌరస్వత్వ హక్కులు సంపాదన ఈ పుస్తకములో క్లుప్తంగా సింహావలోకనముంది. అందరూ ముఖ్యంగా నైజాం ప్రజలు చదవాలసినపొత్తం"

—నవశక్తి

"బాధ్యతాయుతప్రభుత్వం అంటే ఏమిటో తెలుసుకోవడానికి ఈ పుస్తకం చాలా ఉపయోగపడుతుంది"

—ఆంధ్రవాణి

" ఈ గ్రంథమందు వివిధకాలములందు మానవుడు స్వాతంత్ర్యముకొరకై గావించిన పోరాటము, నవీనకాలమున ఫ్రాన్సు, అమెరికా, ఇంగ్లాండు, స్విట్జర్లండు రష్యా దేశములలోని స్వాతంత్ర్య లక్షణములు, భారతదేశములోను, మ. ఘ. వ. నిజాంరాష్ట్రములలోను స్వాతంత్ర్యావకాశములు సామాన్యజనులకు తెలియునట్లు చర్చింపబడియున్నవి"



—గోలకొండ

# వెలువడిన గ్రంథములు.

| | | సభ్యులకు | ఇతరులకు |
|---|---|---|---|
| * ౧. | హైందవధర్మవీరులు (హైందవధర్మపోలీలు) | ౦-౪-౦ | ౦-౬-౦ |
| ౨. | రైతు-భూమి-ఋణము. (అనుబంధప్రచురణము ౧) | ౦-౧౦-౦ | ౦-౧౦-౦ |
| ౩. | ప్రాథమికస్వత్వములు. | ౦-౪-౦ | ౦-౫-౦ |
| ౪. | సంస్థాన ప్రజలసమస్యలు (అనుబంధప్రచురణము-౨) | ౦-౨-౦ | ౦-౨-౦ |
| ౫. | కమాల్ పాషాజీవితము. (మొదటిభాగము) | ౦-౪-౦ | ౦-౬-౦ |
| ౬. | కమాల్ పాషాజీవితము. (రెండవభాగము) | ౦-౪-౦ | ౦-౬-౦ |

# వెలువడనున్న గ్రంథములు.

౧. ప్రజలు-ప్రభుత్వము.
౨. గాంధివాదము-సామ్యవాదము.
౩. దేశీయసంస్థానములు-ఫెడరేషను.
౪. అహింసా ప్రభావము.
౫. సంస్థానప్రజలస్వాతంత్ర్య సమరము.
౬. గ్రామజనదర్పణము.
౭. జాగీర్లపరిపాలనము.
౮. ఝాన్సిలక్ష్మీబాయి.
౯. నిత్యజీవనమునందు విజ్ఞానశాస్త్రము.
౧౦. ప్రజాజీవన సమస్యలు.

* రెండవముద్రణము.



కొండా వెంకటయ్యగారి ప్రీమియర్ ప్రెస్, సికింద్రాబాద్.